# ఆంధ్రసచిత్ర వారపత్రిక

# విషయానుక్రమణిక




Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55

సంచిక 18

13-1-60
బుధవారం

వికారి పుష్య బహుళ పూర్ణిమ



విడిప్రతి వెల 25 న. పై.

సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


ముఖచిత్రం

శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి

[స్వామివారి చిత్రపటమును ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రముగా ప్రకటించుటకు అనుమతినొసగిన తిరుపతి దేవస్థానం అధికారులకు మా కృతజ్ఞత. 33 వ పుటనుండి మధ్యపుటల వరకు మరికొన్ని తిరుపతి చిత్రములు, వ్యాసములు చూడండి.]



## ఉత్తరాలు

ఆర్యా,

30-12-59 సంచికలో "అదీ - ఇదీ" శీర్షికలో "ఇంకా కర్నూలే!" అని ఆశ్చర్యం ప్రకటించారు. కాని మన సినిమా పంపిణీదార్లు ఇంకా సీడెడ్, నైజాం ప్రాంతాలు అని వ్రాయటంకూడా అంతే ఆశ్చర్యం. కనీసం తెలంగాణా, రాయలసీమ అని వ్రాసినా బాగుండును.

భవాని, మానుకొండ.

### సినిమా విమర్శలు

30-12-59 వారపత్రికలో ఒకరు "పత్రికలోని చిత్రసమీక్షలు ఏదో హాస్యం కొరకు ఒకలా వ్రాద్దామనుకుంటే అసహ్యంగా తయారవుతున్నాయి," అనిఅన్నారు. నిజానికి మీ పత్రికలో ఈ చిత్రవిమర్శలు రాసేవారు బాగా విమర్శిస్తున్నారు. పెడుతూ, ఇటు పాఠకులకు వినోదదాయకముగాను, అటు సినీమా నిర్మాతలకు కష్టంగా ఉండకుండాను వ్రాస్తున్నారు. వారి విమర్శను బట్టి, సినిమాలలో సహజత్వం లేదని అర్థమౌతోంది. అది నిజం. "బాగున్నదనీ తేల్చరు, బాగులేదనీ తేల్చరు" అని అన్నారు. ఒక చిత్రములో ఒకటి బాగుండవచ్చును, మరొకటి బాగులేకపోవచ్చును. ఏ విమర్శలు "అసహ్యం" గా తయారయ్యాయో ఉదహరించి ఉండిన బాగుండేది.

పులుగుర్త వెంకటశివకుమార్
గజపతి నగరం.

* * *

ప్రత్యేకంగా, సినిమా శీర్షిక అంటే నేను పడి "..." పోతాను. నిజంగా ఆ శీర్షికను కంటిన్యూ చేస్తూ చదువుతోంటే, సినిమా చూసినదాన్నా ఎక్కువ ఆనందంగా ఉంటోంది. చదివినవే మరల చదివి ఆనందిస్తోంటాము.

ఎన్. కాంతారాం,
గొల్లప్రోలు.

### రాళ్ళపల్లి

శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారిని గూర్చిన ముఖ్యాంశాలు సులభంగా పరిచయంచేశారు. మీరు వ్రాసిన ఒక్కొక్క విషయం చదివితే వారి సంపూర్ణ విగ్రహం కన్నులకు గట్టినట్లవుతుంది. తెలుగుభాషకు వారు చేసిన సేవ "సూక్ష్మంలో మోక్షం" అన్నట్లు తెలిపారు. ఇంకా ముందు ముందిట్టి కవిపండిత విమర్శకులను పరిచయం చేయటం చాలా మంచిది.



శ్రీ భోగ శ్రీనివాసమూర్తి (తిరుమల)

# స్వాగతమ్మిదె నీకు-సంక్రాంతి లక్ష్మి

## తిప్పావఝుల వెంకటరామయ్య

స్వాగతమ్మిదె నీకు-సంక్రాంతి లక్ష్మి
సరగుననను మావాడ-కరుదేరవమ్మ!
పండబారినచేల-పసిడిరంగుల చీర
పసిమిమించినముద్ద-బంతిపూవులరవిక
తలపూలుగావింత-చేమంతుల ధరించి
తరలిరావమ్మ మా-తెనుగుధాన్యపు లక్ష్మి
॥స్వా॥

ముంగిళ్లలోపలను-రంగవల్లుల దీర్చి
గుమ్మడిపూవులను-గొబ్బిళ్ల నమరించి
వెలుగుకన్నులతోడ-తెలుగు కన్యలు నీకు
స్వాగతమ్మిడుదు రిదె-సరగుననురావమ్మ
॥స్వా॥

కోరికల పట్టీల-క్రొత్త అల్లుం డ్రరుగొ!
కొసరు కోరికలతో-క్రొత్తాడబడుచులు!
అలమటిలుహృదయాల-నత్తమామలువారె
వేచియున్నారమ్మ-వేవేగ రావమ్మ
॥స్వాగ॥

జంగమయ్యలశంఖ-నాదమ్ములవె సాగె
డుబ్బుడుక్కలవాని-ఢమరుకంబులు మ్రోగె
హరిభక్తి జియ్యరుల-చిఱుతలవె రవళించె
మేలుకొనిరావమ్మ-మా తెలుగు వాడలకు
॥స్వాగ॥

ముక్కోటియాంధ్రులు-ఒక్క త్రాటికి వచ్చి
సాధించి యభివృద్ధి-సర్వతోముఖముగా
ఆర్జించి విఖ్యాతి-యఖిలభారత ఖ్యాతి
వినతులై ప్రణతులిడ-వేచియున్నారమ్మ
॥స్వాగ॥

# ★ సంక్రాంతి శుభోదయం ★

అమ్మ రోజూ ఆ ప్రక్క పడుకుంటుంది. ఆమె కాస్త పడుకుంటగానే "శ్యామా! కాసిని మంచినీళ్లివ్వగలవూ?" పిలుస్తారు శ్రీవారు. తనకు తెలుసు వారిది పట్టినటవని. అయినా లేస్తుంది తను. "అక్కడ ఒంటిగా పడుకుంటే నిద్ర ఎట్లా పడుతుంది శ్యామా నీకు? నా ప్రక్కని నీ అర్ధభాగం ఖాళీగా వుంటే నాకు మాత్రం నిద్రపట్టదు సుమా" అంటారు, వారి మాటలకు నవ్వు, వారికి తనమీదగల మమతకు గర్వము కల్గుతుంది. ఒకో రోజు మాత్రం "మీకు నిద్రపట్టకపోతే నాకేమి! నాకు నిద్ర పడుతుందిగా" అంటుంది తను పెంకెగా.

"నీ గర్వం నాకు తెలుసు లేవోయ్, ఇంకో నాల్గురోజులు ఓపికపడితే నా ప్రక్కనుండేందుకు చిట్టితండ్రి ఎటూ వస్తూనే వున్నాడాయె, వీడిలెఖ్ఖ ఏమిటనేగా నీ ధీమా." బుంగమూతి పెడతారు శ్రీవారు. "అయితే వాడు పుట్టకుండానే యింత ఈర్ష్య పెంచుకుంటున్నారు ఇహ అయినట్టే" అంటుంది తను.

"అదికాదు కాని శ్యామలా! మనఅబ్బాయి ఎవరిపోలికగా వుంటాడంటావు? మరచిపోయాలే, గుమ్మడిపండు పోలికగా వుంటాడని ఎప్పుడో చెప్పావుగా." నవ్వుతారు వారు. ఎప్పుడో జరిగిన సంఘటనని గుర్తుచేస్తూ. అసలా సంఘటనే చిత్రంగా జరిగింది. ధనుర్మాసం నెల్లాళ్ళు కన్నెపిల్లలు గొబ్బెమ్మల్ని పెడతారుకదూ! తనూ అట్లాగే పెట్టేది, తాతయ్య ఆరోజుల్లో ఆపూజగురించి యిల్లా చెప్పేవాడు. అబ్బో, ఈ పూజ యిప్పటిదా? శ్రీ కృష్ణావతార ఘట్టంలో శ్రీ కృష్ణునిపతిగా గోరి గోపకన్యలు చేశారట మొట్టమొదటి పూజని. వాళ్లు శ్రీ కృష్ణుని పొందినట్లుగానే ఈ పూజచేసిన కన్నెపిల్లలు అనురూప వరుణ్ని పొందుతారు అనేవాడు.

తన పూజంత పురాతనమైనదని తాతయ్య చెపుతోంటే తను గర్వంతో వుప్పొంగిపోయేది. ఇల్లా ఒక్కొక్కటే తలచుకుంటూంటే ఆమెలో పుట్టినింటి బాల్యస్మృతులు మరింత పెరిగిపోసాగాయి.

అసలాపూజ అమ్మ తనచేత అయిదవ ఏటనుంచీ చేయించేదిట. మరీ అంత చిన్ననాటి సంగతులు ఏవీ తనకు గుర్తులేవు కాని ఎనిమిదేళ్ళ వయస్సునించి తనకంతా గుర్తే. సంక్రాంతినాటికి దొడ్డినిండా విరబూసిన చామంతులు- బంతులు- వాటిమధ్య ఎర్రగా పట్టుకుచ్చులల్లేతాము అంత అందంగా కుచ్చు పెట్టుకున్నందుకు తమలో తామే మిడిసిపడుతున్నాయా అన్నట్లుండే సీతమ్మవారి జడబంతులూ, ఎఱ్ఱగా గుండుగా-వాటిమధ్య పచ్చని తళుకుతో మీరేకాదు మేమూ అందగాళ్లమే అన్నట్లుండే విబోగడబంతులు. అందచందాల పూల కన్నెలతో దొడ్డంతా కలకల లాడిపోయేది. వాటిని చూస్తూ మురిసిపోయేదితను. ఆ సమయంలోనే "వాటినేం చూస్తారమ్మాయిగారు, చూస్తే మనపొలంలో గుమ్మడిపాదునే చూడాలి. సొగసంటే దానిదే" అని పాలేరు వెంకాయ్ పూరిస్తుంటే ఒకసారి ఆ పాదును చూసేందుకు పనికట్టుకు పొలము వెళ్లింది తను నాన్నతో.

పచ్చనిచీరకట్టుకు పవ్వళించిన పుడమితల్లిలా ఆ గుమ్మడిపాదూ, బంగారు కాంతుల్ని నలువంకలా చిమ్ముతూ తల్లి పైటచెఱుగుతో ఆడే పసిపాపలలా ఆ గుమ్మడిపూలూ, చీకూచింతా లేకుండా తల్లి వడిలో హాయిగా అదమరచి నిద్రపోయే పాపడిలా ఆ గుమ్మడిపళ్లూ-వెంకాయ్ మాటలో అతిశయోక్తి లేదనిపించింది. "ఆకుపచ్చగా వున్న ఆ పాదు మధ్యలో గుమ్మడిపళ్ళు చాలా అందంగా వున్నాయికదూ నాన్నా" అంది తను.

"అసలు ఆపాదుఅందమంతా ఆపళ్లలోనే ఇమిడి వుందమ్మా. అందుకే కాదూ, గుమ్మడిపండులాంటి బిడ్డనివ్వమని గుమ్మడిపూలతో గొబ్బెమ్మని పూజిస్తారు కన్నెలు," అంటూ వడనిండా గుమ్మడిపూలుకోసిచ్చాడు నాన్న.

ఒక్క సంక్రాంతిఅన్నమాటేమిటి? ధనుర్మాసం నెల్లాళ్ళు తమ యింట్లో అందరికీ గిరాకీగా నేవుండేది. ఓమూల చలిలో వేళ్ళు కొంకర్లు పోతున్నా లెక్కచెయ్యకుండా అమ్మను లేపి ముగ్గుపెట్టేదాకా ప్రాణాలు తోడేదితను. తీరా ముగ్గుపెట్టడము పూర్తయేదో లేదో తాతయ్య గానే వచ్చేవాడు వాకిట్లోకి. "ఇంకా అవలేదుటమ్మా నీపని. అవతల దేవతార్చన వేళవుతూంటేనూ" అనేవాడు.

"అయిపోయిందండీ. పిల్లది ప్రాణాలు తీస్తూంటేనూ ఒక్క ముగ్గువెద్దామనీ" అంటూ హడావిడిగా చేతులు కడుక్కు వెళ్లేది వంటింట్లోకి.

అప్పటికే తయారయేవాళ్ళు "అంబా పలుకు - జగదంబా పలుకు" అంటూ బుడబుక్కలవాళ్ళు. తను విసుక్కుంటూనే బిచ్చంపెట్టేది. వాడు అంతటితో వదిలితేనా "ఒక్క పాతగుడ్డమ్మ, పాతగుడ్డ పడెయ్యి. జగదంబ చక్కని మొగుణ్నిస్తుంది" అనేవాడు. ఎల్లాగో వాణ్ని వదిలించుకునేసరికి తల ప్రాణం తోకకొచ్చేది. అంతలోనే తయారు హరిదాసు. చక్కగా బంతిపూల దండలు, గంధాక్షతలతో అలంకరించిన అక్షయపాత్రని తలమీద వుంచుకు చిరతలు, తంబురా వాయిస్తూ, కాళ్లగజ్జెలు మ్రోగుతుండగా హరినామ సంకీర్తనచేస్తూ, గిర్రున తిరిగేవాడు ముగ్గులో. ఆ ముగ్గు కాస్తా చెరిపేస్తాడా ఏం? తను ఇంకా గొబ్బెమ్మల్ని కూడా పెట్టుకోవాలి అని తన ప్రాణం గిలగిలలాడిపోయేది. ఆ కోపములోనే ఒక్కకసురు

# సంక్రాంతి శుభోదయం

బి. యస్. లక్ష్మి

"పాలకడలి శయనరారా
నేపిలువాగానే ॥పాల॥"

సుదూరంగా కోలిగా వ్వలు తంబురతో పాటు శ్రుతికల్పుతూ 'పాతాని జియ్యారు" కంఠము ఆ సంక్రాంతి చలిని చీలుస్తూ మెల్లగా శ్యామల చెవినితాకి దూర దూరంగా సాగిపోయింది. మళ్ళీఅంతలోనే "అంబపలుకు–జగదంబపల్కు"బుడబుక్కల వాడి ఢమరుకధ్వని, దూరాన గుడిలో ప్రభాత సేవకు ఉపక్రమిస్తున్నందుకు గురుగా భూపాలరాగం ఆలాపించేసన్నాయి మేళం. ఈ సంరంభముతో హేమంతరమణి తనమంచుముసుగును కొంతతొలగించినట్లే కనుపించింది. అప్పుడే ఆ చుట్టుపట్ల చాలా యిళ్లల్లో జనం మేల్కొన్న సవ్వడి విని పిస్తోంది.

నెమ్మదిగా బరువుగా కనులువిచ్చింది శ్యామల. అలా విచ్చుతూన్న ఆమెముఖాన్ని బంగారు కాంతుల్ని ధిక్కరించే సోయగంతో అప్పుడే రేకులు విచ్చుతూన్న గుమ్మడిపూవుతో పోలుస్తాడు శేఖర్. అటువంటి సమయాలలోనే "శ్యామా నీకెవరు పెట్టారో కానీ ఈపేరు, హేమా అని పెట్టాల్సింది" అంటూంటాడు.

బయట అంతులేనిసంక్రాంతిసంరంభము. తన ఈగదిలోపల ముసుగుపెట్టుకు పడుకోటము మనస్కరించలేదు శ్యామలకు. ఈసంక్రాంతిపేరుచెప్పి ఒక్కరోజు కూడా తెల్లవారుజామున లేవలేదు తను. అమ్మసలు ఏపనీ ముట్టనివ్వదు తనను. ఆయనగారు సరేసరి ఉమంచు ఎంతటివాళ్లనూ పడగొడుతుంది. అందులో ఈ టైములోనా? ఏమన్నా అంటే నీకు కోపమొస్తుంది కానీ, శ్యామలా ఆరోగ్యమంటే నీకు బొత్తిగా లక్ష్యంలేదు" అంటూ గొడవ చేస్తారు. మొన్నటికమొన్న అమ్మా నాన్నగారూ తనని పురిటికి తీసుకువెళ్లేందుకు వచ్చినప్పుడు కూడా ఇదేనూ. పల్లెటూరంటే తనకు భయమట. డాక్టరు సహాయమేనా వుండదట. ఇక్కడవుండి తను జాగ్రత్తగా చూస్తున్నారు కనుక కానీ శ్యామలతనబాగు తను తెలుసుకోలేని వయస్సు. అట్లాంటిదాన్ని ఒంటరిగా పురిటికి పంపించను తనకు ఇష్టములేదు అన్నారు ఒంటరిగా కాకపోతే పురిటికి అంతా జంటగా పోతున్నారా యేం? నా రథం కాకపోతేను. నవ్వుకుంది శ్యామల.

పుట్టినప్పటినుంచి ఈయనే అంగరక్షలు వేస్తున్నట్లు మాట్లాడుతాడేమిటి? మా పిల్ల బాగు మాకు తెలియదా? పల్లెటూళ్లల్లో ఎవరూ పురుళ్ళుపోసుకోటము లేదా? అని చాటుగా గొణుక్కుంది.

అల్లుని మాటకు నాన్నగారు ముసిముసి నవ్వులు నవ్వుకుని పురిటికి అమ్మను దిగవిడిచి వెళ్ళిపోయారు. ఏమైనా సంక్రాంతి నెలం తగడిచేపోయింది. ఇవేళతో ఆఖరేనాయిరి.

ఇవేళైనా ఒక ముగ్గువేసివస్తే బాగుండును. లేవబోయింది శ్యామల. ఆమె తనూలతని చుట్టివుంచిన శేఖర్ బాహువల్లరి ఆమె ప్రయత్నాన్ని వారించింది. అప్పుడు జ్ఞప్తికి వచ్చింది ఆమెకు తను రాత్రి శేఖర్ ప్రక్కమీదే పడున్నట్లు. ఎదురుగా తెల్లటి దుప్పటి పరచి వలగని ప్రక్క శ్యామలని వెక్కిరించింది. పూర్ణగర్భిణి అయిన తను ఏక శయ్యమీద పడుండటము మంచిది కాదని



హరిదాసు

# సాంఘికాలే ఎక్కువ

**మాకు** సాంఘికచిత్రాలు కావాలి. కథ చాలాముఖ్యం. కథ బాగుండాలి. ఆతరవాతే తారాగణం. కత్తియుద్ధాలూ, స్టంటులూ, నిడివి పట్ల మాకేమీ మోజులేదు అని, తెలుగుసినిమాప్రేక్షకులకు ప్రతినిధు లనతగ్గ పదివేలమంది పిన్నలూ పెద్దలూ తమ అభిప్రాయం ప్రకటిస్తున్నారు.

“మన చలనచిత్రాలు నానాటికీ అసహజంగా తయారవుతున్నాయి. ఇప్పటిచిత్రాల తరహాలో వాతావరణంలో త్వరగా మార్పురావడం అవసరం” అని స్పష్టపరిచారు.

సమకాలిక జీవితంతో సంబంధంలేని జానపదచిత్రాలపట్ల మోజు లేదని వెల్లడిచేశారు. ఉపన్యాసాలవంటి సంభాషణలు గుప్పించవద్దని విజ్ఞప్తిచేశారు.

ఈమాట చెప్పినవారు తెలుగుసినిమాపట్ల గాఢమైన అభిమానం ఉన్నవారు. దానిగురించి ఆలోచించినవారు. డబ్బులిచ్చిపోషించేవారు. వీరిలో నూటికి 70 మంది పైచిలుకు ఎక్కువగా తెలుగుసినిమాలు చూచేవారు. కాబట్టి దీనిపై మాట్లాడేందుకు విశేషమైన అధికారం గలవారు.

నూటికి 30 మందికి పైగా నెలకు నాలుగు-అంటే సగటున వారానికి ఒకచిత్రం చూస్తారు. నెలకు రెండుచూచేవారు నూటికి 27 గురు. బాగున్న చిత్రాన్ని రెండుసార్లు చూచేవారు నూటికి 60 మంది. మూడునాలుగుసార్లు చూచేవారు నూటికి 40 పైచిలుకు. చేతిలో డబ్బులేకపోతే చేబదులు అయినాచేసి మరీ చూసేవారు సగానికిపైగా ఉన్నారు!

మన్నన చేయతగ్గ కొందరు ప్రేక్షకుల, చలనచిత్రకారుల మాటలలో—“కట్టుతప్పుతున్న తెలుగు సినిమాకు” క్రమశిక్షణ ఏర్పరచి మంచి చిత్రాలు రావడానికి అనుసరించతగిన మార్గాలు-సినిమాను పోషించే ప్రేక్షకుల అభిప్రాయాలూ చర్చించి-వాటిని సమీ




## మీ కేం కావాలి?

సంఖ్యలు నూటికి ఎందరో తెలియచేస్తాయి.

| | |
|---|---|
| **I మొత్తం మీ కుటుంబంలోవారి సంఖ్య :** | |
| 1. ఐదుగురి లోపు ... ... | 33.3 |
| 2. ఐదూ పదిమంది మధ్య ... ... | 53.2 |
| 3. పది పైన ... ... | 11.9 |
| **II మీ కుటుంబానికి ముఖ్య జీవనాధారం :** | |
| 1. వ్యవసాయం ... ... | 26.6 |
| 2. వ్యాపారం ... ... | 15.4 |
| 3. ఉద్యోగం (నెలకు రు. 200కు పైబడి) | 23.8 |
| 4. ఉద్యోగం (నెలకు రు. 200 లోబడి) | 33.0 |
| **III మీరు నెలకు చూసే సినిమాలు (సుమారుగా) :** | |
| 1. నెలకు ఒకటి ... ... | 15.2 |
| 2. ,, రెండు ... ... | 27.2 |
| 3. ,, మూడు ... ... | 25.1 |
| 4. మూడుకు పైన ... ... | 31.4 |
| **IV సినిమాకు వెళ్ళేటపుడు :** | |
| 1. మీ యింట్లో ఆడా మొగా పిల్లా జెల్లా అంతా కలసి వెళ్తారు ... ... | 32.8 |
| 2. ఎవరిమటుకువారు ఎవరికి తోచినపుడు వారు వెళ్తారు ... ... | 43.4 |
| 3. ఆడవాళ్ళు విడిగా ఇరుగుపొరుగులతో కలసి వెళ్తారు ... ... | 23.3 |
| **V ఊళ్ళోకి సినిమా వచ్చినపుడు :** | |
| 1. విడుదల అయీ అవగానే మీరు వెళ్తారు | 42.4 |
| 2. జనం తగ్గిన తరువాత వెళ్తారు ... | 56.7 |
| **VI మీకు ఒక సినిమా చాలాబాగుందని తోచినపుడు :** | |
| 1. అది రెండుసార్లు చూస్తారు ... | 5[illegible].5 |
| 2. రెండుకన్న ఎక్కువసార్లు చూస్తారు | 41.5 |
| **VII ఊళ్ళో మంచి చిత్రం ఆడుతోందని అంతా అంటూ ఉంటే :** | |
| 1. మీ చేతిలో డబ్బు లేదని వదిలేస్తారు | 43.5 |
| 2. చేబదులు చేసిఅయినా వెళ్ళి చూస్తారు | 54.0 |
| **VIII మీరు సాధారణంగా వెళ్ళే తరగతి :** | |
| 1. పదణాలూ, అంతకు లోపూ ... | 47.6 |
| 2. పదణాలు ఆపైనా ... ... | 51.7 |
| **IX మీరు సినిమాకి వెళ్ళడానికి :** | |
| 1. హాలు దగ్గరగా ఉంటే తరచూ వెళ్తారు | 56.8 |
| 2. హాలు అందంగా ఉండి, సదుపాయాలు బాగుంటే చాలునని వెళ్తారు ... | 41.3 |
| **X మీరు చూసే చిత్రాలు ఎక్కువగా :** | |
| 1. తెలుగువి ... ... | 72.7 |
| 2. హిందీవి ... ... | 20.1 |
| 3. ఇంగ్లీషు ... ... | 06.5 |
| **XI మీరు ముఖ్యంగా సినిమాలలో కోరేవి :** | |
| 1. పెద్ద తారాగణం ... ... | 12.8 |

# మందికి ఇష్టం: మీకేం కావాలి ప్రశ్నావళి ఫలితాలు

# మంచికథముఖ్యం; తరవాతే మిగతావి

## నేటి తరహా మారాలని జనవాక్యం

కళింగి పరిశ్రమకు అందచేసే ఆశయంతో, ఆంధ్ర సచిత్రవారపత్రిక మొన్న అక్టోబరులో

"మీ కేం కావాలి?"

అని ప్రేక్షకులను ప్రశ్న వేసింది. అందుకు తమ అభిరుచులనూ, అభిప్రాయాలను, స్థితిగతులను వివరిస్తు పదివేలమంది చిన్నలూ పెద్దలూ, స్త్రీలూ పురుషులూ సమాధానాలు వ్రాసి పంపారు. వీరిలో వ్యవసాయం జీవనాధారంగా గలవారు, వ్యాపారస్థులూ, ఉద్యోగస్థులూ ఉన్నారు. బడిపిల్లలూ, విద్యార్థినులూ ఉన్నారు.

ఆంధ్రదేశపు సినిమా ప్రేక్షక బాహుళ్యంలో—చదువుకొన్న వారందరికీ ఈ పదివేలమందీ ప్రాతినిధ్యం వహిస్తారనడానికేమీ సందేహంలేదు. దేశదేశాల అనేక సమస్యలపై జరిగే నమూనా సర్వేలను సరితూగే స్థాయిన ఇందరు పాఠకులు ముందుకు వచ్చి తమ అభిప్రాయాలను స్పష్టపరచడం గర్వించతగ్గ విషయం. సినిమాపట్ల ప్రజలకు గల గౌరవాభిమానాలకూ, దానిమీద వారు పెట్టుకొన్న ఆశలకూ, తమ నిత్యజీవితంలో సినిమాలకు ఇచ్చిన ప్రముఖస్థానానికీ ఈ సంఖ్య నిదర్శనం. ఈ అభిప్రాయ ప్రకటన తెలుగు సినిమాపరిశ్రమ మంచి చిత్రాలు అందివ్వడంలో నవమార్గాలను అన్వేషించడానికి అనేకవిధాల దోహదం చేయగలదని విశ్వసిస్తున్నాము. ప్రశ్నావళిని సమగ్రమైన సమాధానాలతో ఈ క్రింద పొందుపరచాము. మాకు వచ్చిన పదివేల ఎంట్రీల లోనూ నూటికి ఎందరు ఏ అభిప్రాయం ప్రకటిస్తున్నారో, ఏ వర్గానికి చెందుతారో పట్టికలో సంఖ్యలు తెలియచేస్తాయి.

ఆంధ్ర సచిత్రవారపత్రిక తలపెట్టిన ఈ ప్రయత్నాన్ని ఇంత జయప్రదం చేసిన పాఠకులందరికీ కృతజ్ఞతాభివందనలు.

* * *

ఈ ప్రశ్నావళి కార్యక్రమంలో పాల్గొని సమాధానాలుఇచ్చిన వారుసహా, సినిమాలు చూసేవారూ తీసేవారూ కూడా దీనిని శ్రద్ధగా పరిశీలించవచ్చు. మరొకవిధంగా

| | |
|---|---|
| 2. మంచికథ ... ... | 18.8 |
| 3. సంగీతం ... ... | 09.4 |
| 4. చురుకైన సంభాషణలు ... | 07.6 |
| 5. హాస్యం ... ... | 05.5 |
| 6. ఉపన్యాసాలు ... ... | 01.5 |
| 7. కత్తియుద్ధాలూ, సాహసకృత్యాలూ | 0.38 |
| 8. డాన్సులూ, సెట్‌లూ బాగుంటే వెళ్తారు | 05.9 |
| 9. 15,000 అడుగులపైగా పొడవు ఉండాలి | 01.5 |
| 10. మీరు డైరెక్టరు పేరు చూసి వెళ్తారు | 01.7 |
| 11. కంపెనీ పేరు గాని నిర్మాత పేరు గాని చూసి వెళ్తారు ... ... | 05.9 |
| 12. పై అంశాలలో ఏ కొన్ని ఉన్నా తప్పకుండా వెళ్తారు ... ... | 18.1 |
| 13. ఏ ఒక్కటి ఉన్నా వెళ్తారు ... | 07.8 |
| **XII మీకు ఇష్టమైన చిత్రాలు :** | |
| 1. సాంఘిక చిత్రాలు ... ... | 51.2 |
| 2. పౌరాణికాలు ... ... | 23.8 |
| 3. జానపదాలు ... ... | 09.4 |
| 4. చారిత్రకాలు ... ... | 15.0 |
| **XIII చలనచిత్రం సాధారణంగా :** | |
| 1. సుఖాంతంగా ఉంటే ఇష్టం ... | 57.1 |
| 2. దుఃఖాంతంగా ఉంటే ఇష్టం ... | 41.9 |

* * * *

| | |
|---|---|
| 1. మొదట్నించీ చివరదాకా హాస్య ప్రధానంగా ఉంటే మీకు నచ్చుతుంది | 41.0 |
| 2. కష్టాలు, ఉద్వేగభరిత సన్నివేశాలూ లేకపోతే మీకు తృప్తి కలగదు ... | 52.9 |
| **XIV ఈ క్రింది అభిప్రాయాలతో మీరు ఏకీభవిస్తారా?** | |
| 1. ఇప్పటి చలనచిత్రాల తరహాలో వాతావరణంలో త్వరగా మార్పు రావడం అవసరం | 41.0 |
| 2. మన చలనచిత్రాలు నానాటికీ అసహజంగా తయారు అవుతున్నాయి ... | 58.3 |
| **XV మీరు సినిమా చూసే ముందు :** | |
| 1. మీ స్నేహితుల అభిప్రాయాలు తెలుసుకొని వారు బాగుందంటే వెళ్తారు ... | 25.1 |
| 2. బాగులేదంటే ఎందుకు బాగులేదో చూసి తెలుసుకుందమని వెళ్తారు ... | 35.2 |
| 3. పత్రికల అభిప్రాయాలనుబట్టి వెళ్తారు | 39.1 |
| **XVI చిత్రప్రచారానికి చేసే ప్రకటనలు అనేక రకాలు : వాటిలో మీరు శ్రద్ధగా చూసేది :** | |
| 1. గోడలమీద అంటించే పోస్టర్లు ... | 07.5 |
| 2. పెద్ద పెద్ద బానర్లు ... ... | 24.1 |
| 3. పత్రికలలో ప్రకటనలు ... | 53.2 |
| 4. కరపత్రాలు ... ... | 04.6 |



# సినిమా పోటీలో ఎనిమిదిమందికి బహుమతులు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక (1959 నవంబరు 4) లో "మీకేం కావాలి?" అనే శీర్షికక్రింద ఏర్పరచి ప్రచురించిన సినిమా పోటీలో ఎనిమిదిమంది నెగ్గారు. పోటీ ప్రకటించినపుడే ముందుగానే నిర్ణయించి సీలువేసిన కవరులో భద్రపరచిన సమాధానంతో ఈ ఎనిమిదిమంది ఎంట్రీలూ సరిగావచ్చినందువల్ల బహుమతిని ఈ ఎనిమిదిమందికి పంచుతున్నాము.

## సరియైన సమాధానం పంపినవారి పేర్లు

వి. వి. వి. రాఘవరావు (ఏల్చూరు)
రెడ్డి సాంబశివరావు (ఖర్గపూర్)
డి. వెంకటేశ్వరరావు (వైరధరి అన్నవరం, నందిగామ తాలూకా)
మిస్ బి. ఇవాంజెలిన్ (నెల్లూరు)
మోటూరు వెంకటకృష్ణకుమారి (తెనాలి)
విన్నకోట రామారావు గుప్త (విశాఖపట్టణం)
ఎ. స్వర్ణలత (ఎడ్లపల్లి, గుంటూరుజిల్లా)
చిక్కాల హరనాథబాబు (చింతలపూడి - ప. గో. జిల్లా)

## సరియైన సమాధానం

| | | | ఎ. | బి. |
|---|---|---|---|---|
| 1. సినిమా హిట్ అవడానికి ఇది చాలా ముఖ్యం | ఎ. మాటలు, | బి. పాటలు | × | |
| 2. చలనచిత్రాలు విధిగా అందించవలసినది. | ఎ. విజ్ఞానం, | బి. వినోదం | | × |
| 3. ప్రేక్షకబాహుళ్యానికి ఎక్కువ ఆనందం కలిగించేది. | ఎ. హాస్యం, | బి. లాస్యం | × | |
| 4. ఒక చిత్రం సాంకేతికంగా రాణించాలంటే ముఖ్యమైనది. | ఎ. ఛాయాగ్రహణం, | బి. శబ్దగ్రహణం | × | |
| 5. చిత్రం విజయవంతం కావడానికి ముఖ్య కారణం. | ఎ. ధనం, | బి. జనం | × | |
| 6. ఇటువంటి ఘట్టాలు ఎక్కువ ప్రజాదరణ పొందుతాయి | ఎ. సుఖవంతమైనవి, | బి. దుఃఖవంతమైనవి | × | |
| 7. ఒకచిత్రానికి డబ్బురావడానికి ఎక్కువగా బాగుండవలసినది | ఎ. నాయికపాత్ర, | బి. నాయకపాత్ర | | × |

మనకు తెలియని విషయాలు ఎన్నో దీనివల్ల తెలుస్తాయి.

ఈనాటి పరిస్థితులు, చక్కగా అమరినట్టుగా ఈ సమాధానాలకు అన్వయిస్తున్నాయి. వీటిలో ప్రతిబింబిస్తున్నాయి. గత రెండుమూడేళ్ళుగా పౌరాణిక జానపద చిత్రాలకన్న సాంఘికాలే ఎక్కువగా ప్రజాదరణ పొందుతూ ఉన్నాయన్న సంగతి అందరికీ తెలుసు...దీనినే ప్రేక్షకులు ఈ ప్రశ్నావళిలో స్పష్టంగా చెప్పారు. సాంఘిక చిత్రాలు కావాలంటున్నవారు నూటికి 61 మంది ఉంటే పౌరాణికాలు కోరేవారు నూటికి ఇరవైముగ్గురు. చారిత్రకాలు, మనకి లేకపోయినా ఉంటే బాగుండుననుకునేవారు 15% ఉన్నారు. జానపదాలపట్ల అభిమానంగలవారు నూటికి తొమ్మండుగురున్నారు.

బాక్సాఫీసు సూత్రాలు అని పలువురు నిర్మాతలు నమ్ముతున్న వాటిపై అభిప్రాయం కూడా దీనికి తగినట్టే ఉంది. సినిమాలో కత్తియుద్ధాలూ, సాహసకృత్యాలు, తమిళ చిత్రాలనుండి దిగుమతి అయి వ్యాపిస్తున్న ఉపన్యాసాలూ డాన్సులు వగైరాలపట్ల మోజు లేదని (11వ ప్రశ్న) విశదం అయింది. అలాగే బాక్సాఫీసు సార్ వాల్యూగల నటులుఉంటే మిగతా ఎలావున్నా ఫరవాలేదన్న ధీమా సరికాదని వారి ప్రతిభను కాక పేరును మాత్రం అమ్ముకుంటామంటే కొనేవారులేరని అనేక చిత్రాలు సూచించాయి. ఈ ప్రశ్నావళిలో ప్రేక్షకులూ ఆసంగతి స్పష్టపరిచారు. చిత్రం15000 అడుగులకు పైగా ఉండాలని కోరేవారు నూటికి ఒకరిద్దరు మాత్రమే ఉన్నారు. ఇది చాలా ముఖ్యవిషయం. ఎందుకంటే, ఈ నిడివే నేటి తెలుగుసినిమాలో అనేక అనర్థాలకు ముఖ్యకారణం. 14 వేల అడుగులకు సరిపడేకథను, కేవలం నిడివికోసమని లేనిపోని ఘట్టాలతో 18 వేలకు సాగదీస్తున్నారు. దానివల్లనే ఉన్న కాస్తకథా పురిలేనిదారం అయిపోతోంది. నీరుకలసినపాలు అయిపోతోంది. చాచా ప్రదర్శనం అయిపోతోంది. ఇంతటికీ ఒక ముఖ్య కారణం చిత్రం పొడుగ్గా లేకపోతే జనం చూడరన్న నమ్మకమే. ఈ విధంగా చిత్రం తయారవుతోంది కాబట్టే, దర్శకుడనేవాడిముద్ర సాధారణంగా చిత్రాలలో కనబడదు. సామర్థ్యం, ఉత్సాహం ఉన్న దర్శకుడు కూడా ఉదాసీనవైఖరితో కథలను చిత్రిస్తున్నారు.

అందువల్లనే, ఈనాడు దర్శకుడి పేరు చూచి సినిమాకివెళ్ళేవారు నూటికి ఇద్దరుకన్న లేరు...

ఇవన్నీ కలసి ఒక ముఖ్యాంశాన్ని సూచిస్తున్నాయి. ప్రేక్షకులు కోరేది మంచికథ అని. నిజానికి నాలుగులక్షలు పెట్టి సినిమా తీస్తున్నపుడు "కథ మంచిదై ఉండాలి" అని ప్రత్యేకించి చెప్పుకోవడం అనవసరం, హాస్యాస్పదం. అయినా తెలుగుసినిమాకు అది అవసరం అవుతోంది-కారణం ఈనాడు సినిమాలో కథకు జరుగుతున్నంత అగౌరవం అవమానం మరి దేనికీ జరగటం లేదు.

* * *

ప్రేక్షకుల స్థితిగతులగురించి తెలుసుకోతగ్గ విషయాలను 1 నుండి 8 వరకూ ఉన్న ప్రశ్నలు తెలియచేస్తాయి. ఐదుపైగా పది మంది లోపు గల కుటుంబాలే అధికంగా ఉన్నాయి. వీరిలో సకుటుంబంగా వెళ్ళే

(73-వ పేజీ చూడండి)

# స్వర తరంగిణి

సంగీతంలో మంచి అభినివేశం ఉండి, శాస్త్రీయ సంగీతం అభ్యసిస్తున్న పిల్లలు, స్వయంగా లలితసంగీత బాణీలలో కొత్త పాటలు నేర్చుకోవడానికి వీలుగా ఈ శీర్షికను ఏర్పాటుచేశాము. స్వర జ్ఞానం కొద్దిగా ఉన్నవారైనా ఈ స్వరాలను చూచి పాడటం గురువు సహాయంతో గాని, స్వయంగా గాని సాధన చేసుకోవచ్చును.

సుప్రసిద్ధ సంగీత దర్శకులు పెండ్యాల నాగేశ్వరరావుగారు ఈవారం ఒక పాటకు చక్కని స్వరకల్పనచేసి ఇచ్చారు. మధురమూ, లలితమూ అయిన సంగీతం కూర్చడంలో నాగేశ్వరరావుగారి ప్రతిభను అనేక చిత్రాలలో ఆయన పాటలను విన్నవారంతా ఎరుగుదురు.

పాట సాహిత్యం విడిగా ప్రక్కన ప్రచురించబడింది. పాట రచయిత: "న్రు"



సంగీత రచయిత
పెండ్యాల నాగేశ్వరరావు

పువ్వులోయ్ పువ్వులు
పువ్వులున్నయ్ పువ్వులు.
మల్లె పువ్వులు మొగలి పువ్వులు
మాలతీ మందార పువ్వులు॥
పువ్వులోయ్॥
బాటచివ్వర తోటలో ఒక
చోట చక్కని తోట ఉన్నది
తోటలోపల పూట పూటా
పాట పాడే పిట్టలున్నవి—
చెట్టు చెట్టుకు పోయి పిట్టలు
చిట్టి పాటలు పాడగానే
పాటలన్నీ పువ్వులై ఆ
తోటలోపల విరగబూస్తాయ్॥
పువ్వులోయ్॥
కమ్మకమ్మని కొమ్మ సంపగి
ఘుమ్మఘుమ్మను బొగడదండలు
పువ్వులోయ్ పువ్వులు
పువ్వులున్నయ్ పువ్వులు॥

---

తిలక్ కామోద్ రాగం — చాపుతాళం.

పాప - సా, రి । నిసనీదా - పా ; ॥
పువ్వు - లోయ్ । పు.. వ్వు - లు ; ॥

పాప - సాసరి । నిసనీదా - పా ; ॥
పువ్వు-లున్నయ్ । పు..వ్వు - లు ; ॥

పనిద - దమమమ । పనిద - దపపప ॥
మ.ల్లె - పు.వ్వులు । మొగలి-పు.వ్వులు॥

పనిద - దమమప । పసని - నిదపా. పప ॥
మా.ల- తీ. మం । దా.ర-పు . వ్వు లు ॥ పువ్వులోయ్॥

రిపప - మపమా.మగ । రిమగ-గసరి ॥
బా.ట- చి . . వ్వర । తో.ట-లో.ఒక ॥

రిమరి - మాపమ । పనిద - దపపప ॥
చో.ట -చక్కని । తో.ట -ఉ.న్నది ॥

మాప - పనినిని । నిసస - సాసా ॥
తోట - లో.పల । పూ.ట-పూట ॥

నీస - రీగరి । సాని - సాసస ॥
పాట-పాడే. । పిట్ట -లున్నవి ॥

సారి-నిసదని । పాద-మపమప ॥
ఆ. ... ... ... ...

సారి-నిసదని । పా, - ; ; ॥
... ... ... ॥

మాప-నీసరి । సరీ,రీ-రీరిస ॥
చెట్టు-చెట్టుకు। పో.యి-పిట్టలు ॥

నీస-రిమమ పమ । గరిమగ-గరిసా.సా॥
చిట్టి-పా.ట లు. । పా. డ.-గా.. నే ॥

పసని - సాసరి । నిసనీ.ద-దప మప ॥
పా.ట- లన్ని. । పు..వ్వు-లై. ఆ. ॥

పసని- నపపద । మపమ-గరి.గరిసా॥
తో.ట-లో.పల । విరగ-బూ.స్తాయ్ ॥

పాప-సా,రి । నిసనీదా-పా; ॥
పువ్వు-లోయ్ । పు..వ్వు-లు ॥

పాప - సాసరి । నిసనీదా-పా ; ॥
పువ్వు-లమ్మా । పు.. వ్వు-లు ॥

పనిద-దపమా.మమ । పసని-నిదపా.పప ॥
క.మ్మ- క..మ్మని । కొ.మ్మ- సం పగి ॥

పనిద - దపమా. మప । పసని - సాసస ॥
ఘు.మ్మ- ఘు..మ్మను । బొగడ-దండలు ॥

మాప-నిసరీ : . గ । సరిరి-రిస ; ॥
పువ్వు—లో.. య్ । పు.వ్వు-లు. ; ॥

నీ స - రిమ.మపమా । గరిగ-గరి ; ॥
పువ్వు-లు న్నాయ్। పు.వ్వు-లు. ; ॥ పువ్వులోయ్॥

గమనిక : నిషాదముపైన । గుర్తు వున్నగి కైశిక నిషాదముగా ఎంచుకోవేది. ఆ గుర్తులేని నిషాదమును కాకలి నిషాదముగా భావించేది.

తరకూ కాసుకుని, కాల్చేస్తాం. అది చూచినా దానికి అందనిపద్ధతిలో ఉంటాం. విశాఖజిల్లా మన్య ప్రాంతాలలో అడ్డతీగల, ఎర్రవరం, మర్రిపాకల అడవులలోను, తూర్పుగోదావరిలో జడ్డంగి, కొకరపాడు దగ్గర మంపసగిరా ప్రాంతాలలోనూ నేను నా మిత్రులు అప్పుడప్పుడు వేటకు వెళ్తూనే ఉంటాం. నా సహాధ్యాయుడు, మిత్రుడు కీ॥ శే॥ ఆర్. నాగేశ్వరరావు కూడా వస్తూ ఉండేవాడు.

ఒకసారి అడ్డతీగలలో— పెద్ద వేటగాళ్లతో పోల్చుకుంటే ఏమీ అనుభవం లేనివాళ్ళు, అప్పటికి అద్భుతం అనతగ్గ సంఘటన ఒకటి జరిగింది. భోజనాలుచేసి, జెర్కిన్లు బిగించి, స్వెట్టర్లు తొడిగి, మఫ్లర్లు చుట్టి ఒక జీపులో బయల్దేరాం. నలుగురం. రాత్రి పదకొండున్నర అయింది. నేను ముందు సీటులో కూర్చున్నాను తుపాకి ధరించి. గతుకుల్లో జీప్ నెమ్మదిగా వెళ్తోంది.

* * *

ఎదర చీకటి. కాటికలాటి చీకటి. అంతటా నిశ్శబ్దం. మధ్య మధ్య భయంకరంగా అప్రశుతిగా ఎక్కడో నక్కలు అరుస్తున్నాయి. ఇలకోడి ఎదుగు తాళంలో కూస్తోంది.. జీపు కారు శబ్దాన్ని ఇవి మిగతా నిశ్శబ్దమూ కలిసి మింగేశాయి కాబోలు, వినబడటమే లేదు.

అంతలో నా మిత్రుడు జీపుకు బ్రేక్ వేశాడు. 'ష్' అన్నాడు నిష్కారణం. ఎదర 15 గజాల దూరాన చోటు తెరిపిగా ఉంది. జీపు హెడ్ లైట్ల కిరణాలు నిరసించి ముందు బారిపోతున్నచోట లీలగా జంతువు కదలిక కనిపించింది.

నేను ఆలోచించే స్థితిలో లేను. కోతి. ఉత్సాహం. గబుక్కున తుపాకి (డబుల్ బారెల్ గన్) గురిచేసి ట్రిగ్గర్ నొక్కాను. అడవి, నిశ్శబ్దమూ, నా గుండె, పొదల్లో కుందేళ్ళు, చెట్లమీద పక్షులూ దడదడలాడిపోయాయి తుపాకిమోతకి.

ఒక్క క్షణం నిశ్శబ్దం అంతలో గర్జనతో అరణ్యం మళ్ళీ మారుమోగింది.

నేను గబుక్కున జీపులోంచి కిందకు దూకాను. ఎదుర ఏర్పడ్డ క్లియరింగ్ (తెరిపిగాఉన్నచోటు) వేపుబయల్దేరాను.

నామిత్రులు గట్టిగా వారించారు. వినక్కలాగారు, విదిలించుకుపోయాను. నిజానికి అది చాలా మూర్ఖమైనపని...అని ఇప్పుడు తెలుసు. అప్పుడు కోతి. పేడి దెబ్బతిన్న జంతువు, ఆ మాత్రం తెలియకుండా పొంచి ఉన్నపుడు అలా దిగి అటు వేపు పోకూడదు.

నేను మొండి ధైర్యంతో- బహుశా అది అజ్ఞానంవల్ల నిలబడ్డ ధైర్యం అనుకొంటాను- అలా ముందుకు పోతున్నాను.

వెనకాల జీపు వస్తోంది నెమ్మదిగా పది



అడ్డతీగలవద్ద చిరుతపులిని వేటాడిన రంగారావు—మిత్రులతో.

అడుగులతరవాత ఆగిపోయినట్టుంది. నేను వెనక్కి చూడలేదు.

తుపాకిని పొజిషన్లో పట్టుకుని- దానిమీద క్లాంప్ చేసిన లైట్ను వెలిగించి సర్వేంద్రియాలకూ హెచ్చరిక చెప్పి జాగ్రత్తగా అడుగులు వేస్తూ ఇంకాస్త ముందుకు వెళ్ళాను.

నేలమీద ఒకచోట నల్లటి డాగు కనబడింది. పెద్దడాగు. ఆగి పరీక్షగా చూశాను. రక్తం.

అంత భయంలోను గర్వం. గురితప్పక కొట్టగలిగానని. ఆ ఆనందంతో గర్వంతో వెనక్కు చూశాను. అంతలోనే మళ్ళీ నేనున్న స్థితి గుర్తుకొచ్చింది.

చిరుతపులి నాకు కుడివైపునుండి ఎడమవైపుకు పోతూఉండగా కొట్టాను. బహుశా దెబ్బతిని ఎదర ఉన్న పొదలలోకి దూకి ఉంటుంది.

ఎక్కడా అలికిడి లేదు.

ఆయాసంగా ఊపిరితీస్తున్న సవ్వడి కూడా లేదు_నాది తప్ప. క్లాంప్‌లాంప్‌ను పొదలమీదకు ప్రసరించి నెమ్మదిగా జరుపుతూ పరిశీలిస్తున్నాను.

అంతలో హఠాత్తుగా నాకుడివైపున దగ్గరగా బాటరీలైటు కిరణం పడింది.

పరాకుగా ఉన్నవాడిపక్కన బాంబు పేలినటయింది. చిక్కటి చీకట్లో ఆవెలుగు కిరణం అలా పగలడంతో గుండె ఝల్లుమంది. కదలకుండానే ఎటూ తిరక్కుండానే తలపక్కకు వాల్చి ఆకిరణంకేసి చూశాను. అది నాపాదాలదగ్గర నుండి కుడివేపుకువెళ్ళి మళ్లీ వెనక్కువచ్చి మళ్ళీ కుడివేపుకు వెళ్తోంది నాకేదో చెప్పాలని నానా హైరాణాపడుతూ—నా వెనక జీపులోంచి నా మిత్రుడువేస్తున్న లైటుఅని తెలుసు. గట్టిగా అరవద్దనీ తెలుసు. అరవడానికి కంఠం పెగలేదు.

ఒకడు అలా గాయపడ్డ జంతువును వెదుకుతూ ఉండగా వెనకనించి మరొకడు అలా లైటు వెయ్యకూడదు. అలాచేస్తే పొంచిఉన్న జంతువుకు ఇతను స్పష్టంగా కనబడిపోతాడు.

అది ప్రమాదమని నా మిత్రులకు నా కన్నా బాగా తెలుసు. గత్యంతరం లేకనే ఈ పని చేస్తూ ఉండి ఉండాలి.

నేను నిలబడ్డ చోటు వైశాల్యం పది దవరపు గజాల లోపు

కాంతి కిరణాన్ని అనుసరిద్దామని ఆ ప్రకారం దాని వెంటే వెనక్కి తిరిగి, నా తుపాకీమీద బాటరీ లైటు పొదలవేపు వేసి చూశాను. అంతే. ఇప్పుడంతా అర్థమైంది.

ఆ లోపలే గుండె ఝల్లుమంది. క్షణంలో ఒళ్ళు కొయ్యబారి పోయింది. ఒక్కసారిగా విడిపడింది. అంత చలిలోను ముచ్చెమటలూ పోసేశాయి నా ఎదురుగుండా 20 అడుగుల దూరంలో పొద పక్కన కూర్చుని ఉంది - దెబ్బ తిన్న చిరుతపులి. దూకడానికి సిద్ధంగా ఉన్నట్టు కూర్చుంది.

నాకేమీ తోచలేదు. ఆలోచనకు అవకాశమూ లేదు. నన్నెవరూ ఆక్షణంలో ఆదుకోలేరు. కాపాడలేరు.

ఆక్షణంలోనే ఒళ్లు తెలియకుండా ఆలోచన లేకుండా బాటరీ దాని మొహం మీద వేశాను. ఆ కాంతికి చిరుతపులి ఒక్కమాటు కళ్ళు ముడుచుకుంది. కళ్లు చీకట్లు కమ్మి ఉండాలి. అది కళ్ళు తెరిచి తమాయించు

# వేట

తుంటే తరవాత ఆ దెబ్బతిన్న పులిని అడ్డే వాడుండడు.

నా దగ్గర తుపాకిలో ఇంక ఒక్కటే గుండు ఉన్న సన్న ఊహా కూడా స్ఫురించింది. అయితే ఒకటే ధైర్యం. గుండు గురితప్పి, అది మీదకు ఉరికినా ఒక్క ఆశ ఉంది. అది పెద్దపులి కాదు. చిరుతపులి కాబట్టి కలియబడవచ్చు. అప్పుడు జయాపజయాలు-ఏమో.

ఒక పక్క చెమటలు పోస్తున్నాయి. మరో పక్క ఒళ్ళు గజగజ వణికిపోతోంది. తెగించి, గురిపెట్టి కాల్చాను.

తుపాకి శబ్దానికి అడవి మారుమోగింది... కాని దానికి ప్రతిధ్వనిగా గర్జన వినరాలేదు మూలుగులాటిది వినబడింది. పులి నా మీద దూకలేదు. పొద అదిరిపోలేదు. ఇక ఫరవాలేదు అది దెబ్బతింది అనుకున్నాను.

గబగబ పెద్దపెద్దఅంగలు వేస్తూ జీపు వేపు నడిచిపోయాను.

నా మిత్రులు ముగ్గురూ అమాంతం ఎదురువచ్చి కౌగలించుకున్నారు. కారులో కూర్చోబెట్టి మొహం తుడిచారు. కొంగ్రాట్యులేషన్స్ కురిపించారు. ఫ్లాస్కులోంచి వెచ్చటి టీ తీసిఇచ్చారు. అది తాగి సిగరెట్ ముట్టించాను. కసితీరా రెండు పీల్పులు పీల్చాక ప్రాణం కుదుటపడింది. ఎవరితోను మాట్లాడ బుద్ధికావటంలేదు. చెప్పరానంత ఆనందంగా గర్వంగా హాయిగావుంది. కన్నులరమూసి కూర్చున్నాను.

పావుగంట తరవాత, వాళ్ళతో వెళ్ళి నేను చంపిన చిరుతపులిని సాయంపట్టి జీపు బానెట్ మీద పడేశాను.

తృప్తిగా కూర్చున్నాను. జీపు అడ్డతీగల గ్రామంవేపు సాగిపోతోంది నెమ్మదిగా.

మిత్రులు, నేనెంత మూర్ఖపుపని చేయబోయానో, ఎంతటిగండం తప్పిందో చెబుతున్నారు. క్రమంగా అవన్నీ వినబడడం మానేశాయి. వాళ్ళసంతోషం పంచుకోలేకపోతున్నాను. నేను సాధించిన విజయం ఏమిటి?

పగ సాధించానన్న ఈ తృప్తి ఎందుకు కలగాలి? పగ ఎందుకు వచ్చింది? పులికి నా మీద కోపం ఉన్నట్టు ఎవరూ చెప్పలేదు. నాకూ దాంతో పరిచయం లేదు. పనిమల్లె నేను ఇక్కడికి దాని రాజ్యంలోకి ప్రవేశించాను. నేనే శత్రువుని. దానిదారిన అది పోతూఉంటే, హెచ్చరించకుండా దెబ్బ కొట్టాను. నాకన్న అది బలమైనదని తెలుసు. ధైర్యం ఎక్కువనీ తెలుసు. నాకు అదంటే భయమనీ తెలుసు. మరొక్కటి తెలుసు. అది జంతువని దానికి బుద్ధిబలం లేదనీ, వంచనాశిల్పం బాగా తెలీదనీ, నేను నాగరిక మానవుడననీ, దానికిలేని బుద్ధిబలం నాకుఉందనీ పైగా వంచనాశిల్పం, ఆయుధసంపద నా అధీనంలో ఉన్నాయనీను. అదే, పంజా ఎత్తిన పులి కాక. తుపాకి పట్టిన మరోమనిషి అలాగే ఆ పొదలో నిలిచిఉంటే? నేనూ అతడూ సమానస్థాయిలో ఉందుము. అపుడు ఎవరేమయ్యేవారో!

నేను నిరాయుధుడనై వెళ్తే పులి నన్ను బలిచేస్తుందని ఊహించి, నాకన్న అది బలశాలి అని గుర్తించి, దానికి తెలీకుండా, అది నాతో సవాలు చేసినట్టు అనుకుని, ప్రతీకారం కోసం అయినట్టు పనిమల్లె వెళ్ళి చంపాను. కాని ఇది ప్రతీకారమా, నాలోని అహంకారానికి ఉపశమనమా? ఏమో.

"అమ్మా పొద్దున్నన గా పోయిన నాన్న మధ్యాన్నం దాకా రారుకదా మరి టిఫిన్ తినరూ, తినకుండా పోయారు మరి!" అంటూ అడిగాడు ఓ అబ్బాయి వాళ్ళమ్మని. "ఆయన ఏ హోటల్లోనో తింటారులేరా" అంది తన కొడుక్కి తండ్రి అంటే ఎంతఇష్టమో అని మురిసిపోతూ. "అయితే నాన్నకోసం టిఫిన్ దాచట మెందుకు నాకిచ్చెయ్" అన్నాడు ఆ కుమారరత్నం.

సి. వి. రమణమూర్తి.

తెలీదు... తెలుసుకోవడం ఇష్టం ఉండదు. అది తెలుసుకుంటే, నేను చాలా ధైర్యశాలిని అని నన్ను నేను చరచుకోడానికి అవకాశం ఉండదనా? ఏమో...

* * *

"వాట్ రంగరావ్...ఏమిటలా ఉన్నావు." అంటున్నారెవరో

"కొత్తగదయ్యా...గోను పోను అతనే సర్దుకుంటాడు." అంటున్నారింకెవరో

* * *

జీపు ఊరివేపు-నాగరికతవేపు-సంస్కారంవేపు—ముందుకు సాగిపోతోంది.... ★









# వేట

ఎస్.వి.రం[illegible]



చీకటి. కాటికలాంటి చీకటి. పిరికివాడి భయంలా చిక్కగా ఉంది. అడవిలో నిశ్శబ్దం భరవసా చూసుకుని మరింత వల్లగా నవ్వు తోంది. ప్రమాద పరిస్థితిలో పసి పిల్లవాడి చిరునవ్వులా నింగిన చుక్కలు అమాయకంగా మెరుస్తున్నాయి. మొహం చెల్లక, కడుపులో ప్రమాదాలు దాచిపెట్టుకున్న చీకటికూడా మిణుగురులతో ఇకిలిస్తోంది. పెద్ద పెద్ద చెట్లు రూపు ధరించిన చీకట్లలా నీలగా కనబడి మాయమవుతున్నాయి.

మంచుకురుస్తోంది. చలి కరుస్తోంది. గాలి సన్నగా వాడిగా రంపపుకోతలా ఒరుసుకుపోతోంది చెవులమీదనుంచి. చోటు దొరికిన చోటల్లా గాఢంగా గుచ్చుకుంటోంది. ఆర్కెస్ట్రాలో అసందర్భపు క్లారినెట్ లా ఎక్కడో నక్కలు అపశ్రుతిగా అరుస్తున్నాయి...భయంగా...భయంకరంగా... ఇలకోడి ఎగుడుతాళంలో కూస్తోంది; భయసంగీపాలవల్ల లయలేకుండా పడుతున్న మా అడుగుల సవ్వడిని కాబోలు ఆగి ఆగి ఆలకిస్తోంది.

మెయిన్ రోడ్డుమీదనడిచిన అలవాటువల్ల కాబోలు దారినిండా ఇన్నిగతుకులేమిటని విసుక్కుంటున్నాయి పాదాలు.

వెనక మేమున్నామన్న ధీమాతో బ్యాటరి లైటుకాంతి కిరణం ఒకటి మా ముందు చెంగుచెంగున ఎగురుతూ పోతోంది. సాక్షాత్తు మృత్యువులాంటి పెద్దపులులు పచ్చటి ఎర్రటి కనుపాపలు పెద్దవిచేసుకుని ఊపిరి బిగబట్టి పొంచి ఉండే పొదలలోకి కూడా తొంగిచూసి వస్తోంది ఆ కిరణం

ఒక్కక్షణం ఆగాను. ఇంతచలిలోనూ కూడా చిరుచెమటపోసిందినొసట...అలసట చేత...భయంచేతకూడాను. రుమాలుతో మొహంతుడుచుకొని డబుల్ బారెల్ గన్ను ఆ భుజంనుంచి ఈ భుజానికి మార్చుకొన్నాను. అటునిక నిశ్శబ్దం నన్ను చెవిటివాణ్ణి చేసింది నా వెనుక వస్తున్న నా మిత్రుడు పొడిదగ్గుదగ్గాడు. ఉలికిపడ్డాను.

'ఊఁ!' అన్నానువెనక్కి తిరక్కుండానే.

'అబ్బే' అన్నాడు అతను.

'చలా?'

'ఊహుఁ'

"భయమెందుకోయ్" అన్నాను భయం అణచుకుంటూ.

అతను నవ్వాడు—ధైర్యం తెచ్చుకొంటూ. (అతనికిదే తొలిసారి.) నాది భయమా!

భయమైతే నేనెందుకు షికారుకు వెళ్లాలి? ధైర్యముంటే అతనెందుకు భయపడాలి? మేము అడవిని చూసి భయపడితే అడవి మమ్మల్ని చూసి ఎందుకు భయపడాలి? అడవిలో పులులు ఎందుకు ముందుకు రావు? చీకటి నిశ్శబ్దంలో, నిశ్శబ్దం చీకట్లో ఎందుకు దాక్కున్నాయి? కుట్ర చేస్తున్నట్లుగా యెందుకీ నిశ్శబ్దం? పొంచి వున్న ఈ 'ప్రమాదాల' మధ్య, మృత్యు పరికరాల మధ్య, అణగి వున్న ఈ ప్రకృతి శక్తి చైతన్యాల మధ్య రంగా రావుకు చోటెంత? అణువంత. కాని అణువులో శక్తి ఎంత?...ఆ సంగతి తెలిసే ధైర్యముగా అడవిలోకి ఆరుమైళ్ళ దూరం వచ్చానా?

ఏ ధైర్యం నన్ను ముందుకు నడిపింది? స్వతహా పిరికివాణ్ని గదా...చేతిలో తుపాకి ఉన్నదన్న ధైర్యం కాబోలు. కాని 'మృత్యువు' గాండ్రుమని గర్జించి మీదకిలంఘిస్తున్నపుడు ఎదిరించి కాల్చే సాహసమెంత?

# వేట

ఈ రంగారావులో భయమూ వుంది. సాహసమూ ఉంది. భయం కోరి తెచ్చుకున్నది; సాహసంతో ఆవహింప చేసుకున్నది. శత్రువు(?)ని కొట్టేవరకూ "ప్రమాదం" ఎక్కడ పొంచివుండి ఎట్నుంచి మీద పడుతుందోనని భయం. ఆ భయం—అప్పటి ఉత్కంఠ ఒక అద్భుతమైన అనుభూతి. అనిర్వచనీయమైన సుఖం. అదే వేటగాడి కష్టానికి తెగింపుకూ ప్రతిఫలం. ప్రాణం పణంగా ఒడ్డి గెల్చుకొన్న మధురఫలం. అందుకోసమే, ఆభయంకోసమే సుఖంకోసమే షికారీ వేట కళ్తాడేమో.

"ప్రమాదం తన పచ్చటి ఎర్రటి కళ్ళతో ఆమేయమైన శక్తితో తనవేపు గురిచేసిఉన్న తుపాకీకేసీ, ఆవెనుకనున్న మనకేసి చూసి-గాండ్రుమంటూ అడవి ఝుమసుకునేలా అరచిదూకినపుడు—

తుపాకి ట్రిగ్గర్ నొక్క, అందులోంచి గుండు బయల్దేరి ముందుకు వెళ్తున్నప్పుడు—

పులిపంజా, తెరచిన నోరు, తొమ్మిది అడుగుల భారీశరీరం, చిన్న తుపాకి గుండుకు ఎదురుగా వస్తున్నప్పుడు—

ఆ పులికీ, ఈ బుల్లెట్‌కీ భేటి కుదరక పోతే? ఆ అరక్షణం తరువాత ఏమి జరుగుతుంది అని అర క్షణంసేపు షికారీ నరాలను మెలిపెట్టి దహించివేసే విద్యుదాఘాతం లాటి ఆలోచన—

అదే భయం – అదే సుఖం – ఆ క్షణమే స్వర్గం – ఆ క్షణమే భరింపరాని నరకం. అదే అంతవరకూ వేటగాడు ఎదురు చూచిన ముహూర్తం...

* * *

సాధారణంగా వేటకు వెళ్తే మనం ఎక్కడో భద్రంగా కూర్చుని, పులి వచ్చే





# రాజధాని కబుర్లు

ప్రవీణ్

వారపత్రికల కో ఇబ్బంది ఉంది: అవి వారాని కోసారి వెలుగు చూస్తుంటాయ్. వారానికి ఏడురోజులని పాఠకుల్లో అధికసంఖ్యాకులు అంగీకరిస్తారు. ఈ ఏడు రోజుల్లో ఏడు దినపత్రికలు సూటిగా వచ్చి కబుర్లు చెప్పి చక్కాపోతాయ్.

'రాజధాని కబుర్లు' రాసేటప్పుడు ఈ 'కబుర్ల దారుడి'కి తెలిసిన విషయాలు కొన్ని ఉంటాయ్. అవి పాఠకులకు చేరేసరికి, భూమి తిరుగుతూ తాను ఏడుసార్లు ప్రదక్షిణా చేస్తుంటుంది. 'ఇవన్నీ పాత విషయాలే కదా!' అంటూ పుటలు తిరగేస్తారు పాఠకులు.

భూమి తిరుగుతూ తాను రోజూ తిరుగుతూనే ఉన్నా, ఈ వారం మరీ గిర్రున తిరుగుతూన్నట్టు కనిపిస్తూంది రాజధాని నగరంలో. 'ముఖ్యమంత్రి—' అంటే, 'ఎవరు ముఖ్యమంత్రి? ఏ ముఖ్యమంత్రి?' అని ప్రశ్నిస్తున్నారు ప్రజలు. 'ఇది అల్లాగే, ఇది కాదు. ఈ రెండు పక్షాల్లో ఏదో ఒకటి పట్టాలో' అంటూ తిరుగుతున్నారు కాంగ్రెసు నాయకులు.

నాయకులకే అగమ్యగోచరంగా ఉంది పరిస్థితి. ఒకటిమాత్రం స్పష్టం. ఒక వారం క్రితం రెవెన్యూమంత్రి శ్రీ కొండా వెంకట రంగారెడ్డికి అవకాశాలున్నా, అవి ఇప్పుడు కరిగిపోయాయి. తెలంగాణా నాయకులు ముగ్గురు కాంగ్రెసు పార్లమెంటరీబోర్డుకి "శ్రీ రంగారెడ్డి నాయకత్వం మాకు వద్దు" అని సమిష్టిగా ఒక లేఖ వ్రాశారట.

ఈ లోగా—స్వతంత్రుల్లో కొందరి స్వాతంత్ర్య సంపాదనాయత్నాలు గమనించండి. స్వతంత్ర పక్షీయులలో ముఖ్యులు కొందరు, చెన్నకేశవులకి మొక్కి, కాంగ్రెసులో చేరవచ్చు మళ్ళీ. ఆశయం ఒక పక్షం ఐనా గడవాలి ఈ లోగా. అంటారు 'అన్నీ మాకు తెలుసు' అనుకునేవాళ్ళు.

* * *

దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే - అంటారు పెద్దలు. ఈ యుగంలో మన దేవుళ్ళు మంత్రులూ, గవర్నర్లే కనక, అక్కడ పెత్తనం చెలాయించేది సాధారణంగా పెద్దలే అయ్యుంటారు. ఆహ్వానాలు కూడా పెద్దలకే వెడతాయ్. 'ప్రోటుకోల్' అంటూ ఉంటుంది కదా? ముఖ్యమంత్రి-అంటే శ్రీ నీలం సంజీవరెడ్డి- ఈ వారం ఒక్క చక్కని విందు ఏర్పాటు చేశారు. డిసెంబరు 25వ తేదీన ఆయన కుమార్తె సౌ॥ నీరజ వివాహం జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఈ విందు ఏర్పాటు చేశారు.

విందుకు అతిథులుగా మంత్రులు, న్యాయమూర్తులు, ఉన్నతాధికారులు వచ్చారు - సహజంగా. కాని వీరు హాజరు కావడంలో లేదు ప్రత్యేకత. ఈ విందు నిసలైన ప్రజాస్వామిక సిద్ధాంతాల ననుసరించి జరిగింది. వివిధరంగాల్లో కృషి చేసి మన్ననలందినా, సివిక్ లిస్టుల్లో చోటు లేక పోయిన సామాన్యులు పలువురు ఈ విందుకు ఆహ్వానించబడ్డారు. ఈ సాహసానికి శ్రీ సంజీవరెడ్డిని అభినందించాలి.

కాని-అది సాహసం కాదేమో? అది ఆయన స్వభావమేనేమో?

అతిథుల్లో పురుషులకు శ్రీ సంజీవరెడ్డి, ఆయన బావమరిది శ్రీ తరిమెల రామచంద్రారెడ్డి స్వాగతం చెప్పారు. 'అతిథినులకు' శ్రీమతి నాగరత్నమ్మ సంజీవరెడ్డి స్వాగతం పలికారు. 'గ్రీన్ లేండ్సు' ఆవరణలో [illegible] శ్రీ 'జె. ఏ.' ఏర్పాటు చేసిన దీపాలు ఆరుతూ ఆనందం గొలిపి, వెలుగుతూ ఆశ్చర్యం కలిగించాయి. విద్యామంత్రి శ్రద్ధ తీసుకొని ఏర్పాటుచేసిన సాంస్కృతిక కార్యక్రమంలో హాయి గొలిపింది కుమారి సుమతి నృత్యం.

అది ముఖ్యమంత్రి ఇంట్లో విందు కాదు. ఒక తెలుగువాడి ఇంట్లో విందు. అదీ, పైన చెప్పినట్లు, విందులో ప్రత్యేకత. గమనించి, ప్రశంసించదగిన విషయం.

* * *

ఈ వారం విందుల వారం రాజధాని నగరంలో. ఒక విందు విషయం చెప్పి, మిగిలినవి మరవడం అన్యాయంగదా? విందురుగాక పాఠకులు విందులగాథ!

ఈ వారం రాజధాని నగరంలో ఉధృతంగా జరిగాయి రెండు సమావేశాలు. ఒకటి బేగంపేటలో పబ్లిక్ స్కూల్‌లో జరిగిన ఇండియన్ కాన్ఫరెన్స్ ఆఫ్ సోషల్ వర్క్ సమావేశాలు. ధగధగ మండే తాటాకు మంటల్లా వెలిగాయ్ ఈ సమావేశాలు. దేశాన్ని అన్ని కోణాల నుంచి పరిశీలించి బాగుచెయ్యాలనే [illegible]ంతో హైదరాబాదు వచ్చిన ప్రతినిధులు బేగంపేట రోడ్లను కారుల్లో, జీపుల్లో, బస్సులలో తిరిగి పలకరించేశారు. రెండు: జూబిలీ హాలులో జరిగిన భారత ప్రామాణీకరణసంస్థ సమావేశాలు. మొదటిరకం సమావేశాల ప్రచారం వీటికి లేకపోయినా, ఏర్పాట్లు



శ్రీ నీలం సంజీవరెడ్డి రెండవకుమార్తె చి॥ సౌ॥ నీరజకు, చి॥ సత్యనారాయణకు డిసెంబరు 25 వ తేదీన తిరుచానూరులో వివాహం జరిగింది.



# రాజధాని కబుర్లు



నిరాడంబరంగా లోపం లేకుండా జరిగాయి ఇక్కడ.

ఈ రెండు సమావేశాల ప్రతినిధుల గౌరవార్థం విందులు ఏర్పాటయ్యాయి రాజధానిలో. ఈ విందులనుచూస్తే, ఇదివరకొకసారి, ఈ కబుర్లలో ప్రస్తావించినట్లు రాజధానిలో బియ్యం ధర ఎక్కువలేదనే అభిప్రాయమే కలుగుతుంది.

విందుల విషయం మరచిపోవడం కష్టం. కాని - ఒకసారి మరిచిపోదాం. పబ్లిక్ స్కూల్‌కి వెళ్ళేదారిలో, పబ్లిక్ స్కూల్‌కి చాలాదగ్గరగా, డిసెంబర్ 30 వ తేది సాయంత్రం గం 8-20 లకు రోడ్డుమధ్యన ఒకమనిషి పడిపోయి ఉన్నాడు. సైకిలొకటి రోడ్డుమీద పక్కనే అడ్డంగా పడిపోయి ఉంది. సైకిలుకు ఒకసంచి తగిలించి వుంది. కార్లు, జీపులు, బస్సులు పక్కనుంచి తప్పించుకొని ఆలోచిస్తూ పోయి, పోవక కొన్ని రేసుల్లో పాల్గొంటున్నాయి. కిరాయికోసం తిరుగుతున్న ఒక రిక్షావాడు రిక్షా ఆపి, హఠాత్తుగా మూర్ఛవచ్చి పడిపోయిన ఆమనిషిని సేవ చేశాడు. ఈపని చేయడానికి సుచరితులెవ్వరికీ వీలు చిక్కలేదు.

ఈసంగతి వింటే-అన్నపూర్ణా ఇంటిలోన అన్నమే కరువాయెనా!? అనాలనిపిస్తూందా! అనండి.

* * *

ఆంధ్రదేశం అన్నపూర్ణవంటిదే. మిగిలిన రాష్ట్రాలకు కావలసిన ఆహార ధాన్యాలు సరఫరాచేసే స్థితిలో ఉంది. కాని ఆంధ్రుల రాజధానిలోనే ఆహార ధాన్యాలలో చీకటిబజారు. ఇది అర్థంకాని విషయం.

ఆసియాకంతటికీ పెద్ద చక్కెర ఫాక్టరీ ఉన్న ఆంధ్రప్రదేశ్ రాజధానిలో పంచదార కనపడకుండాపోవడం. ఇది అర్థంకాని విషయమే.

రాజధానిలోను, మరికొన్ని పట్టణాలలోను, బియ్యంకొరత కనపడ్డం గమనించిన ముఖ్యమంత్రి, శ్రీ సంజీవరెడ్డి, ఒక లక్ష టన్నులు సేకరించమన్నారుట. జిల్లాలకు తామే ఇస్తామన్నారు. మొదట పదివేల టన్నులు ఇస్తామన్నారు. తొమ్మిదివేలటన్నులు కాని అధికారులు ఆరువేలు రాజధాని తెచ్చారుట. మూడువేల టన్నులు మాత్రం పంపిణీ అయ్యాయి. ఇంకో ఆరువేలు అక్కడా ఇక్కడా గిడ్డంగుల్లోనే నిద్రపోతున్నాయి.

ప్రభుత్వం పంపిణీ ఒక సహకార సంఘానికి అప్పచెప్పిందిట. ఆ సహకార సంఘాధిపతుల పేర్లిక్కడ అనవసరం. వారు కొన్ని బస్తాలే ఉచితంగా హోటళ్ళకు పంచిపెట్టాం అంటున్నారు. ప్రచారంకోసం. హోటళ్ళు చివరికి బజార్లోనే-(ఏబజార్లో?) కొనుక్కున్నాయ్. ప్రజలకి మాత్రం పంపిణీ కాలేదు.

నగరపాలక సంఘ సభ్యులు రంగంమీదకువచ్చారు. నాలుకలు తెరిచారు. డిపోకు నెలకి మూడువందల ఏభైవరకు ఖర్చు చెప్పారు. బియ్యం ప్రజలకు చేరలేదు, పైగా బియ్యం మంచివి కాకపోడంవల్ల అమ్ముడుపోడంలేదని ప్రభుత్వంపై ఆరోపణచేశారు; సికింద్రాబాద్ నగరపాలక సంఘ ఆహారోపసంఘం. చౌకడిపోలు మూసేస్తున్నాం-అని బెదిరించింది. ప్రజలకు కాకుండా పోయాయ్ బియ్యం.

పంచదార ఎగుమతి వీల్లేదని ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేస్తే-కలకండగా మార్చి లక్షలు చేసుకుంటున్నారని తాజావార్తలు. ఈ వారం పాఠకులు ఇది చదివేసరికి ప్రభుత్వం చాలా ఉత్తర్వులు చేయవచ్చు. ★

# కళాపోషణ; ప్రాణరక్షణ - ఏది ముఖ్యం?

## ప్రభుత్వయంత్రాంగం చేస్తున్న మారాం - ప్రధానమంత్రి అభిప్రాయాలు

### న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణ

పాలనావ్యవహారాలలో పై అధికారులనిరంతరజోక్యం లౌక్యం కాదు. వారిజోక్యంతో క్రిందివారికి పనులు జరపటమూ శక్యంకాదు. కాకపోతే ఢిల్లీవచ్చి చూడండి! మీకే తెలుస్తుంది.

రిపబ్లిక్ ఉత్సవాలు అయిన తరువాతగాని తిరిగి ఢిల్లీలో సభ్యత తొలగి ముమ్మరంగా పనిసాగదు. దుర్గపూజ ఉత్సవాలు మొదలు రిపబ్లిక్ వేడుకల దాకా ఢిల్లీలో చలి ఉన్నంత దట్టంగా పనివుండదు, హడావుడి ఉండదు. ఈ మధ్య కాలంలో ఒకసారి పార్లమెంటు సమావేశం జరుగుతుంది మామూలుగా. అలాగే పార్లమెంటు చిన్న సమావేశం కూడా జరిపింది. మంత్రులు పర్యటనలలో ఉంటారు. కాంగ్రెస్‌తోసహా రాజకీయ పక్షాలన్నీ వాటి సమావేశాల్లో మునిగి తేలుతూ ఉంటాయి. అయితే ఈ ఏడు మామూలు కార్యక్రమానికి కాస్త భేదించింది. దానికి కారణం చైనా జరిపిన 'స్పష్టమైన దురాక్రమణ'. దీనితో భారత్ రక్షణశాఖ బడ్జెట్ కేటాయింపుల విషయమై కేంద్రమంత్రివర్గం తరచుగా సమావేశంజరపవలసివచ్చింది. ప్రధానమంత్రి ముందే చెప్పినట్లు భారత్‌కు బలకరమైన చర్యలన్నీ ప్రభుత్వం తీసుకుంటున్నది. భారత్ రక్షణ బలాలు పటిష్టంచేసే ఉద్దేశంతో ఒకవైపున 'పారిశ్రామికంగా' కూడా తీర్చిదిద్దుతున్నారు. మరోవైపున సరిహద్దు ప్రాంతాలలో రోడ్లు నిర్మించి సరిహద్దుల సూచనకు స్తంభాలను కూడా ఏర్పాటు చేస్తున్నారు దీనికి మరింత వ్యయం కావలసి ఉంటుంది. కాగా దీనికి ఆదాయం పెరగాలంటె రెండే మార్గాలు. అదనంగా పన్ను విధింపు ఒకటి. వ్యయంలో పొదుపు ఒకటి.

వ్యయంలో పొదుపువిషయం తీసుకుంటే ఇటీవల ఆమోదింపబడిన కేంద్ర వేతన నిర్ణాయక సంఘంవారి సూచనల ప్రకారం అదనంగా ఏడాదికి 20 కోట్ల రూపాయలు కావలసి ఉంటుంది. లోటు బడ్జెటు పద్ధతిని ఈ ధనం సేకరించడం సాధ్యంకాదు. నిధుల సంపాదన జరగాలి. మళ్లీ అదనపు సిబ్బంది తొలగింపు ప్రసక్తి వస్తుంది. ఇది ప్రభుత్వం చేయదు కాగా అదనపు ఖర్చు తగ్గింపు! అంటే థియేటర్ల నిర్మాణం ఆపుదల, కళా, సంస్కృతీ రంగాలపై పెట్టుబడుల నిలుపుదల.

ఇంతకూ 'సంస్కృతి' అంటే యేమిటి? అనేక నిర్వచనాలున్నాయి. అనూచానంగా వాడుకలో మనసా, వాచా, వస్తూవున్న ఒక జీవన విధానమని ఒక నిర్వచనం. సత్యం, శివం, సుందరం అనే జీవిత సోపానాలకు మానవుడు చేసే ఆరోహణలో తన జీవనవిధానాల విలువ కట్టుకుని, తనను తాను గుర్తెరిగి చేసేపురోగమనమే సంస్కృతి అంటారు కొందరు. నైతికపు విలువలతో జీవిత విధానం సమన్వయించుకునే పద్ధతి సంస్కృతి అనేది సుస్పష్టం. కాగా 'సత్యం, శివం (నైతికపువిలువ), సుందరం' వీటిని నిర్వచించుకోవడం చాలా పెద్దపని. ఇదొక 'సంస్కృతి'ని గూర్చిన వ్యాసం అయిపోతున్నది. ఇంతకీ నేను చెప్పవచ్చిందల్లా ఒక్కటే! మన ప్రభుత్వం సంస్కృతిలో అంతర్భాగాలైన సౌందర్యం, పరిశుభ్రత, సాంఘిక ధర్మాల అనుసరణ; వీటికోసం భారీమొత్తాలు వ్యయంచేస్తుండగా, రాజధానిలో ... న్యూఢిల్లీలోనే ... సదరు సాంఘిక ధర్మాలు, అవసరాలు సర్వనాశనమౌతున్నాయి. మంత్రిగారికి ప్రత్యేకంగా నిర్వచనాలు ఉంటాయి. 'సంస్కృతి' అంటే ఆయన ఉద్దేశంలో ఒప్పందాలు, పరదేశాల సందర్శనకు ప్రతినిధివర్గాల పంపకం. గాయకులచేత, నర్తకులచేత కచేరీలు, ప్రదర్శనలు, పనిలో పనిగా థియేటర్ల నిర్మాణం, కళాఖండాలు ఖరీదు చెయ్యడమూను! 'సంస్కృతి' పేరుతో ఇవి కూడదని కాదు నేననేది. 'సంస్కృతి' ఉద్ధరణకు ఏది ముందు, ఏది తరువాత.. అనే ప్రశ్న! మనకు నైసర్గిక సంపదలు, పెట్టుబడులు అపారంగా ఉంటే ఎవరేంచేసినా ఈ వ్యయానికి ఎవరూ ఏమీ అనరు. కాని మన నైసర్గిక సంపదలన్ని తాకట్టు పెట్టుకుని జీవితావసరాలకు ఋణాలు చేస్తున్న సమయంలో ఈ వ్యయాలు తగునా అనేదే ప్రశ్న? పాలనావ్యవస్థ, రెండవ ప్రణాళిక సక్రమంగా నడవాలంటే నిధులు అవసరం. అవి ఇలా ఖర్చుఅయితే ఎలాగనేది ముఖ్య ప్రశ్న? కాదు 'సమస్య'??

చైనా దురాక్రమణవల్ల ఏర్పడిన పరిస్థితుల దృష్ట్యా తక్షణ రక్షణావసరాలకు నిధులు కావాలి. ఇది నేటి సమస్య! గత అయిదువందల సంవత్సరాలుగా మనం కళా కేంద్రాలు పోషిస్తునే ఉన్నాం. మరో పదేళ్లు వాటిని అలా ఉంచితేచాలు. అత్యవసరంగా ఇప్పుడు వాటి పోషణకు రక్షణ బాధ్యతలు వదులుకోనవసరంలేదు. 'డూ-లా బాంబులా' అని కాదు మన సమస్య! థియేటర్లా, రక్షణ బాధ్యతలా మన శ్రద్ధకు ఇప్పుడు పాత్రమైనవి' అనేది ఇప్పుడు తేల్చుకోవాలి

పన్ను చెల్లించే సామాన్యుని కడనెత్తుటి బొట్లు పేర్చిన నిధులు చప్పరించేవారిని తొలగించి మంత్రివర్గం పునర్వ్యవస్థీకరించుకోవలసిన అవసరం నేడు ప్రధాని శ్రీ నెహ్రూకు ఎంతైనా ఉంది.

బ్రిటిష్ పాలనా పద్ధతిని ప్రధానమంత్రి మరోసారి త్రోసిరాజని తిరస్కరించారు. యునైటెడ్ స్టేట్సు న్యూస్ అండ్ వరల్డ్ రిపోర్టులో ప్రచురించిన ఒకానొక ఇంటర్వ్యూలో ప్రధానమంత్రి మన ప్రస్తుత ప్రభుత్వం దాని పద్ధతిలో అదేమంచిదనీ, సమర్థవంతమైనదనీ పేర్కొన్నారు. అయితే మందకొడిగా పనులు కానించే పద్ధతికి అది అలవాటు పడిందని కూడా ఆయనఅన్నారు. ఇది బ్రిటిష్ పద్ధతి. అయితే బ్రిటన్‌వంటి పురోగామిదేశంలో అది రాణిస్తున్నది. సత్వరపునర్నిర్మాణ కార్యక్రమంలో ఉన్న భారత్‌కు ఈ పద్ధతి అనువుగాలేదని శ్రీ నెహ్రూ వెల్లడించారు.

ఇదే వింత. ప్రధానమంత్రికి పాలనా పద్ధతి నచ్చదు ఉద్యోగుల పనిపాటులూ నచ్చవు! ఈ రెండేకదా దేశభవిష్యత్తు తీర్చిదిద్దేవి!

పనులకు ఒక పద్ధతీ, నిదానం సరికిరాదంటారు ప్రధానమంత్రి! జీవితభీమా

# న్యూఢిల్లీ లేఖ

ముంద్రా గొడవలు వెల్లడిఅయిన తర్వాత ఈ 'పద్ధతి'-'పరిశీలన' ఎంత అవసరమో తెలిసివచ్చింది. బాధ్యతలో ఉన్నవారెవరూ, 'పద్ధతీ', 'భద్రత 'గుట్టు' 'పనికి రాదని అనరు. బాధ్యతగల ఏ అధికారీ అలా అనడు.

ఇది ఎందుచేత?

అతను అలా అనకుండానే గనక ఉంటే— పార్లమెంటు అతని కూపీలు బయటికిలాగి దోషిగా నిలబెడుతుంది... ప్రధానమంత్రి గాని, ఆయన మంత్రివర్గంగాని అతనికి రక్షణ అప్పుడు ఇవ్వరు. శ్రీ హెచ్. యం. పటేల్ ను బయటికి పంపడంవల్ల వ్యాపార రంగంలో పెద్దబేరం ఒకటి వగులుకోవలసి వచ్చింది కూడా!

పైవారి జోక్యం, న్యాయస్థానాల స్వాతంత్ర్యం—ఇవికూడా పాలనావ్యవస్థను దెబ్బకలిగించాయి. ఇక్కడ ఒకముచ్చటునక చూడండి. యమునానది చెంత, సర్క్యులర్ రోడ్డు-మంత్రివర్గానికి ప్రస్తుతం సమస్య అయి కూర్చున్నది. మూడేళ్ళనుంచీ అది పేచీలో నేఉంది. అక్కడ ఇరవై కుటుంబాలు ప్రధానమంత్రి ఉత్తరువులకుఎదురొడ్డి రోడ్డుమీద తిష్టవేసుకు కూర్చున్నాయి. దైనందిన వ్యవహారాలలో పైవారిజోక్యానికినొక నిదర్శనం! ఇలా అయితే (కనీసం ఢిల్లీలో) ప్రభుత్వయంత్రాంగం పని చేయడం కష్టం. పార్లమెంటులోఉన ఢిల్లీ సభ్యులు ప్రశ్నలు వేయరు. సామాన్యంగా ప్రశ్నోత్తరాల సమయంలో (కనీసం) వారు గైర్ హాజరు అవుతూఉంటారు. పేరుకోం వీరురోజువారీవ్యవహారాలలో వేలు పెడుతూ ఉంటారు. పాలనావ్యవస్థ దెబ్బతింటున్నది.

'ఇంజంక్షన్లు' జారీచేయడానికి ఏళ్ళూ పూళ్ళూ పడుతున్నది న్యాయస్థానాలకు! వినయ్‌నగర్ లో పబ్లిక్ రస్తాలను అక్రమంగా ఆక్రమించుకున్న వారిని తొలగించేందుకు న్యాయస్థానాల ఉత్తరువులు ఇంత మూడేళ్ళుగా రానే లేదు! 



## గమనిక

ఈవారం స్థలాభావంచేత కథకాని కథ, తెలుగు వెలుగులు మొదలైన కొన్ని శీర్షికలు ఆపివేయవలసి వచ్చినందుకు చింతిస్తున్నాము. పైవారంనుంచి అవి యథాప్రకారం ప్రకటిస్తాము.



# మరపురాని మధురానుభూతి

నోమూరి నరసింహారావు

"కరుణాకర్ వస్తారీరోజు. తెల్లవారక ముందే పనులు చక్కపెట్టాలని చెప్పాను. ఏం ఇంత ఆలస్యంగా వచ్చావు" అంటూ రంగయ్య మేస్త్రీ దబాయించి పారేశాడు. బుగ్గమీసాలు, చేత పొన్నుకర్ర, నోట్లో బారెడు చుట్ట, గళ్ళలుంగీ, చూస్తే పూల రంగడే ననిపించాడు. "లేదు బాబూ! పొలాన్నుంచి కమ్మలు, ఆకులు ఎరువుని, పాలుపితికి, మొక్కలకి నీళ్ళుపోస్తున్నాను." అంటూ పుల్లయ్య సమాధానం ఇచ్చాడు. సంక్రాంతి సెలవులు సుఖంగా కరుణాకర్ ఇంట్లో గడపాలని నేనూ కరుణాకర్ నిశ్చయించుకున్నాం. పట్నం వదిలివెళ్ళి పల్లెలో పడ్డాం!

"సత్తెంబాబో! సత్తెంబాబో! శీనబాబు గారు పట్టంనుంచి వచ్చేశారు" అంటూ సంతోషంగా, మమ్మల్ని చూసి, కేకలు వేస్తున్నాడు. మాదగ్గరికి వచ్చి సామానందుకొని లోపల పెట్టేడు. రంగయ్యమేస్త్రీ. సత్యంగారు, వారిభార్య, చిట్టిపాప వీధివాకిట నుంచున్నారు. 'ఎవరూ?' అన్నట్టు, నావైపు చూస్తున్న వారికి సమాధానంగా, "నా స్నేహితుడు" అంటూ, కరుణాకర్ నాకేసి నవ్వుతూ చూశాడు.

చిన్నారిచిట్టిపాప అన్నయ్యకు దిష్టి తీసింది. నీళ్ళచెంబులు అందించింది. "లోనికి రండి నాయనా" అన్న సత్యంగారి ఆహ్వానంతో లోనికి వెళ్ళాం. "ఇప్పుడే వస్తాను, కూర్చోరా అంటూ కరుణాకర్ నవ్వుతూ లోనికి వెళ్ళాడు.

ఆ పెద్దయింటి సావడిలో ఏదో ఆలోచిస్తూ నలువైపులా పరిశీలనగా చూస్తూండిపోయాను. గోడమీదలక్ష్మి, సరస్వతి, వినాయకులు కలసి ఉన్న పెద్ద తైలవర్ణ చిత్రంపై నా దృష్టి ప్రసరించాను. పెద్ద గడియారం ఒకటి దానిపనిలో నిమగ్నమై ద్వారానికి పైన ఉంది. అనేకరకాల కేలండర్లు, ఫోటోలు, సర్టిఫికెట్లతో అలంకరించబడి ఉంది. హాలుకు కుడిఎడమల రెండుగదులున్నాయి. హాలులోని సోఫాలు, పూలతొట్టెలూ అన్ని పరిశీలించాను. ఎవరంత చక్కగా అలంకరించారనే ఆలోచనలో నిమగ్నమయ్యాను.

క్షణకాలం గడచింది. కుడివేపునుండి ఎడమవైపుగదిలోనికి కోక మెరుపు మెరసింది. ఆమె 'మందగమన జితరాజమరాళీ' అన్నట్టు సిగ్గుతో నాకేసి చూడకుండా వెళ్ళింది. రెండుక్షణాలు చకితుడ్ని కాక తప్పిందికాదు!

నా వెనుకనుంచి కళ్ళపై చల్లగా మెత్తనిదేదో తగిలినట్లయింది! ఏమిటో నన్నట్టు ఆశ్చర్యపడ్డాను. "ఎవరో చెప్పుకోండి చూద్దాం!" చిట్టిపాప నాతో దాగుడుమూతలాడింది. "చిట్టిపాపా! నువ్వే మూశావ్" అన్నాను.

# మరపురాని మధురానుభూతి

పాప చిలిపిగా అల్లరి చేసింది. "నువ్వే! దొంగా!!" అన్నాను. "ఇదిగో అన్నయ్య నన్ను దొంగంటున్నారు. చూడన్నయ్యా!!" చిలుక పలుకులు పలికింది.

దగ్గరకి చేరదీసుకుని, ఒడిలో కూర్చో పెట్టుకున్నాను. "నేను నిజం చెపితే, నువ్వు అబద్ధం చెప్పినందుకు గాను 'దొంగా' అన్నాను. తప్పేముంది?" అన్నాను. ఆశ్చర్యపోయి "ఏమండీ అయితే అబద్ధాలాడేవాళ్లు దొంగలన్న మాట" అంది, నవ్వి. ఆనందంగా అవునని తలూపాను. "నేను! రంగయ్య!...పుల్లయ్య!...నాన్న!... అమ్మ!...అన్నయ్య!... మీరూ! దొంగలేనా" అని పాప సందేహించింది. తలూపుతున్నాను. "మరి భాగ్యలక్ష్మి" అంది. తల ఊగలేదు! "ఏం? అందరూ దొంగలేనా?" అనడిగింది. నా ఆలోచన వేరని పాపకు తెలీదు. "చాలుకాని, ఊరుకోండి ఎవరయినా వింటే నవ్వుతారు..." అంది. ఏమన్నట్లు చూశాను. "దొంగలకి పెద్ద పెద్ద మీసాలుంటాయి — నల్లగా లావుగా ఉంటారు. కత్తులుంటాయి. మరి చీకటి రాత్రులలో వస్తారు. వాళ్ళు దొంగలంటేను! మరేం మసిబొగ్గుతో వేల మీద రాస్తే దొంగలౌతారంటుంది మా అమ్మ. అయినా అవునో కాదో అడిగొస్తానుండండి మా అమ్మని" అంటూ చిందులు వేస్తూ ఒడి దిగి పరుగెట్టింది. ఇక నాకు నవ్వొచ్చింది.

"భాగ్యలక్ష్మి ఎవరు?..." తెలుసుకోవాలని మనస్సు ఆరాటపడింది...! చక్కటి పేరు. పేరుకి తగ్గ అందం. వెర్రి ఆలోచన అనిపించింది. పేరు చిరపరిచితమే ననిపించింది. నా దృష్టి గదివైపు ప్రసరించింది. గాలికి రెపరెప కొట్టుకొంటున్న తెరవెనుక ఆమె సౌందర్యం నాలో దోబూచులాడుతోంది... ఆమె సుందర ముఖం వికసించిన పద్మంలాగుంది. కాదు చంద్రబింబంలాగుంది.

నిశ్చేష్టితయై ఆమె నావైపే చూస్తోందనిపించింది. ఆమెచాయ లేత ఎర్రగులాబి రంగులో కలసిపోయి మిరుమిట్లు గొలిపింది. ఆమె నా గురించి ఊహిస్తుంది. ఆ ఆలోచనలు ఏమిటో నాకెలా తెలియచేస్తుంది? అవకాశం ఎలా లభిస్తుంది. లభించినా అభిమానం అడ్డు తగుల్తుంది.

ఆలోచనలకు ఏమి కాని, ఫలించటమే కష్టమని చెప్పటానికొచ్చినట్లు కరుణాకర్ వచ్చాడు. ఆలస్యం అయిందంటూ ఎదురుగ్గా ఆమె ఉన్న గదిలోకే తీసుకెళ్ళాడు. నాలో దోబూచులాడే నా ఊహాసుందరి ఏ మహానుభావుడో చిత్రించిన అతని ఊహాసుందరి అయింది. గోడకు అతుక్కుపోయింది. నా హృదయం బరువెక్కింది.

"ఏరా? చిత్రం బావుందా?" అమ్మాయి చిత్రంవైపు చూపించాడు. నేను మెచ్చుకుంటాననుకున్నాడు. "సహజంగా, అందం ఉట్టిపడటం లేదూ?" ఆతృత వెళ్ళడించాడు. చేయెత్తి నమస్కరించాలనిపించింది. ప్రాణం నిలువునా నీరైంది. "ఏం చెప్పేదిరా?" అన్నా! "మా భాగ్యలక్ష్మి వేసింది. బావుందా?" అని మళ్ళీ అడిగాడు.

ఇంతకీ చేతిలో పెట్టుకున్న ఆమెకు నేనేం చెప్పాలో అర్థం కాలేదు! అసలు చెప్పే అదృష్టం నాకు లేదు అనుకున్నాను స్వగతంలో! 'బావుందిరా. అదృష్టవంతులకి కళ జన్మతః పుట్టుకొస్తుంది' అని మాత్రం వాడితో అనగలిగాను. "సరేలేరా. నువ్వెప్పుడూ ఏదడిగినా అలాగే చెప్తావు! తొందరగా కాఫీ, టిఫిను ముగించి అలా మా వూరు చూసొద్దాం" అన్న కరుణాకర్కి నేనేం చెప్పానో నాకే తెలీదు. వాడా విడిగా వెళ్ళిపోయాడు. ఆ చిత్రం వైపే విచిత్రంగా చూస్తుండిపోయాను.

పేరుమాత్రమే కాదు పరిచయమైంది. ఆ చిత్రంలోని ఆ సుందరి కూడా చిరపరిచితమే ననిపించింది. అసలు ఊహించి చూద్దాం అనిపించింది.

ఊహించాలే కాని ఊహాకందని దేది? గత పదేండ్లకు పైగా చూడాలనుకుంటున్న ఆమె ఈనాటికి కళ్ళపడింది. ఆమె చిత్రంలో విచిత్రంగా కళ్ళపడింది. చిన్నతనపు చిలిపిచేష్టలు ఆమె స్వీయచిత్రంలో, నా మనసూహించింది.

* * *

అవి సంక్రాంతి పండుగరోజులు. జనపచేలు ముత్యాలపూలు పూచి వెక్కిరించేవి. వరిపొలాలు తలలు బరువెక్కి వంగి నమస్కరించేట్టుండేవి. ఇక తోటలు తోపులు, దొడ్లు, ఇళ్ళు అన్నీ మా సొంతం.

'మా చేలు పండాలి. మా అమ్మవండాలి' అని గంతులు వేస్తూ ఉండేవాళ్ళం. కొత్త ధాన్యపు అటుకులు. బెల్లం, కొత్తబట్టలు కట్టే వళ్ళో పోసుకుని వచ్చేవాళ్లు ఆటలాడుకొందుకు. తలంటికుని కొత్తబట్టలు కట్టినా యిసుకలో పడి దుమ్ము మీద పోసుకుంటూ ఆడుతుండేవాళ్ళం. మురికిగా ఉండమని మమ్మల్ని దేముడు అలాగ సృష్టించాడని పిస్తుంది. 'చిన్నపిల్లలు చిలిపిచేష్టలు' అంటూ సమర్థించేవారు పెద్దవారు.

"ఛీ! ఛీ!! బట్టలు మాపుకుంటున్నారు" అని ఆడపిల్లలంటే చాలు, మావాళ్లందరూ "పేడవాసన కొట్టుకుంటూ మీ బట్టలు మహాబాగున్నటు" అని వెటకారం చేసేవాళ్ళు. "మరి గొబ్బిళ్ళు పెట్టే ఆడపిల్లలు......అది సహజం' అనేవాడ్ని. 'మీకు భోగిమంట కోసం ఎన్ని దుంగలు, ఎండిన చెట్లు తెచ్చామో చూడండి. మేం భోగిమంట

(78 వ పేజీ చూడండి)




చిత్రం: డి. వెంకటరావు, నెల్లూరు.

# అత్తగారూ ఆవు

నెం.

భానుమతీ రామకృష్ణ




బాగా పాలిచ్చే ఒక మంచి ఆవును కొనాలని ఎంతో కాలంనుంచి మా అత్తగారి సంకల్పం...దానికోసం చాలా చోట్ల విచారించింది...చుట్టుపక్కలవూళ్లన్నీ గాలించింది...కాని ఆవిడకు నచ్చిన ఆవు దొరకలేదు...ఆవుముఖం లక్షణంగా లేదనో, పీలగా వుందనో, రంగు బాగాలేదనో, సుళ్లు బాగా లేవనో, పళ్లు మొలవలేదనో, వున్న పళ్లు వూడాయనో వంక దొరికేది. మొత్తం మీద అన్నివిధాలా నచ్చిన ఆవు ఆవిడకు కనుపించలేదు.

ఆర్నెల్ల క్రితం మా పక్కింటివాళ్లు బదిలీ అయి వెళ్లిపోతూ, వాళ్ల గేదెను అమ్మేందుకు వ్యవధిలేక మాకు వాళ్ల జ్ఞాపకార్థం, "ఉండనివ్వండి" అంటూ గేదెను మా యింటికి తోలి వెళ్లిపోయారు......ఆవు దొరక్కపోయినా, అనుకోకుండా అంతమంచి గేదె దొరికినందుకు మా అత్తగారు మహా ఆనందపడిపోయారు ... "ఇంకమీద ఆ పాలవెధవ దగ్గిర గేదెపాలు కొనే అవస్థ తప్పిపోయింది..." అంటూ మురిసిపోయింది...

కాని గేదెకు మేత ఏం పెట్టాలో, ఏమిటో మా అత్తగారికి బాగా తెలీదని మాత్రం నాకు బాగా తెలుసు...ఆవిడికి ఆవు సంగతి తప్ప గేదెసంగతి తెలీదు ... దానికి తగినట్లు మా తోటవాడికి పూలమొక్కల సంగతి తప్ప గొడ్డూ, గోదా సంగతి అసలు తెలీదు- పాలుపిండడం మాత్రం చాతవునన్నాడు.

"పోనీ మనపాలవాడినే కొద్దిరోజులపాటు మన గేదెకు మేతాగీతా చూడమంటే ఒదిలిపోతుందిగా!"...అన్నాను మా అత్తగారికి సలహాయిస్తూ...

"వావ్వ...!" అన్నారు మా అత్తగారు...

హడలిపోయాను—ఏం తప్పన్నానని...

"అదికాదే వాడిదగ్గర మనం పాలుకొంటం మానేశామనే కోపంతో గేదకేదైనా మందూ, మాకూ పెట్టిచంపితే!...అన్యాయంగా చూస్తూ చూస్తూ, తెలిసి తెలిసి నోరులేని గొడ్డును తీసికెళ్లి పులినోటి కందిస్తానంటావే!..." అంటూ నా తెలివితక్కువకు బాధపడ్డారు....

"మరి మనతోటవాడికి దానిమేత సంగతి తెలీదంటున్నాడే!"...అన్నాను.

"ఆ వెధవకి తెలీకపోతే నాకు తెలీదనుకున్నావా?...అయినా అదేం పెద్ద బ్రహ్మవిద్యగనక!—మా పుట్టింటివాళ్లకు గేదె అచ్చిరాలేదనేగాని చిన్నప్పట్నుంచీ నేను ఆవుల్లోనే పెరిగాను...ఆవెంతో గేదంతా ...దానిమేతెంతో దీనిమేతంతా...కాకపోతే ఆవుకంటే కాస్త అధికంగాతింటుంది గేదె...ఈ మాత్రానికి పాయి వాణ్ణెవణ్ణో అడగడం ఎందుకూ పన్లేనిపనీ!..." అంటూ కోప్పడ్డారు మా అత్తగారు....



సరే మనకెందుకొచ్చిందని వూరుకున్నాను.

పాలవాడొచ్చి గేదెను చూడాలని సంబరపడ్డాడు...మా అత్తగారు వీల్లేదుపొమ్మన్నది. వాడిని గేదె ప్రాంతాలకు కూడా వెళ్ళనివ్వకుండా, తనే స్వయంగా, స్వహస్తాలతో, మూడు పూటలూ దట్టంగా గేదెను మేపడం మొదలెట్టింది...

మొదటరెండురోజులూ పక్కింటివాళ్లకిచ్చిన పాలకంటే చాలా ఎక్కువే యిచ్చింది...

మేమంతా మా అత్తగారికి జంతురక్షణ విషయంలో వున్న అనుభవానికి ఆశ్చర్యపడిపోతూ ఆమెను అభినందించాం...

"అంతే నే...ఏదైనా అంతే...పిండికొద్దీ రొట్టె...అన్నారుమా అత్తగారు అలక్ష్యంగా చప్పరిస్తూ.

మర్నాడు గేదె ఒక్కసగం పాలు తగ్గించేసింది ... కారణం తెలీక ఖంగారుపడ్డారు మా అత్తగారు. ఆరోజంతా ఆలోచించి దానికి యింకా తిండి చాలేదనే తీర్మానానికి వచ్చారు. వెంటనే పత్తిగింజలూ, సజ్జలూ, యింకా ఏవో తెప్పించారు బజార్నుంచి. అంతకుముందు గేదెకు వేస్తున్న, కందిపొట్టు, పెసరపొట్టు, గోధుంపొట్టు, శెనగపొట్టు, గానుగ చెక్క, తౌడు పచ్చిగడ్డి, ఎండుగడ్డి వగైరాలతో బాటు, పత్తిగింజలు రుబ్బి, సజ్జలు, ఉడికించి, మొత్తం అన్నీ కలిపి గేదె ఒద్దంటున్నా వినకుండా బ్రతిమాలి దాని కడుపు నిండా పట్టించారు.



# ★ అత్తగారూ, ఆవు నెం. 23 ★

మర్నాడు ప్రొద్దుటే పాలు పిండడానికి వెళ్ళిన తోటవాడిని ఒక్క తాపు తన్నింది గేదె. వాడి ముందుపళ్లు రెండూ విరిగిపోయాయి. ఇహ దగ్గిరికెళ్ళినవాళ్లందర్నీ వెనక్కాళ్ళతో ఝాడించి తన్నడం మొదలెట్టింది. మా అత్తగారు దానికి పెట్టిన యమ తిండియొక్క బలం ఆవిధంగా చూపిస్తోందనిపించింది... కారణం ఏమిటాని దూరంగా నిలబడి ఆలోచించడం మొదలెట్టారు.

గేదె కడుపు విపరీతంగా లావుగా వుంది... ఆయాసపడుతూంది... ఒకచోట నిలకుండా చిందులు తొక్కుతోంది. దాని అవస్థచూస్తే ఒకవేళ కడుపునొప్పితో బాధపడుతోందేమోనని అనుమానం కలిగింది నాకు. ఆ సంగతి చెప్పి చూశాను.

"ఛా వూరుకో...దృష్టి కళ్లూ నువ్వూనూ. గేదకు తిండి ఎక్కువ కావడం ఏమిటే' తక్కువయిందని చెప్పు...అసలు యింతకూ అపాల వెధవ దిష్టి కొట్టింది దానికి" అన్నారు మా అత్తగారు.

"పాపం వాడు అసలు గేదెను చూడనే లేదుగా!" అన్నాను.

"చూడాలా! మనసులో ఏడ్చుకుంటే చాలూ!" అంటూ అది పాలవాడి మనోదృష్టి"ని తేల్చారు మా అత్తగారు...

వెంటనే ఒకవీశె మిరపకాయలూ, అరవీశె కర్పూరం, మానెడు ఉప్పూ ఒకపాతచీపురు కట్టా, వగైరా సేకరించి-దూరంనుంచే గేదెకు దిష్టి తీశారు...పాలవాడిని తిట్టుకుంటూ పటపట మెటికలు విరుస్తూ.

ఆ రాత్రే గేదె చచ్చిపోయింది.

ఈసంగతి విని పాలవాడు ఒకటే గోల "అయ్యో దానికి కొత్త యింగువా వెల్లుల్లి పాయలూ నూరి మింగిస్తే బతికేదమ్మగారూ. బంగారంలాంటి బర్రను, తిండి ఎక్కువ పెట్టి పెద్దమ్మగారు చంపేశారమ్మా—" అంటూ ఏడ్చాడు—

"ఛా వెధవా నోర్మూయ్ ... మళ్ళీ ఆ మాటన్నావంటే పళ్ళురాల కొట్టిస్తాను... అసలు నీ దృష్టితోనే పోయిందది..." అంటూ పాలవాడిమీద మండి పడ్డారావిడ.

"ఒకవేళ వాడు చెప్పినట్లు మందూ మాకూ వేస్తే బ్రతికేదేమో పాపం" అన్నాను భయపడుతూనే...

"ఆ-నా తలకాయ బ్రతికేది ... ముందే చెప్పానుగదే!... మా పుట్టింటివాళ్ళ దగ్గిర్నుంచి చూసున్నాగా మనకు గేదె అచ్చిరాదు...అంతే" అన్నారు మా అత్తగారు.

మళ్ళీ పాలవాడిచ్చే పాలపాలబడ్డాము మేము. రాను రాను ఆవుపాలు కటిక నీళ్లుగా తెచ్చి యిస్తున్నాడు. మూడు పూటలూ ఆవుపాల మీదనే ఆధారపడే మా అత్తగారు పాపం ఆ కటిక నీళ్ళు మింగలేక అవస్థపడ్డారు. ఏదో ఒక ఆవును వెంటనే కొనాలనే తీర్మానానికి వచ్చారు. ఈసారైనా పాలవాడి సలహా తీసుకుంటే మంచిదని తోచింది నాకు.

"అబ్బే-ఆవు సంగతి వాడికేం తెలుసునే!"...అన్నారు మా అత్తగారు చప్పరిస్తూ...

"ఎక్కడుందో విచారించుదాం-మనకు నచ్చితే కొందాం" ... అని నెమ్మదిగా నచ్చజెప్పాను... "సరే నీయిష్టం" ... అన్నారావిడ అయిష్టంగా.

సుమారుగా వుంటే చాలు. పాలుమాత్రం బాగా యిచ్చే ఆవు కావాలనీ ఎక్కడ దొరుకుతుందో వెంటనే చూడమనీ పాలవాడు రాగానే పురమాయించాను.

"ఎందుకూ! గేదెను చంపింది చాలక మళ్ళీ ఆవునుకూడా చంపదల్చుకున్నారా! అత్తా కోడలూ"? అన్నారు మావారు పైన బాల్కనీలో నిలబడి నవ్వుతూ—మా అత్తగారికి కోపం వచ్చింది ... పాలవాడు పక్కకు తిరిగి తలగుడ్డ చాటున నవ్వుకున్నాడు మావారి మాటలకు...

"చంపితే చంపాన్లేరా—ముంది నీళ్ళపాలు తాగలేక నేను చస్తున్నాను" అంటూ మా అత్తగారు విసుక్కున్నారు...

"సరే అయితే ఉండండమ్మగారూ, రేపు శుక్రవారంనాడు సంతకాడికెళ్ళి మంచి ఆవుగా చూసి పట్టకొస్తాను" అన్నాడు పాలవాడు.

"ఛా ఛా—ఈ వూరు సంతలో మంచి ఆవు ఎక్కడ దొరుకుతుందిరా నీముఖం. మీకు మంచి ఆవు కావాలంటే ఒకచోట దొరుకుతుంది" అన్నారు మావారు—మా అత్తగారి ప్రాణం లేచొచ్చింది.

"ఎక్కడ్రా"? అన్నారు మా అత్తగారు పైకి చూస్తూ.

"చెప్తాను—కాని ఖరీదెక్కువ—అంతే కాదు. దానికి టైము ప్రకారం మేతాగీతా వెయ్యాలి. లేకపోతే ప్రయోజనంలేదు—అదంతా దొర్ల సమాచారం ... సీమావులు అక్కడ వుండేవన్నీ—"

"ఏ ఆవు అయితే నేమిట్రా, వేళకింత మేత వెయ్యాలంటావు. అంతేగా! వేస్తాను. ఆవును పెంచడం నాకలవాటేలే" అన్నారు మా అత్తగారు.

అబ్బే—నువ్వు పెంచడం గించడం పనికి రాదు. దానికి ప్రత్యేకంగా ఓ మనిషిని పెడతానంటేనే చెప్తాను." అన్నారు మావారు వాళ్ళ అమ్మను ఏడిపించడానికి—

"సరే అట్లాగే చేద్దాంలే ...ముందా ఆవు

ఎక్కడుందో చెప్పు"—అన్నారు మా అత్తగారు—

"ఇక్కడికి యిరవై మైళ్ళ దూరంలో, యాభై ఎకరాల స్థలంలో, కొత్తగా ఒక 'ఫారమ్' 'ఓపెన్' చేశారు. అక్కడ కొన్ని వందల ఆవులూ, ఎద్దులూ, గేదెలూ, దున్నపోతులూ దొరుకుతాయి..." అని మా వారు చెబుతూంటే పాలవాడి చెవుల్లో అమృతం పోసినట్లయింది...

"అబ్బో! అబ్బో! కొన్ని వందల గొడ్లే! అయితే ఆసోటు యింద్రలోకం లాగుంటదన్నమాట...అయితే యీయాల్టే ఆడికెళ్ళి ఓ మంచి ఆవును సూసి పట్టకొస్తా సోమీ" అన్నాడు పాలవాడు హుషారుగా తలగుడ్డ చుట్టుకుంటూ—

"నువ్వెక్కడికిరా మాటకుముందు అశకునంలాగా!... నేను వెళ్లి చూసొస్తాలే" అన్నారు మా అత్తగారు—

"నువ్వెందుకమ్మా వెళ్ళడం!—యాభై ఎకరాల స్థలంలో, అన్ని వందల పశువుల్లో, నీకు నచ్చిన ఆవు ఎక్కడుందో తిరిగి వెదకడం మాటలా! నా మాటవిని వాణ్ణే వెళ్ళి రానీ" అన్నారు మావారు.

'వాడు వెళ్తే ఎట్లారా! నాకు నచ్చిన ఆవు ఏదో వాడికెట్లా తెలుస్తుంది! నా కంటితోగదా చూడాలంటున్నాను."

అవసరంలేదమ్మా—అక్కడుండే ఆవులన్నీ మంచి ఆవులే—నీకేలాంటిది కావాలో వాడికి గుర్తులు చెప్పి పంపించు. వాడికీ ఆవుల సంగతీ గేదెల సంగతీ తెలుసుగా!" అన్నారు మావారు.

'చూడండి సోమీ—మరీ యీ పెద్దమ్మగారు నన్ను అసలు ఏమీ తెలవని గాడిద కింద కట్టేసింది. ఆవు నాకచ్చి రాలేదన్నమాటేగాని సిన్నప్పట్నించి గొడ్లతో పుట్టి గొడ్లతో పెరిగాను—ఏ గొడ్డు ఎట్లాంటిదో నాకు తెల్సు—నా సంగతి గొడ్డుకు తెల్సు" అన్నాడు పాలవాడు మా వారి అసరా చూసుకొని కొంత ధీమాగా.

"ఇంకేందుకురా! అక్కడ ఫారమ్ మేనేజరుగా వున్నది నా 'ఫ్రెండే'—వాడూ నీలాగే గొడ్లతో పుట్టి, గొడ్లతో పెరిగిన సరకే. వాడికో ఉత్తరం రాసిస్తాను తీసికెళ్లివ్వు-అక్కడుండే వాటిలో మంచి ఆవుగా చూసి మనకి పంపిస్తాడు" అన్నారు మావారు-

"అయితే సిక్కే లేదు-అట్నే చెయ్యండి సోమీ-అయితే ఎప్పుడెల్లమంటారు సోమీ?" అన్నాడు పాలవాడు-

"అదంతా నాకు తెలీదు. పెద్దమ్మగార్నడుగు"-అంటూ మావారు లోపలికెళ్లిపోయారు.

"మరి యీపూటే ఎళ్లమంటారా పెద్దమ్మగారూ?" అన్నాడు పాలవాడు.

"ఈపూట ఎట్లా వెళ్తావురా యింకా చవితి మిగులుంటేనూ? - పన్నెండుగంటల తర్వాతగాని పంచమి ఘడియలు రావు-మధ్యాన్నించి వెళ్లు" అన్నారు మా అత్తగారు-

"సరే అయితే అట్టనే కానీయండి—అంటూ పాలవాడు గేదెల్ని తోలుకుని యింటికి వెళ్లిపోయాడు-

మధ్యాన్నం రెండుగంటలకంతా వచ్చేశాడు పాలవాడు-ఎర్రపంచె, పచ్చచొక్కా, ఉదారంగు తలగుడ్డతో పూరంగడిలాగా ముస్తాబై వచ్చాడు—వాడి వెనకాలే వాడి యిద్దరు పెళ్లాలూ వచ్చారు - చిలక పట్టుచీర కట్టి, సిగనిండా పూలుచుట్టి, నోటినిండా తాంబూలం బిగించి ముసిముసినవ్వుల్తో సీతాకోక చిలకల్లాగా వచ్చి, వాకిట్లో వున్న వెంకాయచెట్ల చాటున వాళ్లిద్దరూ దొబూచులాడడం మా అత్తగారి కంటపడ్డది...

"వాళ్లెక్కడికిరా! వాళ్ళిద్దర్నీ తీసుకొచ్చావేంగనూ?" అన్నారు పాలవాడి మీద మండిపడుతూ...

"మేంగూడావచ్చి చూస్తావంటూ ఎంట బడ్డారండమ్మగారూ" అన్నారు సిగ్గుపడుతూ పాలవాడు.

"పాపం వాళ్లనుకూడా తీసుకెళ్లనీయమ్మా. తీసుకెళ్ళరా, నీ యిద్దరు పెళ్లాల్నీ కూడా తీసుకెళ్లు...తస్సాదియ్యా ఛాన్సంటే నీదిరాఛాన్సు...ఈకాలంలో ఇద్దరు పెళ్లాల్ని ఒక్క మాటమీద లాక్కొస్తున్నావంటే నిజంగా నువ్వురా "హీరో"వి. అనుభవించు అనుభవించు" అంటూ హుషారుగా నవ్వుతూ మావారు పాలవాడి అదృష్టానికి లోలోపలే ఈర్ష్యపడ్డారు...నాకు నవ్వొచ్చింది...నా మీద మా వారికి కోపం వచ్చినప్పుడంతా "వెధవ పాలవాడికి యిద్దరు పెళ్లాలు..." అంటూ వుంటారు. పాలవాడిని చూస్తే మా వారికి ఈర్ష్య, వాడి యిద్దరి పెళ్ళాల్నీ చూస్తే మా అత్తగారికి ఒళ్లుమంట. పాలవాడి యిద్దరు పెళ్ళాలూ నవ్వుతూ పేల్తూ ఒద్దిగ్గావుండడం మా అత్తగారికి కొంచెం గూడా నచ్చలేదు... "యిదేం విడ్డూరమే!—నేనెక్కడా చూళ్లేదూ!...సవతులన్న తర్వాత పోట్లాడుకోవద్దూ!—మీరిద్దరూ ఒక్కరోజూ పోట్లాడుకోరేం!" అని అడిగేది మా అత్తగారు...

"పోట్లాటెందుకమ్మగారూ!—మా యక్క నన్ను బాగానే సూసుకుంటది..." అనేది చిన్నది; "పోట్లాటెందుకమ్మగారూ! మా సెల్లె బాగనే సూసుకుంటది నన్ను...అనేది పెద్దది....

వాళ్లిద్దరూ ఆవిధంగా ఒక్కమాటమీద ఒద్దిగ్గా నిలిచి ఒకళ్లమీదొకళ్లు ఆప్యాయం ఒలకబోసుకోడం, మా అత్తగారి ఒళ్లుమంటకు మరికొంత కారణమైంది...ఎట్లాగయినా వాళ్లిద్దరూ పోట్లాడుకుంటే చూడాలని తన శాయశక్తులా ప్రయత్నించారు...వాళ్లిద్దరూ పోట్లాడుకోకపోగా "మీకిదేం బుద్ధి పెద్దమ్మగారూ!" అంటూ ఒకసారి మెత్తగా చీవాట్లు పెట్టారు.... దాంతో వాళ్ళిద్దర్నీ చూస్తే మా అత్తగారికి అరికాలిమంట

"అయితే యిద్దరు పెళ్లాల్నీ వెంటేసుకెళుతున్నావే. మరిసాయంకాలం పాలెవరు పిండుతారు!...అన్నారు వాడి పెళ్లాలవైపు కొరకొరచూస్తూ.

"మా తమ్ముడికాడ చెప్పొచ్చినమ్మగారూ. అడు తోలుకొచ్చి పిండుతాడు" అన్నాడు గోపాలవాడు.

"సరే అయితే వెళ్లిరా-తీరా. అక్కడికెళ్ళింతర్వాత నీ యిద్దరి పెళ్లాల్నీ చూసుకుంటూ మా ఆవు సంగతి మర్చిపోవాక. మంచి ఆవుగా చూసియిమ్మని అబ్బాయి స్నేహితుడితో చెప్పు-నల్లటి పొదులుంటే ఆవు శ్రేష్ఠం-ఒక యీత రెండీతలకంటే ఎనవేసింది మనకొద్దు-పళ్లుఎన్ని మొల్చాయో



# అత్తగారూ...

మంచిది అయ్యగార్ని కూడా ఓపాలి అడిగి సెప్పండమ్మగారూ..."

"పోనీ ఓపని చేసే!.. దూడను వేసిందాకా ఆవు నక్కడే వుంచి దూడను వేసిం తర్వాత పంపమంటే పంపుతారా?" అన్నాను నేను కలగజేసుకుని

పాలవాడి ప్రాణం లేచొచ్చింది...

"ఓ పంపుతారండమ్మగారు...

అట్ట పంపకపోతే ఆవు మనకొద్దంటేసరి... ఎటుతిరిగీ పదిరోజుల్లో దూడనేస్తదన్నారు ...అట్టెయ్యకపోతే మే నెజరయ్యే దగ్గరుండి దూడ్నే పిస్తానన్నారు..."

"మే నేజరయ్య దూడని వేయిస్తాడో, వేస్తాడో నా కనవసరం... వచ్చే శుక్రవారం నాటికైనా ఆవు దూడతో సహా యింటికి రావాలి. అంతే...యీ సంగతి చెప్పవాళ్ళతో..." అన్నారు మా అత్తగారు....

"అట్టనే సెప్తా పెద్దమ్మగారూ—రేపు సందకాడే ఎల్తా...' అంటూ పాలవాడు తలగుడ్డలో దాచిన రసీదూ, మిగతా సొబ్బూ భయభక్తులతో మా అత్తగారి చేతులో పెట్టి బ్రతుకు జీవుడా అంటూ వెళ్ళిపోయాడు.

* * *

వచ్చే శుక్రవారం నాడు ఆవొస్తుందని మా అత్తగారు గొడ్లకొట్టం అంతా శుభ్రం చేయించారు. నా చేత ముగ్గు వేయించి, గుంజకు పసుపుకుంకం కూడా పెట్టించారు. తోటవాడిచేత మామిడితోరణాలు కట్టించారు.

ఇంతా చేసి శుక్రవారం నాడు ఆవు రాకపోగా పాలవాడు కూడా రాలేదు...ఇంక మా అత్తగారు ఒళ్ళుతెలీనికోపంతో ఇల్లంతా తిరిగారు. పాలవాడు ఆరోజు కనిపిస్తే మా అత్తగారు వాణ్ణి నమిలిమింగేస్తారనిపించింది. వేళమంచిది. వాడు ఆరోజూ, మర్నాడు కూడా రాలేదు. కారణం తెలీక వాడింటికి కబురుపెట్టాం. ఇలు తాళం వేసుందట. గురువారం నాడు రాత్రికి రాత్రే యింటిల్లిపాదీ ఎక్కడికో వెళ్ళిపోయారని ఇరుగు పొరుగువాళ్ళు చెప్పారట మా తోటవాడికి. ఇహ మా అత్తగారికి పూనకం వచ్చింది. పాలవాణ్ణి చెడామడా తిట్టడం మొదలెట్టారు.

"నే నప్పుడే చెప్పాను వాడు ఒట్టి దొంగ వెధవని...యిట్లా పరారవుతాడని నాకు ముందే తెలుసు నే"...అన్నారు...త్రికాల జ్ఞానం గల మా అత్తగారు.

ఇరుగు పొరుగువాళ్ళంతా మా యింటికి ఆవు వచ్చేసిందనుకుని, జున్ను పాలకోసం, ఆవు పంచితంకోసం మా అత్తగారికి కబురు [illegible]ం మొదలెట్టారు. పాలవాడు మా అత్త

గారికి భయపడి దేశాంత్రం పోయాడని మా వారికి తెలిసింది.

"పాపం వాడు మాత్రం ఏం చేస్తాడు'... మీ ఆవు బాధ పడ్లేక ఏనుమ్మో, గొమ్మో చూసుకోనుంటాడు"...అంటూ వాడి మీద జాలిపడ్డారు.

మావార్ని ఆవు సంగతి ఫారమ్‌కు టెలిఫోన్ చేసి కనుక్కోమని చెప్పారు మా అత్తగారు. టెలిఫోన్ చేస్తే మేనేజరు వూళ్లో లేడు. మిగతా వివరాలు మనిషి రాంది మాకు తెలీవన్నారు...మేనేజరో, పాలవాడో ఎవరో ఒకరు వచ్చిందాకా ఆగమని మావారు సలహా యిచ్చారు. మా అత్తగారు ఒక్కరి సలహా వినదల్చుకోలేదు...వెంటనే బయల్దేరారు. ఆవు సంగతి తేల్చుకొస్తానంటూ... దూడను వేసివాసరే, వెయ్యకున్నా సరే తక్షణం ఆవును యింటికి తోలమని చెప్తానంటూ తోటవాడిని తోడుపిల్చుకుని కార్లో బయల్దేరి వెళ్లిపోయారు.

ఆమె అటు వెళ్లగానే పాలవాడొచ్చాడు. "ఏంరా ఎక్కడ మాయమైపోవే" అన్నాను. వాడు కండ్లు తుడుచుకుంటూ, "ఏం చెప్పేదమ్మగారూ! పక్కవూళ్లో మా అన్నకు కానా డేంజర్‌గా వుందని అర్ధరాత్రికాడ తంతిగొట్టారు...రాత్రి రాత్రికే ఎళ్ళాం - ఆడ మా అన్నకి అయిదుగురు పిల్లలు-తల్లి లేనోళ్లు-అళ్ళను సూట్టానికి పెంపడానికి నా యిద్దరు పెళ్ళాల్నీ, తమ్ముణ్ణి గూడా తీసుకెళ్లా...యిప్పుడు మా యన్నకి కాస్త నయమూరుగా వుంది...పిల్లల్ని సూసుకోటానికి పెద్దదాన్ని ఆడే వుంచి, చిన్నదాన్ని మాత్రం తీసుకొచ్చా... తమకి పాలకి కానా యిబ్బందయి వుంటది.....అర్ధరాత్రికాడ యింటికొచ్చి మిమ్మల్ని నిద్రలేపి యీ సంగతి సెప్పడం బాగుండదని అట్టానే ఎల్లిపోయామమ్మగారూ......" అంటూ వాడి గాథ చెప్పుకున్నాడు—

"అయితే ఆవింకా రాలేదా అమ్మగారూ" అన్నాడు పెద్దమ్మగారి కోసం నాలుగు వైపులా వెదుకుతూ...

"రాలేదురా ... యిప్పుడే పెద్దమ్మగారు వెళ్లారు...చాలా వున్నైనా వెంటనే యింటికి తోలమని చెప్పిరావడానికట—"

"అదేంటి చిన్నమ్మగారూ ?...నూలావు మాకచ్చిరాదన్నారుగా పెద్దమ్మగారూ!... యీ మాట ఆయాలే సెప్పినట్టయితే సరిపొయ్యేదిగా!...... అయితే రేపొస్తదన్నమాట ఆవు......మరి నేకూడా సందకాడే గొడ్లని తోలకొచ్చి ఆవొచ్చేయాలకింకుంటానండమ్మగారూ" ...... అని చెప్పి వెళ్లిపోయాడు పాలవాడు...

దీపాలు పెట్టేసరికంతా తిరిగొచ్చేశారు మా అత్తగారు...

"ఏం మాణిరా!" అన్నాను ఉత్సాహం

చూశ్లేదు ......అదెక్కడుందో వెతికేసరికే నా తాతలు దిగొచ్చేట్టున్నారు ... అదేం 'ఫారమా' ఎత్తుభారం ... యాభై ఎకరాలంటది ... అన్నిగొడ్లల్లో మన ఆవు ఎక్కడుందో ఎవర్నడిగేది!... దానికి తగినట్టు మేనేజరు వూళ్లో లేడు. మాకా వివరాలు తెలీవన్నారు — కానీపటికి ఎవడో వచ్చి "మీకు దాన్నెంబరు తెలుసా?" అని

ప్రత్యేక **త్రిగుణ చర్యలతో**

గూడియున్న **మెక్లీన్స్**

**పెరాక్సయిడ్** **టూత్ పేస్టు**

1

**చాలా బాగుగా**
*** శుభ్రపరచును!**

ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'హైపాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడుచుండే—మురికివి క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.

2

**చాలా బాగుగా**
*** తెలుపుజేయును!**

మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన దాగులను, గారపట్టిన రంగును తొలగించును—అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా చేయును.



మెక్లీన్స్

3

*** బాగుగా కాపాడును!**

మీరు మెక్లీన్స్‌ను స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని తాజాదనమును కనుగొనండి. ఇది పనుచిగుళ్లను ఉత్తేజపరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.

బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును.

*ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది!*

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంతమైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స కొనండి!**

అడిగాడు. తెలుసంటూ యిరవై మూడో నెంబరు' అని చెప్పాను — మన యెద్ద సడిగాడు చెప్పాను ...... "ఆ నెంబర్ని ఎప్పుడు తోలాలి! అన్నాడు. తక్షణం తోలమన్నాను ...... రేపు తెల్లవారేసరికి ఆ నెంబరు మనింటి దగ్గిరుండాలని గట్టిగా చెప్పొచ్చాను. సరే నన్నాడు..."

పాలవాడొచ్చాడన్నాను...

"ఆ దొంగవెధవ సంగతి నాతో చెప్పనాక ...... యీ రెండు రోజులూ ముఖం తప్పించి నే నటువెళ్లంగానే నీదగ్గిర కల్ల బొల్లి కబుర్లు చెప్పడానికి వచ్చాడన్నమాట సిగ్గులేనివెధవ ... ఏముఖం పెట్టుకొచ్చాడు" అన్నారు మండిపడుతూ...

"వాడి అన్నకేదో జబ్బుగా వుందని—" అంటూ నేను పూర్తిచేయకముందే మా అత్తగారి త్రికాలజ్ఞానం నాకడ్డు తగిలింది.

"నాకు ముందే తెలుసు వాడీలాంటిదేదో చెప్తాడని...వాడి మాటలు నువ్వూ, నీ మొగుడూ నమ్ముతారు గనకనే అట్లాంటి కథలన్నీ చెబుతుంటాడు...నాదగ్గిర చెప్పమను...! అందుకే నన్ను చూస్తే వాడికి చచ్చేంత భయం..."అంటూ లేచి నిలబడ్డారు మా అత్తగారు.

"అన్నట్లు తెల్లవారుఝామునే లేచి బాయిలర్ అంటించి వేణ్ణీళ్లు పెట్టాలి పాపం. నోర్లేని గొడ్డు అన్ని మైళ్ళు దూరాన్నుంచి నడిచొస్తుంది ... వేణ్ణీళ్లతో బాగా దాని కాళ్లూ, ఒళ్లూ కడగమని చెప్పాలి మన తోటవాడితో...నాలుగింటికి అలారం పెట్టు" అంటూ పెరటివైపు వెళ్లారు మా అత్తగారు.

నేను నాలుగింటికి అలారం పెట్టాను. ఈ సంగతి తెలీక ప్రొద్దున్నే 'మీటింగ్' వుందని మావారు ఆరింటికి 'కీ' యిచ్చి పెట్టారు...యీ రెండూ తెలీక మావాడు పరీక్షలకు చదువుకోడానికి రెండుగంటలకే తిప్పి పెట్టాడు...

రాత్రి రెండుగంటలకంతా అలారం గోల గోలగా కొట్టుకుంది-మంచి నిద్రవేళ... నాలుగింటికి పెడితే రెండింటికి కొట్టిందేమిటి!...అనుకున్నాను...ఆరింటికి పెడితే పన్నెండింటికే కొడుతోంది...యీ అలారం చెడిపోయినట్లుంది తీసి దిబ్బలో పారేయ్

# అత్తగారూ...

అన్నారు మావారు నిద్దట్లోనే...మావాడి రూములో లైటు వెలిగింది...నాకప్పుడర్థమైంది—వాడితో కూడా కూర్చుని హిందీ పాఠాల్లో సహాయం చేశాను నాలుగయిందాకా...

తెల్లవారింది-ఆవును ఆహ్వానించడానికి అన్నీ సిద్ధం చేశారు మా అత్తగారు. పసుపు కుంకుమాలూ, పూలూ, పళ్లూ టెంకాయ, తాంబూలం, హారతి కర్పూరం వగైరాలతో ఆవుకోసం బయట వరండాలో కూర్చున్నాం మా అత్తగారూ, నేనూ..

పాలవాడు గేదెన్ని తోలుకొని చిన్న పెళ్లాంతో సహా వచ్చాడు...మా అత్తగారు ప్రొద్దున్నే వాడిమీద ఎక్కడ విరుచుకు పడతారోనని భయపడ్డాను.. అసలు వాడివైపే చూళ్లేదు... ఆవుకోసం జపం చేస్తూ తపస్సులో కూర్చున్నారు ఎవరితోనూ మాట్లాడకుండా...

ఆరయింది ... ఏడయింది ... ఎనిమిదయింది...తొమ్మిదయింది...ఆవు రాలేదు మా వారు మా అవస్థను నవ్వుకుంటూ మీటింగ్‌కు వెళ్లిపోయారు...

నిండు చూలాలు గనక ఒకవేళ నడవలేక నడుస్తోందేమోనని ఒక వైపూ, ఒకవేళ దూడను ఈని వున్నట్లయితే పచ్చి ఒంటితో యింతదూరం నడవలేక అవస్థ పడుతోందేమోనని మరోవైపు, ఇలా పరిపరి విధాల పోయింది మా అత్తగారి మనసు...

మొత్తానికి పదిగంటలయినా ఆవు రాకపోయేసరికి మా అత్తగారు మరీ కంగారుపడసాగారు...నా ముఖం ఆమె, ఆమెముఖం నేనూ చూసుకున్నాం ప్రశ్నార్థకంగా... గేట్లో గంటల చప్పుడు వినిపించింది ...మా అత్తగారి ప్రాణం లేచొచ్చింది...

"వొచ్చినట్లుంది పదపద ముందు దానికి దృష్టి తీయాలి"...అంటూ పళ్లెంలో ఎర్ర నీళ్లు కలిపి మధ్యన కర్పూరం పెట్టి నా తిచే కిచ్చింది మా అత్తగారు...

గేటుదాటి లోపలి కొస్తూనే ఆకాశం దద్దరిల్లేట్లు ఒక్క రంకె వేసి, మేరుపర్వతంలా వచ్చి మా ముందు నిలబడ్డది ... బ్రహ్మాండమైన వృషభం...

"ఆ!..." అంటూ నోటమాట లేకుండా గుడ్లు తేలేశారు మా అత్తగారు...

పాలవాడు తలగుడ్డచాటున చచ్చేట్టు నవ్వుతున్నాడు...

వాడి పెళ్లాం గేదెలచాటున పడీపడీ నవ్వుతోంది...

నేను నవ్వాపుకుంటూ, 'ఈ ఎద్దును యే అడ్రసుకు తోలమన్నారు!' అని అడిగాను తోలుకొచ్చినవాడిని-ఒకవేళ అడ్రసు మారి వచ్చాడేమోనని...

"ఈ అడ్రసుకే నమ్మగారూ ... తెల్లారేసరికి యిరవై మూడో నెంబర్ని యీ అడ్రసుకి తోలమని మా అసిష్టెంటు మేనేజరయ్య చెప్పాడు ... కావాలంటే అడ్రసు చూడండి..." అంటూ చిన్న చీటి చూపించాడు.

నిజమే...'ఇంకేం అడిగేది'...మా అత్తగారివైపు చూశాను...ఆమె కొంచెం తెప్పరిల్లి "అదికాదురా! ఇరవై మూడో నెంబరు ఆవును తోలమన్నాంగాని, అచ్చోసిన యీ ఆంబోతునా తోలమన్నా...! ఎవడ్రా ఆ తల్లేని అసిష్టెంటు మేనేజరూ..." అని మా అత్తగారు తోలుకొచ్చినవాణ్ణి ఝాడిస్తుండంగానే టెలిఫోన్ వచ్చింది.

'ఫారమ్' నుంచి అసిస్టెంట్ మేనేజర్ మాట్లాడాడు...

పొరపాటు జరిగిపోయిందనీ, ... ఇరవై మూడో నంబరు ఆవును కట్టేసేచోట ఎద్దును కట్టేశారనీ, ఇరవై మూడో నంబరు ఆవు అసలు చూలు గాదనీ, దానికేదో గర్భకోశంలో జబ్బువల్ల కడుపు లావయిందని డాక్టరు చెప్పాడనీ...డబ్బు వాపసు పంపిస్తున్నందుకు క్షమించాల్సిందనీ...'ఫారమ్' ఆరంభించినర్వాత యీలాంటి పొరపాటు జరగడం ఇదే మొదటిసారి అనీ చెప్పి కట్ చేశాడు...

"గేదె అచ్చిరాలేదంటే మనకు ఆవు కూడా అచ్చిరాలేదన్నమాట" అన్నారు మా అత్తగారు నిట్టూర్పు విడుస్తూ... ★








సిగ్గని వగురుల్లో పొద్దు గాటారింది.

సంతల్లితోపుల్లో సీకటి వొడిచింది. పికిలి పిట్ట పల్లకుంది. సిలక అక్క ముడుసుకుంది. సుక్క గూడెక్కింది. మట్టుగుడిసెలో దివ్వెలిగింది—ఏడకే, ఏవేళకే సినదాన—

సేతి గాజులు సిటిలె — సెంపకందిపోయె— సెంగావ దూమెరుగు లేదు. నూపుల్లో నిగారం లేదు — ఎవరెబిడ్డా నీవు.

వినవాడు కొలరాసినాడా—కానివోడు కంటజూసినాడా—నీవరాలు యాగమూలు గాయె. కూతురా, ఎందమ్మా నీ యాతన— కన్నతల్లి యిసంబెట్టెనా—కన్నతండ్రి కొడుకమ్ముజూపెనా—కూనా, మణుసులన్న యిసుగెసి, బతుకన్న యిసమేసి, కాలికి బలపం గట్టుకొని, ఏటిపాయలో లోతుమూసి ఒక్క గుమకు దుముకుదమని వచ్చినావా!— ఎందమ్మా కత?.

ఆఁ...కతే! అవ్వా, పకిసెం సెప్పినట్టు పలికినావ్. నన్ను కన్నామె సత్తెంగనే యిసం పెడతానన్నది—ఎందుకంటవా అయమ్మకు ఒకేలు యిడిసినోడు—తమ్ముడులాటోడు—తలకు మాసినోడు. వన్నెలాడు కుంట వన్నెపట.

పదికరుకులు నిలుసున్న పకాన బయాన యిచ్చేనే తాళికట్టేకట్టంగ సేపపిల్ల కొడుకులు ముట్టజెప్పుతనన్నడే—ఏం, తీపు దిగల్లిందా! నిన్ను ఆడికిచ్చిట్టా మానసంటే—మానినంది, మా యమ్మ—సయ్యాన మాయమ్మ.

కొడుకులు దన్నంగ గద్దలుదన్నంగ పల్లే పాడూ దుమ్ముల్లెరిగిన బతుకు ఆడిది. మణుసుల్లో మణిసి కాడు. వరుల్లో వరుడు కాడు. పడీడిన తలెత్తుకు తిరగలేడు. సాక్కెడు కాడు, జోడు కాడు. ఆడు—నాకేల నే అంటిని, మాయమ్మ ససేమిరా—అనె.

నీమాట మార్చుకో—అని గడ్డముంటి బతిమిలాడినా—ఒసేఁగిడీ నీబుద్ధి మార్చుకో అని ఘొల్లు సేసింది—యిసమన్నా తాగను కాని అందుకొల్లనంటిని. అట్టనే తాగమంది. గన్నేరు పసరుదీసి యిచ్చింది. కాని నోట పట్టలేక పోతిని. (గండసేదు—యిసం—అమ్మా కూసంత పక్కరట్టుకు రాయే అంటిని. పకొలు మసె. సాగబోతూ పక్కర కావాలా అని, మాడున మొట్టె—బతుకో పాడోతీయంగ గడిసిపాయె—అట్టనే కన్ను మూయనీ అంటిని— పక్కరకు పైసా ఏడదె అని మా అవ్వ మోరాయించె—మా అయ్య నడిగినా—ఎందుకనె —అందుకంటిని.

అప్పుడెంత రగడాయె—ఆ మణిసి మాయమ్మ కొప్పసిగ అంకించుకొనె—ఏమే అబిసీ, నా బిడ్డను అంత కొరసాకగ చేర మిచ్చి నావంటే— నాకూన పదికొసులేనా పలికెది,—అని లెక్కసి కొసుకో తాపిచ్చె, మాయమ్మ కుయ్యోమనంగా కూలేసి,— సన్నిదున్నకుని పోయె.

ఏడకు?—ఆ మేష కొడికి—ఏమేషంటావా—ఓ ముసిలి జలపాలాయన మక్కలిరిగిన అంబో తల్లె లోగిలి కంబాని కొనుకుని యికిలిస్తూ కూకుని ఉంటడే—అద్దది—ఆ మేడః ఆ చింబోతు మా అయ్యకు ఎరికే నంటవా— కాదు — ఫుంతలో, నాకో దెబ్బ మొగమోడు తగిలినాడు—మా అయ్య వోలకం నూసి—ఏంది కథ ఎంగుకట్ట పడుసును గుజాతివ్ నీకేం గావలె యీ గుజ్జా అంటూ మాట కలిపినడు.

మా అయ్య మాతబిగింపు మీదుండడు. ఆడు మాటసేసుకోంగనే పోరా చేప్పి, అన్నట్టు తలిసిరినాడు—కాని, ఫువాడు పాయ సేతికివ్వంగనే. సప్పడినాడు.

కూటికి నూకలేవు — నూకలికి రూకలేవు. మరి బగవంతుడు సెప్పినవ్వాళ్ళా బతికాలి గందె! పంతకుబోతుండ—నన్నడు మా అయ్య.

పరువో—

సేతనే ఉందిగా—

నికొర్నా—

కాక — మరెందను కొంటవ్. రొన్న గాచిన సెయ్యి—

మాగ బేసమా.

సొంతసామే — కట్టుకున్నదాని కడుపు సుట్టింది—యింత లెక్క సేపి, యేపుసేసనా—

ఆటనే – ఆటా నే–కూతురికి కూడెట్టి, సెడి అమ్ముకుంటుండ వన్న మాట—

అసెంకూత, మడిసి, సేత గాని సెటి వర దనుబోతడు గాని, –మన కమామీషు నీ కెరి కలే–పైసా రొయేసి పరక గుంజుకు నే మొగోడి వరొయ్యేవ్–ఏమనుకుంటుండవో.

ఓరి నీ యాలికడుపున కవలపిల్లలుట్ట!–సెయ్ దిరిగిన వోనవే–సరి, సెప్పేదో మాట!

నీ వుచ్చుకుంటవా—

నాకుండ తోంబ సాలకవా – కలిసొస్తే నేనూ ఓ రెండురాళ్లు సేసుకుందమని – సెప్పొద్దూ మన్లోమాట–నాకీ యాపారంలో ఒగువూ బిగువూ తమూం దెలుసు. సీసలైన ఖామంద్ కొడకు తోడకపోతా–నీవు చూప్ నుండు, పైసా పైసా నేం జూసుకుంట...

—ఇట్టా. ఆ మడుసులిద్దరూ కూసబలుక్కాని, నన్ను కొంచుపోయిన్రు: అకడ అజాలపాలోడు, ఎగజూసి దిగజూసి జబ్బపటి సూసి, సెంపలు పింసనూసి–యికలించినాడు: అట్లా అట్లా నాకు యినుకోరాకుండ గుసగుసలోయి రూకలు ఎన్నుకుండరు. అవ్వా, గొడ్డు నమ్ముకున్నట్టు బిడ్డ నమ్ముకున్నడు– మా అయ్య–పొస్తే కడుపులో మంట కొనరానిమంటగదా– యింక ముప్పొద్దులూ నా పేరు జెప్పుకుని ఉసకునిలో సునుకుని యేడీ యెన్నవా దింటరు. వెనంగుకన్లే – పోతూ పోతూ, మా అయ్య, నా మొగం కేసి సూసెరా దా!–యెలుండవని సెప్ప రాదా–విన్నో నీడకు సేర్సిన – ఆమడిసిని నమ్ముకుని సల్లంగ బతకమని అనరాదా–ఉహుం–అవలాన్నే, మడిసినా మాకునా, అని కుమిలిపోయిన.

కాని, అవ్వా–ఆజాలపొలాయన – మణిసి కాదు–దేవుడు: నేనట్టా గుసుగు – గుసుగు మంటూ కూలిపోంగా, ఆ అయ్య, నా కాడ కొచ్చి, మీద సెయ్యేసి, యెక్కెక్కి నవ్వినడు – బిడ్డా అన్నడు – బగవంతుడు మమ్మల్ని ఒంటి రెక్క పచ్చుల్ని చేసినడు. నటింట తోటికట్టలా – సేతిబిడ్డ సెత్తలా యిటానే ముగ్గురు బిడ్డల్నిచ్చుకున్న– కాని, నీడ మంచంగనే సెయ్యా బువ్వా వంటపట్టంగనే – బిడ్డలకు పుట్టరాని బుద్ధులుటుకొచ్చినయ్ – సేతి కందిం దట్టుకొని, ఎగిరిపోయిన్రు. ఆ బతుకులకంటే ప్రాపతం అనుకుండ యిప్పటికి ఏకీ సాలాయె–యింక మాకీ గంతరబింతర కూడనుకున్న–కాని బిడ్డా–నేనూరకున్నా దైవం ఊరకుండలా– నిన్నిచ్చినాడే – అన్నడవ్వా –

యింటేవిగంద – నన్ను కన్నోడు–బిడ్డా అని, ఒతుకున్నంత లెక్క పిలవాల్సినోడు–అమ్ముకుంటడా, ముక్కు మొకం ఎరగని మడిసి–బిడ్డా అంటడా–ఏం దవ్వా యీ యిసిత్రం–నాకు మతోయింది–కలకల్లాడిపోయిన – ఆ అయ్యపాదా లట్టుకున్న అయ్యా, పుట్టిబుద్దెరిగినాక, మాఅయ్యట్టా పిలవలా, మా అమ్మట్టా పిలవలా, ఆకలే అమ్మా, అని గొంతు నించుకుంటె మాయమ్మ మూకుడులో, ఎండు మెతుకులురాల్చి నిద దట్టిపాకతే అని మొత్తేది–నాకు ఏడుపొస్తే, మా అయ్య నడుమిరగదన్నే వోడు: కూడులేక ఎట్టా బతుకుతానయ్యా–దగమో సెంది–ఆయమ్మ, నాయమ్మ నడుకొక్కని తినేదాన్ని–అంటుకూ మా అయ్యకు రోస ముటుకొచ్చె–తాను మారాజంట నేనడుక్కుదింటే తనకు తలొంపులంట–గుంజకు కట్టి పడేసిండు–అయ్య పెట్టాడాయె–అడుక్కు తినద్దంటడాయె–నీలుదాగి బతికినానయ్యా...

అని గోడు సెప్పుకుంటూ గోలెట్టిన: ఆ అయ్య కన్నుదడసి గావురుమన్నడు. అవ్వా ఆకడ మారాజుబిడ్డల్లే బతికిన. కడుపు నిండకూడాయె, కంటినిండ నిదరాయె– బంతిపువ్వల్లె ఏపుదేలినా–

కాని, అవ్వా, నూరులేని, నుట్టుగుడిసెలో పుట్టి, నీడలేని బతుకు బతికిన నిప్పచ్చరం దాన్ని నాకా మేలు సక్కంగా – ఆ అయ్య, అతల్లి తీరమూడబోయినోరు – తిరిగి లోగిలి సేరుకోలేదు పెద్దేటిలో, మునక వేయంగనే గండుమీనేసుకుపోయిందట. సింకపాతను నేను మిగిలిన – మరిగత్తె, నాకు కూడేది, నీడేది—

సుట్టపోళ్లంట – లోగిలి కమ్ముకున్నరు – అసెంపాపమో అవ్వా, ముసలోడు–ముతకోడు, నన్ను సూసీ సూడంగనే యికిలింపులుగావు యికయికలుగావు – నిదరోదమని, ఓమూల పండుకుంటె – పరుపురాలిన కూత గూసిరి–సేయి అంకించుకుని – ధూత్తేరీ అంటిని–తన్ని తగిలేసిరి–ఏడకుబోయేది.

> ఒకడు: 'ఏమ్ ! – ఏమిటా మ్మాయి వంక అలాచూస్తావ్!'
>
> అతడు: 'అది నా కళ్ల నుగు బదర్ !'
>
> ఈ మాట విని గూబ చెల్లు మనిపించాడు మొదటివాడు.
>
> అతడు: 'ఏమ్–ఎందుకయ్యా అలా కొడతావ్.'
>
> ఒకడు: 'అది నా చేతినుగు బదర్ !'
>
> ఇది విని వెంటనే అతడు నల్ల కళ్ళజోడు పెట్టుకున్నాడు. ఆకొట్టినవాడు చేతులు పాంటు జేబుల్లో దాచుకున్నాడు.

ఎండనుబడి ఎండిన–ఎవడికొడు ఎగా దిగ సూసేవోడే–సీకటిలో దాక్కున్న–బిగిలూడేవోడు–తానా కీస్సుపోయె–అవ్వా, రేతిరంత ఒక్క నరకం అనుకో–నటుడిపిలో రగసెం తావే సింగం సివ్వంగి మెరుగవ్వా– బస్తీలో నరమానవుడికన్న అవి పాపజాతి కావవ్వా–పొద్దొడవంగనే – అయ్యను తోడుకొచ్చి, నన్నప్పగించిరి–మళ్లీ పాటు మొదలాయె–మా అయ్య నన్నెడకో గుంజుకపోతుండే–అమ్ముకుతిందమని–నా బతుకింతే గంద అనుకుంట – అయ్యా. ఆమారాజు కొడ రూకలుచ్చుకుంటివే–నీ సొత్తు అరికిస్తివే – మళ్లీ ఎటా అమ్ముకుంటవయ్యా–అంటిని–మా అయ్య సాచి ఒకటుచ్చుకున్నడు–నీకిది దగమం కాదయ్యా అంటిని – రెండుచ్చుకున్నడు – సుక్క మిగున్న దేమో మడిసి తూగుతున్నడు: నా మొగాన తుబుక్కు మన్నడు. అవ్వా, నాకూ రగం వచ్చె–అజీవాన్నొక్క తోపుదోసిన–కూలిపోయిండు–పరుగుచ్చుకున్న

అవ్వా–కన్నవోడు అమ్ముకుంటడా – బిడ్డా అని సేరదీసిన మారాజు నీటగలిసి పోతడా–యింక ఆడకూతురు ఎట్టా బతకాలి. లోతు సూసుకుందమనుకున్నా–మూడు మునకలేస్తే ముప్పు సెలిపోతుంది గద–ఏమంటవు—...

—ఒసి కూనా, బతకమంటనే–నరమానవుడంటె–ఎవడే, ఆడకూతురి కడుపున పుట్టినోడే,–మనం ఎత్తి పెంచినోడే–జోల పాడితే నిదురోయేవాడే. బిడ్డా – మనం సాకిన గొర్రెపొటేలును కొమ్ముల్ దిరిగి దూకుడు సేసే—ఎగిరిపోతానూ—సెటుంపలేటి మేపిన పుంజు, కొక్కొరాయిగా తన్నబోతే సెదిరిపోతమా–ఎన్నిముక్కు పుడుక్కు, సెత్తడిసే బుద్ధి – సెంపలేసుకుని సేయెత్తి మొక్కితే దాని గుణం మారుతుందా – సెప్పున కొట్టాలే గాని – నరంలేని నరమానవుడూ అంతే మంచికిబోయి–మా అయ్యవురా అంటే అమ్ముకుదింటడు – మనసోయిందిరా – సక్కనోడా అంటే – కాళ్ల కాడ కూతే సిగపాయ ఒడిసిపట్టుకుంటడు

నిన్ను నమ్ముకుంటిరో అంటే – లోకువ జేసి బూతుకూత కూస్తడు–నీ సిత్తమంటే సేయి సురుతడు మనం కన్నుమంటే సేయె సలాం గొడతడు – పోరా బచ్చా అంటే – బేగం సాహెబా అంటడు – బద్మాష్ అంటే సెబాస్ అంటడు–అదీ వాడి పుటక – ఆ వాడి బుద్ధి – కూనా – ఆడకూతురికి–ఓ కండ్లెన్నెలుండాలి, ఒకంట కత్తులుండాలి గొంతులో కోయిలుండాలి, కోరలుండాలి – ఒక సేత పువ్వుపొట్లం – ఒక సేత నూరినకారం–అట్ట బతకాలి–గుబుల్ దప్పి నరమానవుడు–మనకుకులామే; మాలిక్ కానా – ఫకర్ నయ్ – యిది యాదుంచు బతుకు.

అందరకుమాహృదయపూర్వక
సంక్రాంతి శుభాకాంక్షలు

శ్రీ కీర్తిగాంచిన ప్రేక్షకులతో
విజయవంతముగా నడుచుచున్న

పద్మశ్రీ వారి
శ్రీవెంకటేశ్వర
మహాత్మ్యం
సావిత్రి_రామారావు
దర్శకుడు:
P. పుల్లయ్య, B.A.

రాబోవు చిత్రాలు

R.R. పిక్చర్సు
?
B. సరోజాదేవి
N.T. రామారావు
దర్శకుడు:
V.N. రెడ్డి

సంగీతా వారి
మామకుతగ్గ
అల్లుడు
సావిత్రి_రేలంగి
దర్శకుడు:
వేదాంతం రాఘవయ్య

పద్మినీ పిక్చర్సు
పిల్లలుతెచ్చిన
చల్లనిరాజ్యం
దర్శకుడు:
B.R. పంతులు

లలితకళా
నికేతన్ వారి
భక్త
జయదేవ
అంజలి_నాగేశ్వర్రావు
దర్శకుడు:
రామారావు
B.A.

విజయ
ప్రొడక్షన్సు వారి
?
దర్శకుడు:
K.V. రెడ్డి, B.Sc. (HONS)

రాబోవు హిందీచిత్రాలు

A.V.M. వారి
బర్షా
నందా_జగదీప్
దర్శకుడు:
కృష్ణన్_పంజ్

రామన్ ప్రొడక్షన్స్
జ్వాల
పంచరంగుల చిత్రం
మధుబాల, సునిల్‌దత్
దర్శకుడు:
M.V. రామన్

చంద్ర మూవీస్
బహురూప్యా
వైజయంతిమాల
రాజ్‌కపూర
దర్శకుడు:
నందలాల్‌జసవంతలాల్

నేపాకమల్ పిక్చర్సు
ఏక్‌తారాజా
ఏక్‌తారాణీ
నర్గీస్_కిషోర్‌కుమార్
దర్శకుడు:
M.L. ఆనంద్

జగపతిపిక్చర్సు ప్రొడక్షన్ నెం. 1., రాయలసీమకు

S.V. RAO

విజయపిక్చర్సు., విజయవాడ, గుంతకల్లు.

# కలియుగవైకుంఠం తిరుపతి

## దేవస్థానం చేస్తున్న ప్రజాహిత కార్యాల సమీక్ష

సి. అన్నారావు
(దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు)

శ్రీ తిరుమల పర్వత పాదంవద్ద ఒకటిన్నర చదరపు మైళ్ళ విస్తీర్ణంతో విరాజిల్లుతున్నది శ్రీ దివ్య తిరుపతి క్షేత్రం. ఈ కొండలకు తిరుపతి పట్టణం ఈశాన్యదిశగా ఉన్నది. శ్రీ విష్ణుభక్తులకు నూటఎనిమిది తిరుపతి క్షేత్రములున్నట్లు చెబుతారు. కాని తిరుపతి అనే పేరుచేతనే వెంకటాచలము నధిష్ఠించిన శ్రీ వేంకటేశ్వరుడు స్ఫురించి ఆ క్షేత్రాలన్నిటిలోకి ఇది ప్రధానమని తోచకపోదు.

తిరుమలకు వేంకటాచలమని కూడా పేరు. ఈ కొండపైనగల స్వామిపుష్కరిణి అనే ప్రాచీనమైన సరోవరం దక్షిణపు ప్రక్కన గల గట్టుపై భగవంతుడు శ్రీ వేంకటేశ్వరుడై వెలసినాడు. తానై వెలసిన భగవానునికి ఇక్ష్వాకు శ్రీ తొండమాన్ చక్రవర్తి ఒక ఆలయం కూడా కట్టించాడు. ఆనాడు భక్తులకు యాత్రికులకు ఇది కేంద్రమైనది. ఈ దేవాలయమునుగూర్చిన మొట్టమొదటి ప్రస్తావన మనకు క్రీస్తుపూర్వము నాల్గవశతాబ్దము నాటి 'తొల్కాప్పియం' అనే తమిళ వ్యాకరణ గ్రంథంలో కనిపిస్తుంది.

పన్నిద్దరాళ్వార్లలో పదుగురు దేవుని మహిమను, దేవాలయమును ఆ పరిసరములను కీర్తించియున్నారు. నాదముని మొదలుగా వైష్ణవాచార్యులనేకమంది తిరుమలపై ఈ దేవుని నిత్యార్చనలో పాల్గొన్నవారే. నాదముని మనుమలలో ఒకడైన తిరుమలనంబి—తిరుమలపై శ్రీ వేంకటేశ్వరుని నిత్య పూజారాధనలు చేయుటకే తనజీవితము అంకితముచేసినవాడు. శ్రీ రామానుజాచార్యుడు తను పొందిన అయిదు మంత్రోపదేశములలో ఒకటి తిరుమలనంబివద్ద తిరుమల కొండపైననే పొందాడు. తిరుమలనంబికి రామానుజాచార్యుడు మేనల్లుడు. శ్రీ రామానుజాచార్యుడు—శ్రీ వైష్ణవ మతాధికారి అయినపిదప సంప్రదాయ ప్రకారము యథాపూర్వముగ ఆలయములో వేంకటేశ్వరునికి అర్చనాదికములు జరిపే ఏర్పాటు చేసినాడు. నేటిదాకా అదే పద్ధతిని స్వామివారికి నిత్యార్చన జరుగుతున్నది.

చాలా కాలంగా తిరుమల దేవాలయం మహారాజుల పోషణలో ఉన్నట్లు అనేక శాసనాధారాలవల్ల తెలుస్తూనే ఉన్నది. క్రీ॥శ॥ 818 లో పల్లవ సామ్రాట్టు శ్రీ విజయదేవ విక్రముని మొదలు 1540-60 లో శ్రీ సదాశివరాయలవరకు మహారాజుల పోషణకు సంబంధించిన శాసనములు చాలా ఉన్నాయి. వీటిలో ఇటీవలిది మరియొకటి ఉన్నది. మాతలి తిరువేంగడనాథుని కుమారుడైన మాతలి కుమార అనంతరాయల కైంకర్యములు స్వామికి చాలా ఉన్నాయి. కాగా మైసూరు ([illegible]) మున్నగు సంస్థానపాలకులు స్వామివారికి విశేషంగా కైంకర్యం చేసినవారే. నేటికీ ఆ పాలకుల కైంకర్యం స్వామికి జరుగుతూనే ఉన్నది.

### దేవస్థానం పుట్టుక

తరువాత ముసల్మానుల, ఆంగ్లేయుల పాలన రావటంతో కొండలోని అన్ని దేవ



← దిగువ తిరుపతిలో గోవిందరాజ స్వామి ఆలయం.



→ శ్రీ వేంకటేశ్వరాలయ ప్రధాన ద్వార గోపురం.





తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఆర్ట్సు కాలేజి.

# ★ కలియుగ వైకుంఠం ★

స్థానాల ఆయవ్యయాల, నిర్వహణల బాధ్యతతోపాటు తిరుపతి విషయంలోకూడా పెద్ద మార్పు వచ్చింది. ఈ దేవాలయం పాలక వ్యవహారాలపై వారి అజమాయిషీ వచ్చింది. క్రీ॥ శ॥ 1889 లో ఈస్టుఇండియా కంపెనీ ఆధ్వర్యం క్రిందికి క్రైస్తవేతర మతసంస్థలన్నీ రాగా, శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థాన ఆదాయవ్యయాలపరిశీలనాబాధ్యతతో బాటు ఆ సిపాయిలుకూడా తిరుమలలోని హాథీరామ్‌జీ మఠం అధిపతి అజమాయిషీ క్రిందికి కొని రాబడినాయి. 1933 వరకు ఇలాగే జరిగిపోయింది. 1933 లో మద్రాసు శాసనసభవారు తిరుమల తిరుపతి దేవస్థానంపాలక వ్యవహారాల నిర్వహణకు ఒక కమిటీని కమీషనర్‌ని నియమించాలని నిర్ణయించారు. అలాగే మద్రాసు ప్రభుత్వం దేవస్థానం పాలనకు ఒకకమిటీని నియమించారు. 1951 లో మరొక చట్టం అమలులోనికి వచ్చింది. దీనితో దేవస్థానం మేనేజిమెంటు వ్యవహారాలన్నీ అయిదుగురు సభ్యులుగల 'ట్రస్టీల బోర్డు' క్రిందికి వచ్చినాయి. తరువాత ఒక సవరణ ప్రతిపాదనతో ట్రస్టీలసంఖ్య పదకొండుకు పెంచడం జరిగింది.

## కలౌ వేంకటనాయకః

ఒకవైపున వేంకటేశ్వరస్వామికి ఉదాత్తులైన రాజన్యుల కైంకర్యాలు అందుతూ ఉండగా మరోవైపునుంచి ఏడుకొండల వాడికి దేశం నలుమూలలనుంచి భక్త్యావేశంతో తరలివచ్చే యాత్రికులవల్ల మొక్కులూ ముడుపులూ చేరుతూనే ఉన్నాయి. ఆపన్నులై, ఖిన్నులైన సమయంలో ఏడుకొండలవాడు కటాక్షించిన రక్షణకు, ఉపశాంతికి, వరాలకు, వారి వారికి తోచిన పద్ధతిని యాత్రికులు మొక్కుబళ్లతో కానుకలు చదివించుకుంటారు. పూజక్రింద తృణమో పణమో ముట్ట చెబుతూ ఉంటారు. ఈనాడు రాజన్యులు లేరు. రాజులపోషణకూడా లేదు. కాగా నిరంతరం తిరునాళ్లుగా తరలివచ్చే ఈసామాన్యయాత్రికుల కానుకలే స్వామివారి ఆలయ పాలనకు ప్రధాన ఆధారం.

ఈవిధంగా ఆదాయం వృద్ధి అవుతూనే ఉన్నది. అన్ని కాలాలలోనూ యాత్రికులు ఒక్కతీరుగా వస్తూనే ఉంటారు.

## దేవస్థానం చేసినవి

ఈఆదాయంతోనే స్వామివారి దేవాలయానికి అనుబంధంగాఉన్న సంస్థలూ ఆలయాలూ అభివృద్ధిచెసి, మతసంప్రదాయ పరిమళం నలుదిక్కులకు కమ్ముకొనే ప్రయో



ఈ వ్యాసరచయిత
శ్రీ చెలికాని అన్నారావు.

జనకరమయిన సత్కార్యాలు చేయడానికి వీలవుతున్నది. యాత్రికులకు ఇతోధిక సౌకర్యాలు కల్పించడానికి, ఉత్సవాలూ, వేడుకలూ బాగా జరుపడానికి ఈ ఆదాయం వ్యయం చేయబడుతున్నది.

కొండపైకి యాత్రికులు ఎక్కివెళ్ళే మెట్ల ఎత్తుతగ్గించి, వంపులు చుట్టిరానవసరం లేకుండా మరమ్మతులు చేయబడినాయి. పగిలిపోయిన మెట్లస్థానే క్రొత్తగా మెట్లు కట్టడం జరిగింది. పవిత్రప్రదేశాలకు వెళ్లడానికి మార్గంలో గల అడ్డంకులను తొలగించారు.

యాత్రికులు నిరంతరం పయనించే మెట్లదారిని మురుగు పారుదల సౌకర్యాలు కలిగించారు. విశ్రాంతి గృహాలు నిర్మించారు. యాత్రికులభద్రతకు దారివెంట విద్యుద్దీపాలు కూడా అమర్చారు. అంతకంతకు పెరిగిపోతున్న యాత్రికుల సంఖ్యను గమనించి 'తిరుమల భవనాల' ప్రాంగణంలో నాలుగు లక్షల వ్యయంతో మరికొన్ని నివాస భవనాలు నిర్మించడానికి నిర్ణయం జరిగింది. యాత్రికులకు 1944 లో తిరుపతినుంచి తిరుమలకు వేసిన రోడ్డువల్ల అనతికాలంలో కొండలో విశేష వసతి యేర్పడింది. తిరుమలకు డ్రైనేజి పథకం అమలు జరిపేటందుకు ఆలోచన జరుగుతున్నది. తిరుమల - పాప వినాశనం వాటర్ వర్క్సు మూలాన మంచినీటి సౌకర్యం కొండమీద ఏర్పడింది. 1938 నుంచి దేవస్థానం జరిపిన కృషివల్ల మలేరియా ప్రమాదం తొలగిపోయింది.

దేవస్థానం ఆదాయం అనేక విధాల ఉపయుక్తమౌతున్నది. వికలాంగులకు, కుష్ఠురోగులకు ఆశ్రయగృహాలు ఏర్పాటు చేయడానికి, అనాథ శిశు సంరక్షణాలయానికి కూడా ఈ సొమ్ము వినియుక్తం అవుతోంది. యాత్రికుల ఉపయోగానికి సత్రాలు, దొడ్లు చావడులు ఏర్పాటు చేయడానికి నిధులు ఖర్చవుతున్నాయి.

## చూడదగిన ప్రదేశాలు

తిరుమలపై దేవాలయానికి ప్రక్కనే

‘స్వామి పుష్కరిణి’ అనే పెద్ద కోనేరు వున్నది. శ్రీ మహావిష్ణువు ‘శ్వేతవరాహ’ రూపంతో అవతరించి భూమిని ముల్లెలో పెట్టి రక్షించినట్లు పురాణగాథ.

“స్వామిపుష్కరిణి” కి పశ్చిమ దిశన గల ఆదివరాహస్వామి ఆలయంలో ‘శ్వేత వరాహమూర్తి’కి ప్రతిష్ఠ జరిగినట్లు చెబుతారు. శ్రీ వేంకటేశ్వరుని ఆలయము కన్నకూడా ఇది చాలా ప్రాచీనమైనదని విశ్వసింపబడుతున్నది.

మత ప్రాధాన్యం గల జలపాతాలు చాలా తిరుమలకొండపైన ఉన్నాయి. ప్రధానమైనది దేవాలయానికి ఉత్తరంగా మూడు మైళ్ళదూరంలో ఉన్న ‘పాపవినాశనం’ జలపాతం. ‘గోగర్భతీర్థం’ అనే మరో జలపాతం దేవాలయానికి మైలుదూరంలో ఉంది. ‘ఆకాశగంగ’-దేవాలయానికి రెండు మైళ్ళ ఉత్తరంగా ఉంది తగు అభిలాష, వ్యవధి, ఓపిక ఉంటే ఈ జలపాతాలు చూచి రాతగినవి. చూడముచ్చటయినవి.

## తిరుపతిలో

శ్రీ గోవిందరాజస్వామిదేవాలయము తిరుపతి రైల్వేస్టేషన్‌కు చేరువనే ఉన్నది. ఈ ఆలయగోపురం బ్రహ్మాండమైనది. శిఖరంలాగ ఎత్తుగా ఉండే యీ గోపురం సుదూరంనుంచి కూడా కనిపిస్తుంది. ఇక్కడి శ్రీ గోవిందరాజస్వామి విగ్రహం శ్రీ వైష్ణవమత ప్రవక్త శ్రీమాన్ రామానుజాచార్యులవారు ప్రతిష్ఠించినట్లు చెప్పుకుంటారు. కాగా ఈ దేవాలయంచుటూ పట్టణం నిర్మించడానికి వారు పథకంకూడా అయనే రచించారు. నేటి తిరుపతి పట్టణానికి ఆవిధంగా ఆనాడు ఆయనవల్ల నాంది ఏర్పడినట్లు జనవాడుక. గోవిందరాజస్వామివారి ఆలయంలోనే ఒకవైపున శ్రీ ఆండాళ్ దేవాలయం కూడా ఉన్నది. ఇది కూడా శ్రీ రామానుజుల ప్రతిష్ఠగానే విశ్వసింపబడుతున్నది. ఇవి కాక తిరుపతిలో అనేక యితర దేవాలయాలు కూడా ఉన్నాయి. మే, జూన్‌లలో జరిగే (వైశాఖమాసం) బ్రహ్మోత్సవాలు ఏటా శ్రీ గోవిందరాజస్వామి దేవాలయంలోనే జరుగుతాయి. ఇవి తొమ్మిది రోజులపాటు జరుపుతారు.

రైల్వే స్టేషన్‌కు అరమైలు దూరంలో ఊరి మధ్య శ్రీ కోదండరామస్వామి దేవాలయం ఉన్నది. ఇక్కడ గల శ్రీ రామచంద్రుడు ‘వరప్రసాదుడు’ గా పూజింపబడుతున్నాడు.

తిరుపతిలో గల దేవాలయాలలో శ్రీ కపిలేశ్వరస్వామి దేవాలయం ఒక్కటే శివునికి అంకితమైనది. ఇది తిరుపతి పట్టణానికి ఒకటిన్నర మైళ్ళ దూరంలో రమణీయమైన ‘కపిల తీర్థం’ అనే జలపాతంవద్ద వున్నది. దీనినే ‘ఆళ్వార్ తీర్థం’ అని కూడా భక్తులు పిలుచుకుంటారు. కారణం శ్రీ నమ్మాళ్వార్ ఆలయం అక్కడ వుండడమే.

## తిరుచానూరు

తిరుపతికి దక్షిణంగా మూడు మైళ్ళలో తిరుచానూరు వున్నది. పౌరాణిక గాథలనుబట్టి శ్రీ వేంకటేశ్వరుని అర్ధాంగి అయిన శ్రీ పద్మావతి అమ్మవారికి ఈ పుణ్యక్షేత్రం నిలయమని తెలియుచున్నది. ఇక్కడ గల ఒక కొలనిలో పద్మ ముఖంలో అమ్మవారు వెలసినట్లు చెబుతారు. అందువల్లనే టికీ అక్కడ గల కొలను పేరు ‘పద్మసరోవరము’ అంటారు. ఈ కొలనిగట్టుననే శ్రీ పద్మావతీ దేవాలయం ఉన్నది. నవంబర్, డిసెంబర్ నెలలలో ఇక్కడ జరిగే బ్రహ్మోత్సవాలలో తొమ్మిదవరోజున శ్రీ పద్మావతిఅమ్మవారి జన్మదినోత్సవం జరుపుతారు. ఆ వేడుకను “పంచమీతీర్థం” అనికూడా పిలుస్తారు.



తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం

## శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం

దేవస్థానం నెలకొల్పిన సంస్థలన్నిటిలోకి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయము ఉత్కృష్టమైనది. అత్యంత ప్రధానమైనది. 1939 లో దీనిస్థాపన జరిగింది. దశంలో సుప్రసిద్ధులైన పండితులు ఈ సంస్థలో పరిశ్రమించి సంస్కృతం, తెలుగు, తమిళ భాషలలో పరిశోధనలుచేసి ఇప్పటికి మొత్తం 50 పురాతనగ్రంథాలు ఉద్ధరించి ప్రకటించడం జరిగింది. ఇంకా అనేక ప్రాచీన గ్రంథాల ప్రచురణ సాగుతున్నది.

## అన్నమాచార్య ఉత్సవాలు

దేవస్థానం మత, సాంస్కృతిక రంగాలకు చేస్తున్న ప్రధానసేవ ప్రాచ్య పరిశోధనాలయంలో జరుగుతున్నది. దీనికి అనుబంధంగా ప్రముఖ ఆంధ్ర వాగ్గేయకార

తొమ్మిదిలక్షల రూపాయల ఖర్చుతో క్రొత్తగా నిర్మించిన తిరుపతిదేవస్థానం వారి [illegible]




Stanes
INSTANT
COFFEE
అరవై చెంచాలు
= అరవై కప్పులు


అహా ఎలాగా ఒక్కొక్క చెంచా
చొప్పున నిజమైన కాఫీ
ఒక కప్పు వేడి
నీళ్లలో కలిపి,
పంచదార, పాలుపోస్తే సరి!
చాలా చౌకమాత్రమే గాక,
రుచికరమైన 60 కప్పులు.
ది యునైటెడ్ కాఫీ సప్లై కం. లి., కోయంబత్తూరు
Stanes
స్వచ్ఛమైన కాఫీ ప్రతిచోట అమ్మబడును



శ్రీ వేంకటేశ్వర అనాథ శరణాలయం.

# ★ కలియుగ వైకుంఠం ★

డైన శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుని స్మృతి చిహ్నంగా "అన్నమాచార్య ఉత్సవాలు" ప్రతిఏటా దేవస్థానం నిర్వహిస్తున్నది. శ్రీ అన్నమాచార్యుని తెలుగు సంకీర్తనములను బహుళ ప్రచారంలోకి తీసుకురావడానికి యిది ఉపయుక్తం కాగలదు.

## శ్రీ వేంకటేశ్వర అనాథ శరణాలయం

విద్యా, మత, సాంస్కృతిక సంస్థలతో పాటు దేవస్థానం మరికొన్ని ధర్మసంస్థలు కూడా నిర్వహిస్తున్నది. కుష్ఠురోగుల ఆశ్రమం, అనాథ శిశుశరణాలయం, పాఠశాల ఈ సంస్థలలో ముఖ్యమయినవి.

అనాథ శిశుశరణాలయంలో నూటయాభై మంది బాలబాలికలకు ఆశ్రయం ఉన్నది. అనుబంధంగా ఒక ఎలిమెంటరీ పాఠశాల కూడా ఉన్నది. విద్యతోపాటు చేతిపనులలో కూడా వీరికి శిక్షణ గరపబడుతున్నది.

## శ్రీ వేంకటేశ్వర అనాథాశ్రమం

ఇందులో 200 మంది స్త్రీ, పురుష వికలాంగులకూ, కుష్ఠురోగులకూ ఆశ్రయం కల్పించబడింది. కుష్ఠు నిదానంలో ఆరితేరిన ఒక వైద్యప్రవీణుని పర్యవేక్షణలో ఈ సంస్థ నిర్వహించబడుతున్నది. ఈ సంస్థ తిరుపతికి తూర్పుగా మైలున్నర దూరంలోవున్న అక్కారాంపల్లిలో నెలకొల్పబడింది. ఇందుకు మంచి భవనాలు ఏర్పాటుచేశారు. అనుబంధంగా ఒక చికిత్సాలయమూ, ప్రార్థనా మందిరమూ ఉన్నాయి. తోటపని, నూలు వడకుట, చెప్పుల తయారీ, రామభజన వీటితో ఆర్తులు కాలం గడుపుతూ ఉంటారు.

## చంద్రగిరి

తిరుమల, తిరుపతి, తిరుచానూరు— వీటితోపాటు తిరుపతి చుట్టుప్రక్కల పుణ్య ప్రదేశాలు, చారిత్రిక స్థలాలు, చాలా ఉన్నాయి.

వీటిలో కల్లా అత్యంత ప్రసిద్ధి వహించినది ప్రాచీన రాజధానీ నగరం చంద్రగిరి. విజయనగర సామ్రాజ్యపు తుదిరోజులలో చంద్రగిరి ప్రాముఖ్యం వహించినది. విజయనగర సామ్రాజ్యపు కడపటి ప్రభువులు చంద్రగిరిని రాజధానిగా చేసుకుని పరిపాలించారు. 'చంద్రగిరి' అనే పర్వతం తిరుపతి కొండను ఆనుకుని ఉన్నది. ఈ ప్రాచీన నగరం ఆ కొండ చేరువన బహుసుందరంగా నిర్మించబడినది. ఈ నిర్మాణంలో ఎంతో వాస్తు కళాకౌశలం కనిపిస్తుంది. చంద్రగిరిలో 'మహల్' అని పిలువబడే ప్రాచీన దుర్గాలు రెండు ఉన్నాయి.

చంద్రగిరి దాపున అలమేలు మంగాపురమనే గ్రామం ఉన్నది. ఇక్కడ గల 'వేంకటేశ' ఆలయం శిథిలావస్థలో ఉన్నది. ఇక్కడనుంచి చంద్రగిరి మీదుగా తిరుమలకు ఒక అడ్డదారి ఉంది. ఈ దారి పొడవు మూడు మైళ్ళు.

పుత్తూరుకు చేరువన గల నారాయణవరంలో 'కళ్యాణ వేంకటేశ్వరు'ని ఆలయం ఉన్నది. ఇక్కడనే శ్రీ వేంకటేశ్వరుడు శ్రీ పద్మావతీ అమ్మవారిని పరిణయమాడినట్లు జనశ్రుతి.

## కాళహస్తి

కాళహస్తి తిరుపతికి సుమారు 25 మైళ్ళలోగల ప్రాచీన శివక్షేత్రము. తమిళ వాఙ్మయంలో ప్రసిద్ధుడైన 'కన్నప్పర్' అనే ప్రముఖ నాయనార్ ఇక్కడ తపస్సుచేసి ముక్తినందినట్లు పురాణ ఆధారాలు ఉన్నాయి. కాళహస్తిలో గల శ్రీ కాళహస్తీశ్వరుని దేవాలయము ఒక మహా నిర్మాణము. అద్భుతమైన శిల్పసంపద ఎంతో ఇక్కడ ఉన్నది.

తిరుత్తని శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి క్షేత్రముగా ప్రసిద్ధి చెందినది. అరుణగిరి మొదలయిన తమిళ యోగులు తిరుత్తని స్వామిని కీర్తించి కృతులు చెప్పారు. తిరుత్తని కొండ చుట్టూ పవిత్రమైన కొలనులు చాలా ఉన్నాయి. ★



తిరుపతికొండల మనోహర దృశ్యం

వాతావరణం హాయిగా, ప్రశాంతంగా ఉంది. దారికటూ ఇటూ చెట్లకొమ్మల మీంచి పక్షుల 'సుప్రభాత' సంగీతం వీనులవిందుగా వినవస్తోంది. ఎటుచూసినా పర్వతశ్రేణి స్వర్గానికి నిశ్రేణిలా కనిపిస్తోంది. ఎత్తయిన కొండలతో. లోతయిన లోయలతో పరమపదసోపానపటంలా ఉంది ప్రకృతి.

ఒక మార్వాడీ కుటుంబం ఆ ప్రశాంత ప్రభాతవేళ ఆ కొండల నిచ్చెన ఎక్కుతూ మెల్లగా సాగుతోంది. నిచ్చెన చివర భూలోక స్వర్గమనదగిన వేంకటాద్రిపై వెంచేసి ఉన్న ఏడుకొండలవాడిని సేవించుకోటానికి పోతోంది. మెట్లెక్కలేని వృద్ధులు, పిల్లలు డోలీలెక్కి పోతున్నారు. ఓపిక ఉన్న వాళ్లు భక్తి డోలికలెక్కి, జన్మ పరంపర లాంటి మెట్లెక్కుతూ, ఆయాసంతో నగరుస్తూ, గోవిందనామాలు పాడుతూ పోతున్నారు.

చిన్నా పెద్దా, ఆడా మగా, జనాభా చాలమందిఉన్న పెద్ద కుటుంబం అది. 'కుటుంబ పెద్ద' అందరికంటె ముందు నడుస్తున్నాడు. వారిలో తొమ్మిదేళ్ల బాలిక కూడా ఉంది. ఆ బాలిక మొక్కు నిమిత్తమే ఈ కుటుంబం తిరుపతి యాత్రకు బయలుదేరింది. ఆ పిల్ల ఒంటినిండా నగలు. కొన్ని వేల రూపాయల విలువచేసే జవాహిరీ. ఆమెకూడా ఒకడోలీలో కూర్చునిపోతోంది.

చాలా సేపటిదాకా ఆ బాలిక డోలీ అందరికీ మధ్యనే ఉంది. అందరూ ఆమెను జాగ్రత్తగా కనిపెట్టుకునే వస్తున్నారు. కాని ఎప్పుడో ఎక్కడో కొంచెం పరాకుగాఉన్న సమయాన ఆ డోలీ మెల్లమెల్లగా వెనకబడింది. త్వరగా పొమ్మని ఆ బాలికకూడా హెచ్చరించలేదు. చుట్టూ పరుచుకునిఉన్న సుందర దృశ్యాలు చూసి తనలో తనే ఆనందిస్తోందా పిల్ల. క్రమంగా డోలీ మిగతావారికి దూరమైంది.

డోలీలు మోసే బోయీలు సాధారణంగా అకార్యాలకు దిగరు. యాత్రికులకు బోయీలమీద నమ్మకం, బోయీలకు దేవుని మీద భయం ఉండటం మామూలే. కాని ఆనాడు అలా కాలం, కర్మం కలిసివచ్చింది. వెనకనుంచి యాత్రికు లెవరూ రావటం లేదు. ముందు కనుచూపుమేర దూరంలో ఎవరూ లేరు. అటూ ఇటూ మనుష్య సంచారం లేదు. తమ చేతుల్లో పిట్టలా చిక్కిన చిన్నపిల్ల. ఆ పిల్ల ఒంటినిండా విలలేని నగలు. శిథిల నిర్జన గృహంలోకి విష సర్పం జొరబడినట్లు, దుష్టాలోచన వా మనస్సులలోకి ప్రవేశించింది. డోలీని నెమ్మ దిగా పక్కదారి పట్టించారు. అదం కీకారణ్యం. ఒందా రెండువందల గజా లోపలికి తీసుకుపోయారు. అదే దా కాబోలని ఆ పిల్ల ముందు అరవలేదు. తీ అక్కడికి వచ్చినతరవాత అరిచినా ఎవ వినబడదు. బోయీలు తమ దురాలోచన ఆచరణలో పెట్టటానికి డోలీని నేల దిం బోతున్నారు. ఇంతలో హఠాత్తుగా ఒ విచిత్రం జరిగింది. వారికి కొద్దిదూరం నిలువెత్తున బ్రహ్మాండమైన క్రౌంచుపా తోకమీద నిలబడిఉన్నది. దాన్ని చూడగానే బోయీలు చావుకేకలాంటి గ కేకపెట్టి కాలి కొద్దీ పారిపోయారు. ఆ మూర్ఛపోయింది.

అక్కడ మార్వాడీ కుటుంబం తమ తప్పిపోయిందని గ్రహించకుండానే కొండకూడా ఎక్కి తిరుమల చేరుకున్నా తీరా లెక్కచూసుకునేసరికి పిల్లకనబడ



"పాపవినాశనం" తీర్థం. ఇక్కడికి ఈమధ్యనే చక్కటిరోడ్డు వేశారు.

# ★ ప్రత్యక్ష దైవం ★

వినకొలతమ్మా ఉంటారని మిగతా బోయీలు చెప్పారు. ఎదురు చూశారు. ఎంతకూ ఆ డోలీ రాలేదు. కొంతదూరం వెనక్కిపోయి వెతికారు. వారినీ వీరినీ అడిగారు. లాభం లేకపోయింది. అక్కణ్ణించి లబో దిబోమని గోల. ఒకమార్వాడీపిల్ల కనిపించటంలేదంటే నిపించటంలేదని తిరుమల అంతా ప్రాకిపోయింది. వెదకవలసిన చోట్లన్నీ వెదికారు. ప్రయోజనం లేకపోయింది. మార్వాడీ టుంబం ఆ రోజంతా నిద్రాహారాలు లేకుండా దుఃఖిస్తూ కూర్చున్నారు.

ఆ రాత్రిఅలాగడిచిపోయింది. మర్నాడు దయంకూడా గడిచిపోయింది. మధ్యాహ్నానికి ఎవరో తప్పిపోయిన పిల్ల తిరిగి వచ్చిందంటే వచ్చిందని వారూ వీరు చెప్పుకోటం ని దేవస్థానం కార్యాలయానికి వెళ్లారు. రికినది వారమ్మాయే. వంటిమీద ఒకన్న మెత్తు బంగారంకూడా పోకుండా పెట్టిన నగలు అలాగే ఉన్నాయి. ల్ల క్షేమంగా ఉన్నది.

ఎలా దొరికిందని అడగగా అధికారులు ప్పారు. ఈ పిల్ల దారిపక్క అడవిలో టరిగా కూర్చుని ఏడుస్తుండగా ఎవరో వ్యక్తుడు ఆ దారే పోతూ చూసి సుకువచ్చాడు. తన పేరూ, ఊరైనా చెప్పకుండా తక్షణమే వెళ్లిపోయాడట. ఆ వ్యక్తికి కృతజ్ఞత తెలుపుకుందామని మార్వాడీ కుటుంబం ఆరాటపడింది. ఆ వ్యక్తి ఎవరో ఎక్కడా కనిపించలేదు. ఎలా వచ్చాడో అలాగే వెళ్లిపోయాడు. ఆ త్రాచుపాము ఆ క్షణాన వచ్చి బాలికను ఎలారక్షించిందో ఆ అజ్ఞాత వ్యక్తికూడా అలాగే సమయానికి వచ్చి ఆమెను రక్షించాడు. ఆ మహాసర్పమూ, ఆ మహాపురుషుడూ ఒకరేనా? ఏమో? నిజం ఆ శ్రీనివాసునికే తెలుసు అనుకున్నారంతా.

ఇలాంటి అద్భుత సంఘటనలెన్నో! దిగువ తిరుపతిలో అడుగు పెట్టిన క్షణంనించి, ఎగువ తిరుపతికి వెళ్లి, స్వామిని సేవించుకుని, తీర్థాలలో గ్రుంకులిడి, మళ్ళీ కొండదిగి రైలెక్కి ఇంటికి చేరేవరకూ ప్రతి యాత్రికునికీ ఇలాంటి వింత కథలెన్ని విన్పిస్తాయో చెప్పలేము. కొందరికి స్వయముగా ఇలాంటి అనుభవాలు జరుగుతాయి. ఇతర్లకి జరుగుతూండగా కొందరు చూస్తారు. చూసినవాళ్లు చెబుతుండగా వింటారు. విన్నవాళ్ల దగ్గిర విన్నవాళ్లు చెబుతుంటగా వింటారు. విశ్వసించేవాడూ, విశ్వసించనివాడూ కూడా తిరుపతిలో అడుగు పెట్టిన క్షణం నుంచీ ఈ కథాసరిత్సాగరంలో మునిగి తేలక తప్పదు.

రకరకాల, రంగురంగుల కథలు. చిక్కులో ఉన్నప్పుడు దేవుడికి మొక్కుకుని, చిక్కులు పోగానే మొక్కుల సంగతి మరిచిపోయి, శిక్ష అనుభవించి పశ్చాత్తప్తులైనవారి కథలు; పిల్లలు లేనివారికి పిల్లలు కలిగిన కథలు; దరిద్రులకు ధనప్రాప్తి, రోగులకు ఆరోగ్యం కలిగిన కథలు; ఏడుకొండలవాడు డాక్టరుగా చికిత్సచేసిన కథలు; ప్లీడరుగా కేసులు వాదించిన కథలు; ఇలా ఎన్నో సంఘటనలు కలిసి ఆయనకు పిలిస్తే పలికే ప్రత్యక్ష దైవమని పేరుసంపాదించిపెట్టాయి.

ఏనాడో తొండమాన్ చక్రవర్తి శ్రీ వేంకటేశ్వరస్వామికి ఆలయనిర్మాణం చేశాడని చెబుతారు. నాటినించీ నేటివరకూ ఇన్ని వేల ఏళ్ళుగా, ఎందరో మహారాజులు, సామంతులు, మంత్రులు, కవులు, శిల్పులు, గాయకులు, చిత్రకారులు, భరతఖండంలోని మూలమూలలనుంచి ఏటేటా ఈ క్షేత్రం దర్శించి, భక్తితో పులకించి తరించారు. ఆంధ్ర చక్రవర్తి, కవిచక్రవర్తి అయిన శ్రీకృష్ణదేవరాయలు ఈ స్వామిని దర్శించి కైంకర్యం చేశాడు. భక్తుడు, వాగ్గేయకారుడు తాళ్లపాక అన్నమాచార్యులు తిరుపతిలోనే స్వామిసన్నిధినే జీవితం గడిపి, మధురమధుర భక్తిరస ప్లావితగీతాలు గానం చేశాడు.

"ఇంచుకైన వేంకటేశు గిరిశిఖరము
కొంచుకే కలుగవలెగాకా
అంచితంబైన నిత్యానంద పదవులను
మించి తిమ ఎదుట ప్రభవించిన వేళావా"

అని ఆయన కీర్తించారు.

కవిగాయక భక్తసార్వభౌముడు త్యాగరాజు స్వామిదర్శనంకోసం తహతహలాడిపోతూ "తెరతీయగరాదా?" అని స్వామికీ తనకు మధ్య అడ్డుగా ఉన్న తెర నెకొకుండా "నాలోని 'తిరుపతి వెంకటరమణ!' మత్సరము - తెరతీయగరాదా!" అని ప్రార్థించాడు. "ఏనోముఫలమో - నీనామామృతపానము అను సోపానము దొరకెను" అని తన్మయుడై గానం చేశాడు. ఎందరోమహానుభావులిలా వేంకటరమణుని ప్రత్యక్ష దైవంగా ఉపాసించి ముక్తి సాధించారు.

"అదివో అల్లదివో హరివాసము
పదివేల శేషుల పడగల మయము!
అది వేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిల మునులకు
నదె చూడుడదె మ్రొక్కు డానంద
మయము"

(అన్నమయ్య)






భర్తతో మూణ్ణిద్రలైనతర్వాత ఇందిర అత్తవారింటికి ప్రయాణమైంది.

బండి దిగి ఇంట్లోకి వెళ్ళబోయేముందు ముత్తయిదువులంతా వారిని గడపదగ్గరే నిలవేశారు.

ఆమె అత్తగారు శేషమ్మ 'ఎర్రనీళ్లు' తీయించి వారిని యింట్లోకి రమ్మంది.

సిగ్గుతో తల వంచుకొని కుడిపాదం గడప దాటించబోయింది యిందిర. కాని మాలతి వారి దారిని కట్టేసింది. శేషమ్మకు కోపము వచ్చింది.

"ఏమిటే మాలతీ...చాలించు నీ కోతి చేష్టలు" అందామె.

"పోవే! నీకు తెలీదు." నవ్వుతూ బదులు చెప్పింది మాలతి. ముత్తయిదువుల కిది ముచ్చటగా తోచింది.

"పోనీలెండి! మరదలమ్మ ఏదో ముచ్చట పడుతోందంటే మందలిస్తారేమిటి? దంపతులను పేర్లు చెప్పించండి," అందామె విప్పారిన ముఖంతో.

'బలే! గడుసుదానివే నీవు-ఊఁ కానీ! అడిగేదేదో త్వరగా అడిగేసేయమ్మా. అందో పెద్ద ముత్తయిదువ.

'చెప్పనాయినా... నేనూ...నా ఇందిరా వచ్చాము..."అందొకామె

మాలతి అడ్డం వచ్చింది

'ముందు మా అన్నయ్యేం? పాపం! అమ్మగారొచ్చారనీకదూ! ముందు ఒదినే చెప్పాలి! తెలుసా! ఆఁ "అధికారికంగా పలికింది మాలతి.

ముత్తయిదువలంతా కన్నె ముత్తయిదువలో కలిసిపోయారు. పాపం! ఇందిర ఆ సమయములో ఏమనుకుంటున్నదో ఎవ్వరికీ పట్టలేదు—జగన్నాథం ముసిముసి నవ్వులు మాత్రం మానలేదు.

ఇందిరకీ విధంగా యింట్లోకి పోలేక, వీధిలో ఉండటము బాధగా ఉంది. ఎన్ని చదువులు చదివితేనేం? పాతపద్ధతుల లాగే సాగుతుంటాయనుకుంది. సంప్రదాయాలంటే అంతేనని తల ఒగ్గింది. కాని నడివీధిలో భర్త చేయిపట్టుకొని నిలవటమేమీ బాగున్నట్లు తోచలేదామెకు. చెల్లెలికి చెప్పి యిదంతా చేయించుకుంటున్నాడేమో నని కూడా అనుమానము కల్గిందామెకు భర్తమీద. తన అబలత్వము ఇన్నాళ్లకు బయటపడినట్లయిందామెకు.

"ఎవ్వరూ నోరు కదపకపోతే వదులుతాననుకున్నారేమో! ఆ పప్పు లేమీ ఉడకవు తెలుసా! ఊఁ!! చెప్పాదినా..." శాసించింది మాలతి

"చెప్పండర్రా...ఎవరు ముందు చెబితేనేం." అన్నది శేషమ్మ...

"ఆఁ... నేనూ ఇం..."అని చెప్పేంతలోనే మాలతి అడ్డు తగిలింది.

"నువ్వారుకో అన్నాయ్...ఎందుకు చెప్పనో చూద్దాం," బెట్టుగా అంది మాలతి. జగన్నాథం చెప్పినా, చెప్పకున్నా తానే ముందుగా పేరు చెప్పేదామనుకుంది యిందిర. కాని మాలతి మాటల ధోరణి మనసులో పౌరుషం పెంచింది. ఆమె నోరు కదపలేదు. మాలతివైపు కొరకొర చూడసాగింది.

"అబ్బ! ఏం చిత్రమ్మర్రా! ఉత్తరాలే రాసుకోగాలేంది యిప్పుడీ పేర్లు చెప్పటానికి ఏం బిడియపడతారర్రా నాయనా! అంతా బూటకాలం కాలంకొద్దీ" అంది మూతిముడుస్తూ ముసలామె ఒకతె. ఇందిరా జగన్నాథుల కొక్కటే నిర్ణయము వచ్చింది. ముసలామె మాటే నిజమనిపించింది. చెప్పేద్దామనుకున్నారు. ఒకరి మొగ మొకరు చూచుకున్నారు.

# ★ పందిరిమంచం

వీరిద్దరినీ చూడసాగింది పరీక్షగా మాలతి-అన్న తనమాట నిలబెట్టాలన్న ఆశతో.

ముత్తయిదుల ముద్దుట దంపతుల మౌనం వల్ల విచ్చిపోసాగింది. గమనించాడు జగన్నాథం. నవ్వుతూ, "ఇందిరా నేను వచ్చాను.." కొంచెము సిగ్గు సిగ్గుగా చెప్పాడు.

మాలతి వైపు ధీమాగా చూడసాగింది ఇందిర. ఇంతలో శేషమ్మ "ఆ! ఇందిరా ఇంక నీవూ కాని" అన్నది.

క్షణం మౌనం అనంతరము ఇందిరకూడ భర్తపేరు చెప్పింది.

"నీలో నీవే చెప్పుకుంటే?...బాగా వినపడాలి..." మాలతి హుంకరించింది.

"ఆ పోదూ! నీదో గోల. నాకంతా వినపడిందిలే. అడ్డుతోలుకు" గట్టిగా అన్నది శేషమ్మ.

మాలతి చేయి లాగి జగన్నాథం వెళ్ళసాగాడు పాపం, మాలతి ఒక్కతై పోయింది అందరిలోనూ...

* * *

"ప్రయాణపు బడలికతో ఫలహారాలూ ఆలస్యమే. భోజనమూ ఆలస్యమే...త్వరగా తలుపులు సర్దమ్మా ఇందిరా... వెళ్ళి కాస్త నడుం వాలుద్దాము..." అంది శేషమ్మ... ఇందిర ఇంటి తలుపులవీ సర్ది గ్లాసుల్లో పాలు పోసుకు హాలులోకి వచ్చేలోగా అత్తా కొడుకుల మాటలు వినవచ్చినై. పాపం! అత్తగారు జగన్నాథానికి చేసే బోధ యేమిటో, ఇందిర కంతు చిక్కలేదు. హాలులోకి ప్రవేశించలేకపోయి అట్లాగే తలుపుదగ్గర నించుంది.

"అలాగంటే ఎలారా! నీ వక్కడే పడుకోవాలి..."

"ఊహూ! నేనక్కడ పడుకోను ... నువ్వేమైనా చెప్పు".

"ఈ కాలపుసంచే యింతి ఇద్దరూ ఒకే పక్కలో పడుకోవాలంటే ఛెట్టుచేస్తా వేమిరా, ఆడపిల్లలాగా..."

"నేను పడుకోను...పడుకోను. అంతే."

"ఏం !"

"ఆ మంచం పూరికే కదిలిపోతుంది..."

ఇందిరకు నవ్వు రాసాగింది. అత్తా కొడుకుల సంభాషణ ఆమెకు కుతూహలం కలిగించింది.

"అది మన వంశములో అనాది నుండి వచ్చే మంచంరా! కలసొచ్చిన మంచమురా! మీ నాన్నా, మీ నాన్నగారి నాన్నా, అందరికీ తల్పమైందిరా యిది రిపేరీకూడా చేయించాను.

"మంచిపనే చేశావులే! ఏమైనా సరే నే పడుకోను."

"మాడూ! బాబువికదూ! జేబులుపిడ 'ఫాను' పెట్టించాను అక్కడే..."

"అబ్బబ్బ"

"పోనిలే! కాస్త ఆ గదైనా చూడు గానిరా! చూశాక నీ యిష్టంవచ్చినట్లే చేద్దాం"

జగన్నాథం అమ్మమాట కాదనలేక గదిలోకి నడుస్తూ వెళ్ళాడు ... ఇందిర కూడా తలుపు వేసి తాళాలు ఇవ్వబోయింది శేషమ్మకు. శేషమ్మ వాటిని తీసుకొని ఏదో సైగచేసి వెళ్ళింది. జగన్నాథం ఆ గదిలో మూలనున్న పాతబీరువా వైపు తదేకంగా చూస్తుండగా గది తలుపు మూసేశారెవరో!

తల్లి మోసం చేసినందుకు చిన్న నవ్వుతో సర్దుకున్నాడు. నోరు తడుపుకున్నాడు "చూడు ఇందిరా! ఇక్కడ నేను పడుకోను" అన్నాడు.

"ఎందుకూ!" అడిగింది ఇందిర.

"ముందిక్కడనుండి వెళ్దాం. ఆ తర్వాత చెబుతాను..." బరువుగా చెప్పాడు జగన్నాథం...

"తలుపూ?" అతని ముఖంవైపు చూస్తూ అంది ఇందిర.

"ఈ గదిలోంచి బయటకుండే ఆ తలుపు తీసి... డాబామీదికిపోదాం..." అన్నాడు.

చప్పుడు కాకుండా అనుసరించింది జగన్నాథాన్ని యిందిర. కాని ఆమె మనసు మాత్రం చురుకుగా ఏదో ఆలోచింపసాగింది. జగన్నాథం పద్ధతి ఆమెకేమీ బోధపడలేదు. అత్తయ్యమాటనిలా త్రోసిరిస్తే తెల్లారితే ఆమె యేమనుకుంటుందో నన్న ఆలోచన ఆమెకు కల్గక పోలేదు. జగన్నాథం మాత్రం నిర్భయంగా వెళ్ళిపోవడం చూస్తే ఆమెకు కంగారు నణచుకోవడం సులభం కాలేక పోయింది. పగలు కనిన ఆశల ఉత్సాహమంతా పోయిందామెకు. చదువుకున్న అన్నలూ, తమ్ముళ్లూ ఆమెకూ ఉన్నా, జగన్నాథంలా ఎవ్వరూ ప్రవర్తించలేదు!

డాబాపైన గుమ్మ ధూళి వాసనలొక వైపు...నడి ఆకాశంనుండి కురిసే వెన్నెల జాలు, ఇంకో వైపు...

తెచ్చిన చిన్న బెడ్ పరిచింది. జగన్నాథం బరువుగా శరీరాన్ని వాల్చాడు. ఏం చేయలేక చందమామకేసి చూస్తూ నిలబడింది ఇందిర. ప్రక్కన ఇందిర ఉన్న విషయమే మరచిపోయి గాఢమైన ఆలోచనలో పడిపోయాడు జగన్నాథం. కదిలే మబ్బుల లోకి చూస్తూ ఉండిపోయాడు.

"ఏమిటండీ...మీరు...ఇక్కడేం బాగుందనీ వెన్నెల కోసమేనా" అడిగింది.

# ★ పందిరిమంచం ★

రాలో, ఎన్ని పత్రాలో తెచ్చేవాడు. వాడు గాలిపటానికి తోక కడితే దానికి గాలిలో ప్రాణం వచ్చేది. ఎందరో ఆడుకోటానికి వచ్చేవారు. బొంగరాల పందెం వేసేవాళ్ళము. కాని అందరికీ అన్నయ్యే పెద్ద. అందరి ఆటలు చూసేవాడే కాని తాను పోద్దూ ఆడేవాడు కాదు. ఎవరి బొంగరమైనా నేలమీద తిరగలేక ఎగిరెగిరి చిందులు చిందితే దాని ములుకును రాయితో కొట్టి, నేలపై రాచి 'కల్లీగా' చేసేవాడు — ఏమిటేమిటో చెప్పుతున్నాను మా పూరిభాషలో. నీకర్థం అవుతున్నదో లేదో! చెప్పుతూంటే ఏదో బరువు దింపుకున్నట్లవుతుంది." ఆమె జవాబుకోసం ఆగకుండా సాగించాడు కథను. "ఆ రోజులన్నీ యిప్పుడు కనుల ముందు కన్పడుతున్నాయి. వెన్నెల రాత్రులలో 'దొంగాట' ఆడితే ఎంత బాగుండేదో! నిద్రపోవటానికి రమ్మని పిలిచేవారు అమ్మా నాన్నా వాళ్ళు. పిల్లలు భూదేవి ఒడిలో, ఆకాశపు నీడలో ఆడుకోటం పెద్దలకెందుకో ఇష్టమయ్యేది కాదు. వాళ్ళను మింగాలన్నంత కోపం వచ్చేది నాకు. కాని అన్నయ్య నా నోరు మూసేవాడు.

మేము మోటారాట ఆడితే వాడెప్పుడూ పోలీసే.

"అదేమాటండీ" ఇందిర అమాయకంగా ప్రశ్నించింది.

'అదో పిచ్చాట. ఎంత బావుండేదని. జొన్నదంట్లు పొడుగాటివి ఏరుకొచ్చేవాళ్ళం. వాటి చివరలు బెత్తెడు పైగా కాలిచి వంచేవాళ్ళం. దానిని నేలమీద ఆన్చి పెట్టి, ఇంకో చివర పట్టుకొని పరుగెత్తేవాళ్ళం. ఒక్కొక్క దంటు ఒక్కొక్క బస్సు, ఒక్కొక్క బస్సుకొక్కొక్క 'డ్రైవరు'; ఫస్టు బస్సు, సెకండు బస్సు, తర్డు బస్సు, ఇట్లాగే పేర్లు పెట్టేవాళ్ళము — ఏ బస్సు జోరుగా...రయ్యిమని...స్పీడుగా పోతుందో...ఎవరి బస్సు ఎంత ముందోస్తుందో...ఎవరెవరు ఎవరెవరిని ఓడగొట్టారో...అని అనుకుంటూ ఆడేవాళ్ళము.

ఆటకు మేమే కాదు ఆనందించేది. పాపం ఏం చేస్తున్నారో — సుబ్బాయి, నాగభూషణం, లత, సరోజ, వకుళా వచ్చి చూచి చప్పట్లు కొట్టేవారు. వాళ్ళొస్తే మా అందరికీ పౌరుషంగా ఉండేది. నాతిటు సరోజ, ఎదిరింటి వెంకటేశంతటు లత, సాయిబుగారి ముదార్ తెట్టు వకుళా...నుండేది. పాపం — వకుళ నా జట్టుకు రావాలనేది ... కాని సరోజ వాళ్ళతోటిప్ప ఇంకే జట్టులో ఉండేది కాదు. "మావాళ్ళ బస్సు ముందోస్తుంది. చూడట్రా" అని వాళ్ళలో వాళ్ళకే పందేలుండేవి. ఏమిటో, ఆ రోజులు—

కాని మా అన్నయ్యతో చిక్కుగా ఉండేది. నాలుగు దార్లు కలిసేచోట నరసింహంగారింటి దగ్గర నిలబడేవాడు. మేము పందెం పరుగుతో వస్తుంటే 'స్టాప్' అని నిలిపేవాడు. నా ముందుండే వాడు బలే ఛాన్సుగా వెళ్ళిపోయేవాడు. ఈవిధంగా ట్రాఫిక్ కంట్రోలు చేసేవాడు. 'ఓవరులోడు చేశావేం?' అనేవాడు. 'ఏదో సార్...లాస్టు బస్. పాపం! ఒక్కతే ఆడామె... దయతలంచండి...కాఫీ తాగుదాం రాండి...' అనేవాళ్ళము. అన్నయ్య 'సరే' అనేవాడు పోలీసు ధీమాతో.

నేను పోలీసయి అన్నయ్యలాగా చేద్దామనుకునేవాణ్ణి. కాని వాడెప్పుడూ ఆటకు వచ్చేవాడే కాదు. మెత్తగా తప్పించుకొనేవాడు. "అమ్మతో చెప్పనులే" అని అన్నా వినేవాడు కాదు. అప్పట్లో అమ్మ అంటే అన్నయ్యకెంత భయం. తల్లిలేని పిల్లాడు భూమికే భారమౌతాడంటారు. అదేమి చిత్రమో అన్నయ్యంటే అమ్మకు నా అంత ఇష్టం ఎందుకు లేదో ఆరోజుల్లో నాకు తెలిసేది కాదు. నన్ను అమ్మ బాగా చూస్తుందనే బాధేమో. నన్ను ఎన్నడూ బజారుకు పంపేది కాదు. చక్కెర కూపను తేవడానికొకరోజు అన్నయ్య వెళ్ళి రాత్రి ఏడుగంటల కొచ్చాడు. నాన్న ఆరోజు ఎంతో కొట్టాడు.

అన్నయ్య ఎన్ని పనులో చేసేవాడు. వాడి కంచం వాడే కడుగుకొనేవాడు. చదువుకునే సమయానికి అమ్మ ఏవేవో పనులు చెప్పేది. ఊరికే ఆడుకోడానికి వస్తే గాడిదా, చదువులేదూ సంధ్యా లేదూ...నిన్నింకా పసిపిల్లాడివా, అనేది. అన్నయ్య ఇంట్లోకి వెళ్ళేవాడు. ఇంట్లో అన్నయ్య ఒక్కరోజు కూడా అలగలేదు. అయినా అన్నయ్య కప్పుడప్పుడూ దెబ్బలు పడేవి.

ఒకరోజు మా యింట్లో ఎవరిదో తద్దినం వచ్చింది. నాన్నగారు కూరలకని బజారు కెళ్లారు. నా చదన్నాలు పెట్టారు. ఆ రోజు బడికి ...బోలు — ఆ! ఆదివారము కాబట్టి ఆడ... బాగా ప్రొద్దుపోతుందనీ సుబ్బునీ, లతనీ, వకుళనూ, వెంకట్రావ్నీ, వాడి చెల్లెలినీ పిలుచుకొచ్చాను. వాళ్ళంతా నావెంటనే 'జల్సా'గా వచ్చారు. అన్నయ్యను కూడా రమ్మన్నాం. కాని వాడు రానన్నాడు.

"వాళ్ళంతా వచ్చారు...నీవూ రావాలి...తెలుసా" అన్నాను. "వద్దు, అమ్మ అరుస్తుంది..." అన్నాడు. "అమ్మ మడిలో ఉందిగా...రా. ఫరవాలేదులే"...అని చేయి పట్టుకున్నాను "మీరు పొండిరా ... నేను

# పందిరి మంచం

...కనుక్కోవాలి" అన్నాను. "అయితే నువ్వు రావూ! సరేలే! అస్తమానమూ, దగ్గుతున్నావని అమ్మకు చెప్పుతానుండు..." అని బెదిరించాను "జగ్గూ, పూర్ణకో-చెప్పొద్దనన్నానే" అన్నాడు బాధగా. "ఓహో అలా దారికి రావాలి తెలుసా" అని గంతులేశాను. నాతోపాటి పిల్లలంతా వచ్చారు.

"ఏమిరా! నాకేదో భయంగా వుంది. నాన్న తిన్నడూ..." అన్నాడు అన్నయ్య.

"ఆ! నీకప్పుడంతే. నువ్వూరుకో, ఎవ్వరూ తిన్నరులే!" అన్నాను.

"అయితే పోలీసుగా మాత్రం నే నుంటాను తెలుసా" అన్నాడు. 'అబ్బే! ఇది ఇది ఆటకాగు మంబస్సుకి డ్రయివరు, కండక్టరూ కావాలి. నువ్వు డ్రయివరు కావాలి—" అన్నాను. 'వద్దు నువ్వే డ్రయివరుగా వుండు... నేనే కండక్టరుగా ఉంటాను..." అన్నాడు.

కాగితాలు తుంచాం. టికెట్లు బుక్ చేశాం. 'ఆ! ఎవరయా! రండి. పోతోంది బస్సు. కడపా, మైదుకూరు, బద్వేల్... బద్వేల్-ఆ! ఎవరగూ. నెల్లూర్-నెల్లూర్.. బుచ్చి..." అని కేకలు వేయసాగాడు మా క్లీనరూ బ్రోకరూ అయిన సుబ్బాయి. వచ్చీరాని తురకంలో మాటలు ప్రారంభించాం...అన్నయ్య కండక్టర్.

"చల్ రే. టైం హోగయి" అన్నాడు-విజిల్ వేస్తూ.

ఇంతకూ బస్సు 'స్టార్టు' కాలేదు. అసలు మా బస్సేదనుకున్నావు క్రింద గదిలో వుండే, పందిరి మంచమే. దానిలో పిల్లలని కూర్చోబెట్టాం. ఒక చివర నేనుకూర్చొని సందర్భ్రఫేములోనుండి కాళ్లు క్రిందికి చాపి నేల మీద మోపి మంచాన్ని ఊపుతూండడమే బస్సు పోవటం.

బస్సు స్టార్టు కాలేదని కండక్టర్ని పిలిచాను. "అరే! కండెటర్..జరా హాండిల్ మారో.." అన్నాను. అట్లే చేశాడు వాడు. నోటికి సౌండిచ్చిండి. 'బుర్ ......" గుక్క త్రిప్పుకోకుండా అంటూ చేతులు అటూయిటూ తిప్పుతూ.. స్టీరింగు వీలున్నట్లుగా, బ్రేకులున్నట్లుగా చేతులూ కాళ్లూ కదిలిస్తూ, డ్రయివు చేయసాగాను. మంచాన్ని బాగా ఊపాను. కిస్ కిస్ మనే శబ్దం చేసిందది. అత "ఫాం 'పాం' అని హారను పలికేది. దానికి కండక్టర్ 'ఓల్డాన్' అనేవాడు-మళ్లా రైట్ అనేవాడు.

ఎప్పుడైనా ఓల్డాన్ అంటే నేను కోపంగా—నిజంగా కోపంకాగు ఉట్టిట్టి కోపంలో—"క్యాబా ఓల్డాన్-ఓల్డాన్...హాంకు టైం నై.." అని అరిచేవాడిని..

"అరె ఎట్లా బ్బా! పాసింజర్ హై. క్యాత —ఆ! చల్ రైట్" అనే వాడు. "క్యా రైట్. ఇంకా బజ్వేలుకూడా రాలేదు తెలుసా.." అని "బుర్ ..."అని నోటితో మోటారు పోనిచ్చేవాడిని."

అ ఆట బాగా ఆడుకున్నాం. దారిలో హోటళ్లు పెట్టినట్లు మేము తినటానికి ఆగినట్లు ఆగేవాళ్లం. బస్సు చెడిపోయినట్లు గా దిగి మంచంకింద పండుకొని రిపేరు చేసే వాళ్లం— "బస్సు పోవుంటే మా గుడ్డు ఇవ్వండి" అనేది కమల" "ఇదిగో. అయిపోయింది అమ్మగారూ" అనేసి ఫుల్లా బస్ పోనిచ్చేవాళ్లం.

"అలా ఆనందలోకాలలో తిరిగాం..."

జగన్నాథం కళ్ళలో నీళ్లునిండినా, హృదయంమాత్రం గతానుభూతుల మాధుర్యం లోనించి తిరిగి రాలేకపోయింది.

"తర్వాత ఏమైంది" అంది యిందిర ఆవేగంతో.

"ఇదో వస్తున్నా... అలా ఆడే మాకు ఆనందంలో ఉత్సాహం పొంగి, బలంగా తోపసాగాం బస్సుని. ఇంతలో మా మోటారు నిజంగా పెద్దగా అరిచింది 'పట్'మని.' నా "బుర్ ..." శబ్దం చాలించాను - అందరం వెంటవెంటనే దిగాం.

బస్సు వాలిపోయింది. ఒక ప్రక్క కోడు సుసి విరిగిపోయింది. బస్సులోని జనమంతా ఇళ్ళకు వెళ్ళారు. మాలతి అమ్మకు చెపుతుందని అన్నయ్య భయపడ్డాడు... "ఎట్లా!" అన్నాడు నా వైపేచూచి 'అవునింకెట్లా!' అన్నాను. నేనే వుపాయం చెప్పాను. "మంచానికి లేనకత్తి కోడు తగిలించిపెట్టి వెళ్దాం. ఎవరైనా వచ్చి కూచుంటారు. అప్పుడు వాళ్ళమీదికొస్తుంది" అన్నాను. అన్నయ్య పలకనలేదు...

"అమ్మకు తెలుస్తుంది గా" అన్నాడు. ఇంతలోనే అమ్మకూడా వచ్చేసింది. అమ్మ వెంబడే మాలతి కూడా వుంది. చాడీలమాస్టరే అది.

అగుస్తూ అమ్మ రాగానే నాకేదో బాధ అనిపించింది. కాని నేనే విరగ్గొట్టానని మాత్రం చెప్పలేదు. అన్నయ్య నా మీద చెపుతాడనుకున్నాను. కాని అమ్మ "మొద్దూ. తినంగానే సరా! బుద్ధి ఉండక్కరలేదా." అని ఏవేవో అరిచినా నాడేమీ పలకకుండా నేలమీదకే చూస్తూ నిలబడ్డాడు. ఈ గలభాకి నాన్న కూడా వచ్చారు. అమ్మ అన్నయ్యకి బాగా బుద్ధిచెప్పలేదని, నాన్న చెయిజేసుకొని వాణ్ని బాగా కొట్టాడు. 'పలుకుతాడేమో చూడు! బుద్ధావతారంలాగా.' అంది అమ్మ. కాని అన్నయ్య ఏడుస్తోంటే నాకు పేగులన్నీ కలిచినట్లుగా ఉండింది. 'చెప్పరా వెధవా. ఎలా విరగ్గొట్టావు. చెప్పు.' గద్దించాడు నాన్న వాణ్ని బాదుతూ. "నాకు తెలీదు నాన్నా." ఏడుపుతో ఆగి ఆగి అన్నాడు, ఎక్కిళ్ళవేగానికి తల ఆడిస్తూ. "వెధవా. మళ్ళీ అబద్ధాలే. జాగ్రత్త. డొక్క చీరేస్తాను." నాన్న మళ్ళీ తిరిగి చూడకుండా ఇంకో మడిగట్టుకోడానికి వెళ్ళారు అమ్మ గుర్రుమని నాత్తట్టు చూచి వెళ్ళిపోయింది. నేను అక్కడే వున్నాను.

వారంతా పోగానే అన్నయ్య ఆ మంచం కోటికి దగ్గరగా వాలిపోయాడు. ఏడుపు నాపుకోడానికి ఎంతో ప్రయత్నించాడు. కాని నా గుండె లెండిపోయాయి ఇదంతా చూస్తుంటే. అన్నయ్య చెంపలుమాత్రం నాకళ్లకు బాగా కన్పడుతూంటే నాకు కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. అల్లరి నాదైనా ఫుల్లరి అన్నయ్యదైంది. అమ్మానాన్నలను తన్నాలనుకున్నానప్పుడు. ఇంట్లోనుంచి అలిగి పోదామనుకున్నాను. వాడిదగ్గరకు పోయాను.

"అన్నయ్యా మాడవూ! ఇదో నేను! నాతో పలకవూ...ఇంతేనదూ"అని బతిమిలాడాను. ఇంకా గట్టిగా కోడును కరుచుకున్నాడు. గడ్డాన్ని పట్టి నాపక్కకు త్రిప్పబోయాను. వాడింకా ముడుచుకుపోయాడు. అన్నయ్య ఏడుపు మానించాలని ఎంత ప్రయత్నించానో అనాడు. ఇంత చేసినందుకు అన్నయ్య నాతో మాట్లాడడేమోనని నేనిరాశ నాకు క్షణక్షణానికీ ఎక్కువ కాసాగింది. 'అన్నయ్యా, నా పాపం ఉండవూ... ఇంకెప్పుడూ నువ్వు రావొద్దులే ఆటకు... ఈవూరునుంచి మీ అమ్మమ్మదగ్గరికిపోదాంలే. అక్కడే బాగా ఆడుకోవచ్చు" అని ఏదేదో చెప్పాను. కాని అన్నయ్య నాకు జవాబేమీ చెప్పలేదు.

అమ్మయిచ్చిన పాయసం నాకు తాగబుద్ధి కాలేదు. ఆరోజు అన్నానికి అన్నయ్యరాలేదని యెవ్వరూ అడగలేదు. గారె అప్పచ్చి నాకిస్తేనోది దాచి తీసి అన్నయ్యకిస్తే వాడు తీసుకోలేదు. నాకు ఏమీ తోచలేదు. పరాజను తీసుకొస్తే పలుకుతాడని వెళ్లాను.

రాత్రి అన్నయ్య ముందుగానే అన్నం తిని వెళ్లాడట. చదువుకుంటూంటే నేను వెళ్లి కూర్చున్నాను. నన్ను అన్నయ్య ఏమీ పలకరించలేదు. అన్నయ్యతో మాట్లాడడానికి నాకు నోరు రాలేదు. పాలు త్రాగి పొమ్మని అమ్మ పిలిచిన కేక అన్నయ్యనుండి దూరంగా వచ్చేట్టుచేసింది నన్ను.

తెల్లవారాక అన్నయ్య బడికి పోలేదు. మళ్లా అన్నయ్య బడకే పోలేదు. మూడురోజులదాక అన్నయ్యకు అన్నం పెటకూడదన్నారు. ఆతర్వాత డాక్టరు వచ్చాడు. ఏదో పాడుజరమట అది. వాడెప్పుడూ కలవరించేవాడు. వాళ్ళ అమ్మమ్మని పిలిపించారు. కాని వాడికి నూట ఆరుండిల జరం. ఎవరు పిలిచినా పలికేవాడుకాదు. అన్నయ్యనుపిలవాలని నేను వెళ్ళేవాడిని. అమ్మ నన్ను అక్కడికి వెడితే కొడతానంది."

# ★ పందిరిమంచం ★

జగన్నాథం కెబురుమాల ఆతని శోకానికి ముద్దగట్టసాగింది. అతని గొంతులో ఏదో అగాధమైన బాధ మూలగసాగింది. ఇందిర కేవలము తన్నుతనను మరచిపోయి వింటున్నది. భావనూహించటానికామెమనసు తహతహలాడింది. ఆ సోదరుల చిన్ననాటిరోజులలో ఎంత సౌహార్దముందో ఇంకా అని ఆశగా వినడానికి చూచింది.

"మోటార్...చెడిపోయి...ఇరిగి...పోయిందా....నే....ను....కొ....ను...బుర్......" అని కలవరించే అన్నయ్యను వదలి ప్రైవేటుమాష్టరు దగ్గర కెలాపోయేది? అమ్మ అంతే తాళగలనా అని బెదిరేవాడిని. మాష్టారు దగ్గరున్నా మనసంతా అన్నయ్య దగ్గిరే ఉండేది.

అమ్మ అన్నం తినేప్పుడు అన్నయ్యదగ్గర కూర్చోటానికి వెళ్ళేవాడిని.

అన్నయ్యా, చూడూ...నాతో మాటాడవూ...దీనంగా, మెల్లగా, ఇంకెవరికి వినపడనంతగా చెవులో అనే వాడిని. వాడు కదిలేవాడేకాని కళ్లు తెరిచేవాడు కాదు. అవును ఏలా పలుకుతాడు అలాంటి అన్నయ్య నాలాంటి కొంటె కోణంగితో" జగన్నాథం బాధ నెలా తొలగించాలో తెలియక తికమకపడసాగింది ఇందిర. తన భర్త పసిపిల్లాడికంటే పసివాడైపోయాడా! ఇంత మెత్తనిగుండె ఉన్నదా యితనికని ఆశ్చర్యమో, ఆనందమో, సానుభూతో ఆమెను కదలించింది.

చందమామను కప్పిన మబ్బులు కదిలినవి. అసమించడానికి చంద్రుని కింకొ ఝాము కంటే ఎక్కువ వ్యవధి లేదు.

జగన్నాథానికి ఇందిరపై చూపే లేదు. ఇందిరచూపు ఆయన ముఖమ్మీదే. ఆయన దృష్టిమాత్రం బయటికి ప్రసరించడంలేదు. లోకంలో వున్నవానిలో ఏవీ ఆ కళ్ళకు పొడగట్టడమే లేదు. ఆ చూపు శయనించే దిశయే వేరైంది. ఆతడు చెప్పుకుంటూ పోతున్నాడు.

"అన్నయ్యకూ 15 రోజులయినా జరం తగ్గలేదు. అయిసు తెచ్చి నెత్తిమీద పెట్టారు. ఆ రోజుల్లో నాన్న సెలవపెట్టి యింటిలో వుండేవాడు. పాపం వాళ్ల అమ్మమ్మ అన్నమే తినేదకాదు.

పదిహేడోరోజు తెల్లవారింది. డాక్టరు నూది కూడా వేశాడు. అన్నయ్య మూలగనయినా లేదు. అన్నయ్య కలవరింతలు కొంచెం తగ్గాయి. కొద్దిగా కళ్లు తెరిచాడు. అమ్మ యిచ్చిన అణా దాచిపెట్టి అన్నయ్యకిచ్చాను.

"నాతో మాట్లాడవూ..." అన్నాను. నాతశే చూచాడు వాడు. చేతిలో ఎంత పెట్టానో తీసి చూచుకోలేదు.

మధ్యాహ్నం మళ్లా అన్నయ్య కలవరించాడు." మంచం...మో...టార్...ర్..." హీనంగా మూలుగుతుండేవాడు.

ఆ సాయంకాలము అన్నయ్యను కింద పండబెట్టి యేడ్చారు. వాళ్ల అమ్మమ్మ అన్నయ్యమీద వాలిపోయింది.

జవాను నన్నెక్కడికో ఎత్తుకుపోయాడు. మొండివాళ్ళు...జగన్నాథం గొంతు బొంగురుపోయింది. తడిలేనిపోరులో తారట్లాడే మాటలన్నీ వణికిపోయాయి. కళ్లలో అతని ఆవేశమంతా ఆకారం దాల్చి ప్రవహించింది.

ఇందిరకూడ భర్తకు శ్రుతికలిపింది. జగన్నాథం అట్లాగే విలపిస్తూ మిగిలాడు.

"ఏమండి...వూరుకోండి పాపం -జరిగిపోయిందానికి..." అనునయంగా చెప్పబోయింది ఇందిర.

"నన్నాపకు ఇందూ...నా హృదయాన్ని అడ్డగించకు. ఈ ఏడుపు పొంగిపోర్లనీ. ఈ హృదయాన్ని యీ లోకానికి తెప్పించకు; ఆ రోజులలోనే ఉండిపోనీ. అలాగే ఏడుస్తూంటాను. నాలాంటి వానికదేశాస్తి... నేనారోజుల్లో ఎంతధూర్తుణ్ని. అన్నయ్యెంత మంచివాడు. అలాంటి అన్నయ్య ఎక్కడైనా దొరుకుతాడు! నాకోసం ఆటలకు వచ్చే అన్నయ్య, నాకోసం దెబ్బలుతినే అన్నయ్య. నన్ను ఏమీ అనని అన్నయ్య...ఏడీ! నేనెందుకూ ఇంకా! పాడుపురుక నాది. అన్నయ్యకోసం ఒక్కరోజయినా దెబ్బలు తిననేలేదు. అన్నయ్యా...అన్నయ్యా...! ఎంత మంచివాడివి నువ్వు. నాకు నువ్వేకావాలి. లోకంలో ధనమూ, పదవీ, ప్రేమా, గౌరవమూ నాకేమీవద్దు, నీతో ఆడుకుంటా నన్నయ్యా...నీకు దెబ్బలు పడనియ్యనులే. ఈసారి నేనే దెబ్బలుతింటాను...నేనే ఏడుస్తాను..."

తలగడలో తలదూర్చాడు జగన్నాథం. ఇందిర కామెభర్తగా తోచలేదు. ఆయనకు పట్టిన ఎక్కిళ్ళు ఆమెను ఘడియకొక గాయంలాగా తగిలేవి. నిశ్చేష్టయై నీలాల నింగిలోకి చూస్తూ ఉండిపోయింది.

నూతనదంపతులకా శరద్రాత్రిలో రాత్రి మాత్రము సాగిపోయింది. మరలా యిలాంటి రాత్రి వారి జీవితంలోనే రాలేదు. అమృతప్లావితమైన జీవితంలో నిత్యనూతన యౌవనోత్సాహము జ్యోత్స్నాస్నాతులై, పూలజల్లుల విరిసినట్లుండగా కాలాన్ని కట్టేసే ప్రయత్నము వారిలో మూర్తి దాల్చి వారి ప్రణయం ఏకాకృతిని పొందబోయేస్థితి మాత్రం వారిదైంది తర్వాత.

* * *

ఏళ్లు సాగేకొద్దీ ప్రకృతి అందరికీ కనువిప్పుగా పనిచేస్తుంది ..జీవితపు లోతులను అందజేస్తుంది. ఋతువులవలె మానవ జీవితాలుంటాయని నిరూపస్తుంది. కాలము నేమాత్రవారుని క్రోధానికి కలిసి మెలిసి బ్రతికజీవులు చెట్టుకొకరుగా పుట్టకొకరుగా చెదిరిపోతూండటము, వాని మోదానికి నీ, నా, భేదములేకుండా అంతా కమ్మగా కలిసిపోవడమూ; అన్నీ చెప్తుంది ప్రకృతి.

మాలతిపెళ్లికి బంధువులంతా కలిశారు. దగ్గరిచుట్టాలు, ఆత్మీయులు మాత్రము వెళ్లిపోలేదు. జగన్నాథం బలవంతాన ప్రయాణము ఆపుకొంది చంద్ర. ఆమె కిద్దరు కొడుకులూ, ఒకపిల్లా. కొడుకుకు జగన్నాథం నాన్నపేరే పెట్టారు రాఘవరావు అని. ఇంకొకడి పేరు కనకకిశోర్. ఆడపిల్ల కోమలవల్లి. జీవితానుభవంలో శేషమ్మకు తన తప్పిదాలు దిద్దుకోగల ప్రశాంతత అలవడింది. సంసారంలో ఆమె ఏ జోక్యమూ చేసుకోదు. అంతా ఇందిర పెత్తనమే. శేషమ్మ కోర్కె ప్రకారము జగన్నాథం వాళ్ల పెద్దక్కయ్యకు బెనారసు చీర తెచ్చాడు. చేతులకు క్రొత్తగా గాజులు కూడా చేయించిపెట్టాడు—పిల్లలందరికీ మంచిబట్టలు కుట్టించాడు. ఇల్లంతా పిల్లలతో కళకళ లాడుతున్నది.

పిల్లలకూ అల్లరికీ దగ్గర బాంధవ్యమే. ఆ రోజు ఆదివారము. అందరూ చేసే అల్లరి ఒక ఎత్తు. జగన్నాథంకొడుకు సింహాద్రి చేసే అల్లరి ఇంకో ఎత్తు. శేషమ్మగారాబం దాని బాసట.

పిల్లలగోలకు తాళలేక జగన్నాథం

(82 వ పేజీ చూడండి)

ఒకాయన తన మిత్రుడితో ఇలా అన్నాడు "ఆ పోతున్న లాయరుగారు మా బాగా వాదిస్తారు."

"ఆహా అలాగునా! అయితే మన కేసు కాస్తా ఆయనకే ఇద్దాం."

"ఆయన వాదనా ప్రభావం కోర్టులో సున్నానోయ్. ఎటొచ్చీ మనం ఇచ్చే ఫీజు దగ్గరే ఆయన వాదన."

యస్. కృష్ణకుమార్

అనగా అనగా ఒకానొక కాలంలో బెల్లంకొండ అనే గ్రామంలో వీరయ్య, వీరమ్మ అనే దంపతులుండేవారు. వారికి రెండెకరాల పొలం వుంటే దానిని దున్నుకొని బతికేవారు. వారికి లేక లేక ఒక కొడుకు పుట్టాడు. వాడికి రాముడు అని పేరు పెట్టుకొని అల్లారుముద్దుగా పెంచుతున్నారు. తరువాత రాముడికి ఒక చెల్లెలు పుట్టింది. ఆ చెల్లెలు పేరు అనూరాధ. అనూరాధ పుట్టీ పుట్టటంతోనే తల్లి తండ్రి గతించారు. చెల్లెల్ని పెంచే భారం కాకుండా పొలంపని అంతా రాముడిపైన పడింది. తల్లి తండ్రి లేని పిల్ల అని రాముడు చెల్లెల్ని గారాబంగా పెంచాడు. అనూరాధ ఎంతకాలం పిల్లగా వుంటుంది? యుక్తవయస్సు రాగానే అనూరాధ పెళ్లి వైభవంగా జరిగింది. రాముడుకూడా ఓ మంచి చుక్కను చూచి పెళ్లాడడు. అటు రాముడి కాపురం, ఇటు అనూరాధ కాపురం బాగా నేసాగుతోంది గాని, రాముడి భార్యకు అనూరాధంటే యిష్టం లేదు.

అనూరాధకు నలుగురు పిల్లలు పుట్టారు. ఒక సంవత్సరము ఆ వూరిలో కరువు వచ్చింది. ఎక్కడా వర్షమన్న మాటే లేదు. అనూరాధ భర్త నా తిప్పలు నేను పడతాగాని



"నువ్వూ నేనూ జత!"

ఫోటో: అమృతస్వరూప్, ఆగ్రా.



నీవు పుట్టింటికి పోయి సుఖంగా వుండమన్నాడు. అనూరాధ ఒప్పుకోలేదు. "మీరెక్కడుంటే నేనూ అక్కడే వుంటాను. తిండికోసం నేను పుట్టింటికి పోను" అని చెప్పింది. కాని అనూరాధను భర్త ఎట్లాగైతే నేమి ఒప్పించి యింటికి పంపేడు. అనూరాధ పుట్టింటికి బయలుదేరి వెళ్లింది. ఊరిముందర రాముడు పొలం దున్నుతున్నాడు. చెల్లెల్ని చూచి యింటికి పద నేనూ వస్తానని చెప్పేడు. అనూరాధ ఇంటికి వెళ్లింది. రాముడి భార్య అనూరాధను చూచి భోజనం పెట్టకూడదనుకుని ఆ కబుర్లు, ఈ కబుర్లు చెప్పి, "వదినా! పొయ్యి పిల్లి ఎత్తుకపోయిందే. ఎలా వంట చేయనూ?" అని అడిగింది. దానికి అనూరాధ "అట్లాగైతే నువ్వు బాధ పడటం దేనికి నేను మా యింటికి వెళ్ళిపోతానులే" అని చెప్పి బయలుదేరింది. ఊరిబయట రాముడు చెల్లెలు మరల తిరిగిరావటం చూచి సంగతేమిటని అడిగాడు. అనూరాధ దాచకుండా అంతా చెప్పింది. దానికి రాముడు విచారిస్తూ చెల్లెల్ని వెళ్లమని చెప్పేడు. వెంటనే తనభార్యకు బుద్ధి చెప్పటానికని ఒక గొప్ప



ఫోటో : కె. చిట్టిబాబు, సికిందరాబాదు.



ఫోటో : ఎన్. రామకృష్ణ.

# బొమ్మల కొలువు

బాలులారా! బాలలారా!
    కొలువు తీర్చెను బొమ్మలిట-సం
క్రాంతిపండుగ దినములందున
క్రాంతి జనులకు నిచ్చుచున్!

గట్టియైనవి మట్టిబొమ్మలు,
గాజుబొమ్మలు మోజుకోనము,
కొండపల్లి కొయ్యబొమ్మలు,
కొలదిగా మైసూరు బొమ్మలు,
కీలు బొమ్మలు, తోలుబొమ్మలు,
కొలువు తీర్చెను చూడరండీ!
'బాలులారా! బాలలారా!'

జగతిలోపల జీవితమ్మున
జరుగువింతలు విశేషాలూ
బొమ్మలా కొలువందు చూడగ
ప్రొద్దుపోవక ముందెరండీ!
'బాలులారా! బాలలారా!'

వింతలైన దశావతారము
లంది భక్తులనుద్ధరించిన
విష్ణుదేవుని వివిధరూపము
లచటయున్నవి చూడరండీ!
'బాలులారా! బాలలారా!'

బోసినవ్వుల గాంధితాతా,
బొజ్జపెంచిన బాపనయ్యా,
పసిడివన్నెల చిన్నపాపా,
పరుగుతీసెడి రౌతులరుగో!
'బాలులారా! బాలలారా!'

అమ్మఅల్లిన పూలుసంచీ,
అక్కకుట్టిన దోరకర్టెను,
నాన్నతెచ్చిన రైలుబండీ,
అన్నచేసిన పూలచెట్టుదిగో!
'బాలులారా! బాలలారా!'

తోకముడిచిన కుక్కపిల్లా,
వెక్కిరించెడి కొండముచ్చూ,
గాండ్రుమని గర్జించుసింహము,
కలవు బొమ్మల కొలువులో!
'బాలులారా! బాలలారా!'

బాలులారా! బాలలారా!
కొలువు తీర్చెను బొమ్మలిట-సం
క్రాంతిపండుగ దినములందున
క్రాంతి జనులకు నిచ్చుచున్!

పాతూరి ప్రసన్నాంజనేయులు

# అమ్మ ప్రేమ

చెట్టు చెయిదము చేయగా కొట్టెనమ్మ
మంచికోసము తల్లి నొప్పించె గాని
నీము రోషమ్ముతో " తల్లిప్రేమ మరచి
వీడిపోయెదనిల్లని వేగిరపడె.

మూటముల్లెల బట్టలు ముడిచి కాళ్లు
తడబడంగను అలుకతో నడచివెళ్లి
ఊరివెలుపల గుడిలోన భారతమ్మ
వినుచు తండ్రిని దరిజేరి గినిసె నిట్లు.

'నాన్న నీకును నాకు ఋణమ్ము తీరె
కన్నకడుపును మఱచెను గన్నతల్లి
తల్లికాదది నాగుండె తల్లడిల్లెఁ
బయనమైపోదు పెరదేశమైన మేలు.

గాలినే మేసి పవళింతు ధూళిలోన
వీధులందున దిరుగాడి బిచ్చమెత్తి
కొందు నదియైన నయమీ కొంపలోన
మనుటకన్నను చచ్చుట పరమసుఖము.'

భారతమ్మను మాని కుమార భార
తమ్ము వినె—తండ్రి నిట్టూర్చె తలనువాంచె
తనయు దరిజేర్చి చుబుకంబు పుణికి బాష్ప
కలితుడై చెప్పె కానకకన్న మమత.

'అమ్మకన్నను దైవమ్ము నరయలేవు
చదువుకొన్నట్టి చదువుల సారమెల్ల
'మాతృదేవోభవా' యను మహితవచన
మాత్రమే సుమ్ము-విను నామాట నమ్ము.

నిన్ను నవమాసములు మోసి నీరసించి
గర్భకుహరమ్మునుండి యావిర్భవింప
కష్టమెల్లను మరచెను గన్నతల్లి
బాలసూర్యుని గన్నట్టి ప్రకృతిపోలె.

పూర్వగిరిపైన సూర్యుడు పొడువగానె
గిన్నెలందున పెరుగును వెన్న బెట్టి
గోరుముద్దల నందించు కొమరుడన్న
ప్రేమచేతను ; దానికి లేదు సాటి.'

తండ్రి యీగతి పల్కగా తనయుడంత
అమ్మప్రేమను తలచెను ; అశ్రుధార
లురలి పారెను; తప్పును కరగిపోయె-
చూపరకు నెల్లకఱగుండు సురిగిపోయె

అమ్మ దైవము దేవాలయమ్ము గృహము
అర్చకులుగారె అర్భకులైనవారు
అమ్మరూపమ్మెగద ఈ అవనియెల్ల
మాతృసేవకు మించిన భక్తి గలదె?

శుభశ్రీ

## మోసానికి మోసం

ఉపాయం ఆలోచించాడు.

అక్కడ యింటివద్ద అనూరాధ వెళ్లిపోగానే, రాముడి భార్య భర్త కోసం భోజనం తయారుచేసి ఎదురు చూడసాగింది. అంతలోనే భర్త వచ్చాడు. వచ్చి రావటంతోనే మంచం వాల్చుకొని కళ్లు మూసు కొని పడుకున్నాడు. భార్య దగ్గరకు వెళ్లి పలకరించింది. కాని పలక లేదు. "పలకరేమిటండీ" అని ఆదుర్దాగా అడిగింది. అందుకు రాముడు లేచి లేనిపోనివి కల్పించి యిట్లా చెప్పేడు.

"ఏమని చెప్పేది. మీ పుట్టింటివాళ్ల యింటికి నిప్పంటుకొని కాలిపోయిం దట. పూచికపుల్లయినా బయటకు తీసికొని రాలేదట. కట్టుబట్టలతో మాత్రమే బయటపడ్డారుట" అని అన్నాడు. అంతలో భార్య "పాపం వాళ్లు ఎట్లా వున్నారో ఏమో, బండి మీద ఒక బస్తా బియ్యం, అరబస్తా కందులూ, మినుములూ వగైరాలిసు కొని వెళ్ళి యిచ్చి రండీ. మీకు పుణ్యం వుంటుంది" అన్నది. ఆ అవ కాశంకోసం ఎదురు చూస్తున్న రాముడు సరే నన్నాడు. భార్య వెంటనే అన్నీ మూటలు కట్టి, ఒక మూటలో అన్నం, పెరుగు కలిపి పెట్టింది. ఆ అన్నం, పెరుగూ మధ్య లో తాను భర్తకు తెలియకుండా పాలు, పెరుగు అమ్మిన డబ్బులో ఒక వంద రూపాయల మూట పెట్టింది. మూటలన్నీ బండిలో వేసి, భర్త చేతికి అన్నంమూట నిచ్చి "మావాళ్లు అన్నంకోసం ఎంత అల్లాడుతున్నారో ఏమో! త్వరగా వెళ్ళి యీ అన్నంమూట నివ్వండి" అని అన్నది. అందుకు రాముడు నరేనని బండిని తిన్నగా చెల్లెలింటికి తీసికొని పోయాడు. బండిలో వన్నీ యింటిలోనికి తీసుకొనివెళ్ళి చెల్లెలి




"నీతో కాపురం చేయడంకన్నా, నూతిలోదూకి చావడం మేలు...."
చిత్రకారుడు : ఎ శ్యామసుందర్, గుత్తి.

కిచ్చాడు. అనూరాధ పరమానందంతో అందుకుంది. అన్నంమూటను విప్పి చూడగా వంద రూపాయలు కన్పించాయి. అనూరాధ వాటిని రాముడికి చూపించింది. ఆ డబ్బును ఆమెనే తీసికొనమన్నాడు. ఆమె అన్నకు భోజనం పెట్టింది. రాముడు చెల్లెలు వుండమంటున్నా వినకుండా వచ్చేశాడు. ఇంటికి వచ్చిన తర్వాత భార్య ఆదుర్దాగా "ఏమండీ! అవన్నీ మా వాళ్లకి భద్రంగా యిచ్చారా? వాళ్లంతా సుఖంగా వున్నారా?" అని అడిగింది. దానికి రాముడు లేని దుఃఖం తెచ్చుకొని, "ఏం చెప్పనూ? దారి మధ్యలో మన బండిని ఒక రాక్షసి ఎత్తుకుపోయింది. నేను మాత్రం ఎట్లాగో తప్పించుకొని వెనక్కి తిరిగి వచ్చేశాను" అని చెప్పేడు. అదివినగానే భార్య ఒకటే ఏడుపు మొదలెట్టింది. దానితో చుట్టుప్రక్కలవారందరూ వచ్చి సంగతిని తెలుసుకున్నారు. అందరూ కలిసి రాముడ్ని "బండిని ఎక్కడైనా రాక్షసి ఎత్తుకుపోతుందా" అని అడిగారు. అందుకు రాముడు సమయాన్ని వృథా పోనివ్వకుండా "పొయ్యిని పిల్లి ఎక్కడైనా ఎత్తుకుపోతుందా?" అని అడిగాడు. అంతటితో జరిగిన కథను అందరూ తెలిసికొని ఎవరిళ్లకు వాళ్ళు వెళ్లారు. అప్పుడు భార్య తన తప్పు తెలిసికొని రాముడితో "నేను గొప్ప పాపం చేశాను. ఇక నాకు బుద్ధి వచ్చింది. ఇంకెప్పుడూ అట్లా చేయను" అని ఒట్టు వేసుకొన్నది. తరువాత రాముడు జరిగినకథంతా దాచకుండా చెప్పేడు. అప్పటినుంచి అనూరాధను చక్కగానే చూసేది.

చూశారా! అందుకే మోసాన్ని మోసంతోనే జయించాలంటారు పెద్దలు. ★

## కథలాంటి కథ

కె. పి. శర్మ

మా స్కూలు ఫైనల్ పరీక్షలు జరిగేరోజుల్లో ఈ సంఘటన జరిగింది.

పరీక్ష టైమ్ అయింది. బహుశ ఆరోజు ఇంగ్లీషు పరీక్ష అనుకొంటాను, సరిగా గుర్తులేదు. మా స్కూల్కు ఛీఫ్‌గా ఒక మేడమ్ వచ్చింది. మేమంతా పరీక్ష పేపర్లు తీసుకొని తొందరగా టైము చాలదేమోనన్న భయంతో పేపర్లు వ్రాస్తున్నాము.

ఇంతలో ఛీఫ్‌గా వచ్చిన మేడమ్‌గారు మా రూమ్‌లోకి వచ్చి "అబ్బాయిలూ! కాపీలు కొట్టటం చాలా తప్పు. ఒకవేళ తెలియక ఆ ఉద్దేశ్యంతో మీ దగ్గర ఏమైనా కాగితాలుంటే నాకు ఇప్పుడు ఇచ్చివెయ్యండి. నేను మిమ్మల్ని కోప్పడను. ఇప్పుడు ఇవ్వక పోయారా, మీ దగ్గర నుంచి నేను ఆ కాగితాలను లాక్కొని పరీక్ష వ్రాయకుండా బయటకు పంపించవలసివస్తుంది" అని ఒక సుదీర్ఘ ఉపన్యాసం ఇచ్చారు. అప్పుడు వెంటనే మా రూమ్‌లో ఒకతను నిలబడి తన చొక్కా మడతల్లో, మేజోళ్ళల్లో పెట్టిన కాగితాలు తీసి మేడమ్‌కు ఇచ్చినాడు. ఆవిడ అతన్ని ఏమి అనకుండా "బుద్ధిమంతుడు" అని ప్రక్కరూమ్‌కు వెళ్ళిపోయింది.

పరీక్ష వ్రాయటం అయిన తరువాత చివ్వరికి నేను, నా ఫ్రెండ్స్ అతన్ని కలుసుకొని "ఏమిటి అసలు ఎందుకు ఆ కాగితాలు తెచ్చారు. తెచ్చి ఎందుకు ఇచ్చారు" అని అడిగితిమి. అందుకు అతను "నేను తెచ్చిన కాగితాలకు సంబంధించిన ప్రశ్నలు ఏమీ రాలేదండీ. అందుకని అడగంగానే ఇచ్చేశాను" అని అన్నాడు.

అప్పుడు మేము అనుకొన్నాము "ఎంత బుద్ధిమంతుడురా ఇతనూ" అని.

# రాశి ఫలాలు

**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

**13-1-1960 బుధవారం మొదలు**
**19-1-1960 మంగళవారం వరకు.**

### మేషం:

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

కార్యసిద్ధి బాగుంటుంది. అనుకున్న పని కాకపోవటమనేది ఉండదు. కాని కొంచెం ఆలస్యం కనుపిస్తుంది. వ్యవహార కార్యకలాపాలలో మీ ప్రయత్నాలు ఒకదానికొకటి అనుకూలిస్తుండటంవల్ల పేరు ప్రతిష్ఠలు, ధన లాభము పొందగలుగుతారు. విశ్రాంతి మాత్రం ఉండదు. కుటుంబంలో సుఖం లభిస్తుంది. చాలా ఉత్సాహకరమైన సమయం. బంధువులవద్ద నుంచి సంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి. ముందు మీతో సహాయం చేస్తానని చెప్పిన వ్యక్తివల్ల అనుకూలం ఉండదు. కాని మీ పనులకు మాత్రం ఏ విధమైన లోపము కనుపించదు. మామూలుగా చేయు వృత్తి వ్యాపారాలు చక్కగా ఫలితాన్నిస్తవి. ధర్మకార్యాల నిమిత్తం ఖర్చులు అధికంగా తోచవచ్చు. కొన్ని ముఖ్య సందర్భాలలో మీ మాటచాకచక్యంవల్ల భిన్నాభిప్రాయం కలవారిని కూడా మీకు అనుకూలంగా త్రిప్పుకోగలుగుతారు; 18,19లలో దేహశ్రమ, సందేహ నివృత్తి, శుభవార్తలు.

### వృషభం:

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఈ వారం ఇతరులతో కలిసి చేయు పనులలో స్వల్పమైన కారణాలు మిమ్మలను కలవరపెట కల సూచనలున్నవి. అయితే మీకు రావలసిన ధనం సకాలంలో రావటంవల మనశ్శాంతి, కార్యసిద్ధి పొందగలుగుతారు. త్రిప్పుట అధికంగా ఉండటంవల్ల మధ్య మధ్య కొంత అసంతృప్తి కనుపించినా కోర్టు చేరీలలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. నూతన మార్గాలలో ధనార్జన యోచనలు కార్యరూపంలోనికి రాగలవు. బంధుమిత్రుల ప్రోత్సాహంవల్ల మీ శక్తి సామర్థ్యాలకు తగినట్లు గౌరవప్రదమైన బాధ్యతలను నిర్వహించగలుగుతారు. కుటుంబంలోనివారి అనారోగ్య కారణాలవల్ల ధనవ్యయం అయ్యే సూచనలున్నవి. సాధ్యమైంతవరకు కలహ ప్రసంగాలు రాకుండా చూచుకొనటం అవసరం. వారాంతంలో దుబారా ఖర్చులు పెరుగుతవి. మనస్సుకు ఆందోళనకరమైన వార్తలను వింటారు. 13,14లలో ఆడంబర ఖర్చులు, పిల్లల మూలంగా ఆనందం, ఇష్టవస్తు ప్రాప్తి.

### మిథునం:

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

తరచూ మీరు ఈ సమయంలో ఇతరుల సలహా నిమిత్తం ఎదురు చూడవలసివస్తూ ఉంటుంది. స్వల్ప కారణాలు కూడా పట్టుదలకు పోవటంవల్ల ప్రబలం కాగల అవకాశాలున్నవి. ఆదాయం పెరిగినట్లు కనుపిస్తుంది. కాని మనశ్శాంతి మాత్రం అంతగా కనుపించదు. ప్రతి విషయంలోనూ ఎదటి వారి అభిప్రాయాను సారంగా పోవటంవల్ల మీరు తలపెట్టిన కార్యక్రమాలు సులభంగా నెరవేర్చుకో గలుగుతారు. మీ ఆరోగ్యంగురించి మాత్రం జాగ్రత్తగా ఉండటం అవసరం. శుభ సంతోషాల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. అన్ని రంగాలలోను ఆటంకాలను ఎదుర్కొంటు ముందుకుపోవలసి రావటంవల్ల మధ్యమధ్య నిరుత్సాహం కలుగుతూ ఉంటుంది. కాని దైవానుగ్రహంవల్ల మీ పేరు ప్రతిష్ఠలకు లోపంరాదు. ధర్మకార్యాలు నిదానంగా అనుకూలిస్తవి. ప్రయాణ సూచనలున్నవి. 14, 15, 16 లలో శుభ సంతోషాలు, ఆదాయంలో పెరుగుదల, మిత్రలాభం.

> **గ్రహస్థితి**
>
> కన్యలో రాహువు, వృశ్చికంలో గురుశుక్రులు, ధనుస్సులో కుజ బుధ శనులు, ఘనుర్మకరాలలో సూర్యుడు, మీనంలో కేతువు, మిథున కటక సింహ కన్యలలో చంద్రుడు.

### కర్కాటకం:

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఉత్సాహవంతమైన సమయం. మిమ్మలనుగురించి అనేకమంది గొప్పగా చెప్పుకుంటు ఉంటారు. మీ ఆలోచనలకు మిత్రులయొక్క ప్రోత్సాహం బాగా లభిస్తుంది. అధికారులవల్ల కార్యసిద్ధి పొందగలుగుతారు. ఈ సమయంలో స్నేహవర్గంలోనివారు కొంతమంది మీతో విరోధించ గల అవకాశాలున్నవి. అందువల్ల మొదట్లో అశాంతి కనుపిస్తుంది కాని నిదానంగా వీవల్ల తప్పులేదనే విషయం తెలుసుకోగలుగుతారు. విలువగల వస్తువులు కొనే అవకాశాలున్నవి. వృత్తి ఉద్యోగాలలో విశేషమైన అభివృద్ధి కనుపించదు కాని మంచి పేరు సంపాదించుకోగలుగుతారు. సాటివారివల్ల సహాయం లభిస్తుంది. మీ హోదా పెరుగగల అవకాశాలున్నవి. సంఘ కార్యాలలో ప్రవేశించవలసి వస్తుంది, కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి. 16, 17 లలో శుభకార్య ప్రయత్నాలు, నౌకరులవల్ల కార్యఅనుకూలత, అజాగ్రత్తవల్ల వస్తునష్టం.

### సింహం:

(మఘ, పుబ్బ, ఉత్తర 1వ పాదం)

అనేక మార్గాలు కంటిముందు కనుపిస్తుండటంవల్ల ఇందులో ఏ పద్ధతిని అనుసరించవలయునో అనే ఆందోళన ఈ సమయంలో కొంతవరకు బాధిస్తూ ఉంటుంది. కాని వారం మధ్యభాగంలో మీ సమస్యలు వాటంతట అవే పరిష్కారం కాగలవు. ఈ వారం మొత్తంమీద ధనవ్యయం మాత్రం అధికంగానే ఉంటుంది. వ్యవహార రంగంలో అనుకూలమైన సమయం. మీ శ్రమకు తగిన ఫలితం కనుపిస్తుంది. కొన్ని సమయాలలో మీతో కలహించటానికి ప్రయత్నించిన మనుష్యులు తామే మీ అభిప్రాయానికి అనుకూలంగా వస్తారు. ఆదాయం విశేషంగా పెరుగుతుంది. కుటుంబ విషయాలలో ఇంతకుముందు కనుపిస్తున్న అసంతృప్తి సంపూర్ణంగా తొలగిపోయి అన్ని విషయాలలో నెమ్మదిగా ఉంటుంది. సంఘ కార్యాలలో మీ శక్యతను సక్రమంగా నెరవేర్చుకోగలుతారు. 14,15 లలో ఖర్చులు సంతోష వార్తలు శ్రమతో కార్యసిద్ధి.

### కన్య:

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

మీ బుద్ధిబలానికి, మీ సహనానికి పరీక్షవంటి సమయం. ఇతరుల కార్యక్రమాలలో గాని, వ్యవహారాలలో గాని జోక్యం కలిగించుకొకుండా ఉండామని అనుకుంటారు. మొత్తంమీద ఏదో ఒక సందర్భంలో తప్పని సరి అవుతుంది. అందువల్ల కష్టనష్టాలు ఉండవుగాని బంధుమిత్రులతో విరోధాలు రాగల అవకాశాలున్నవి. ఈ వారంలో ప్రయాణ సూచనలున్నవి. ఆదాయం ఎంత వచ్చినా ఖర్చులు కూడా పెరగటంవల్ల ఎప్పటికప్పుడు ధనం కోసం ఎదురు చూడవలసివస్తు ఉంటుంది. వస్త్రాభరణాలు మొదలయినవి కొంటారు. విలాస వినోద

కార్యక్రమాలలో పాల్గొంటారు. వారం రెండవభాగంలో నీలాపనిందలు వచ్చి అనంతరం తొలగిపోతవి. మీ స్నేహితులకు సహాయం చేయవలసి వస్తుంది 13 14 లలో శ్రమ ఫలిస్తుంది. ఉపయోగకరమైన ధనవ్యయం, దూరబంధువుల వద్దనుంచి శుభవార్తలు.

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ సమయంలో ఆదాయము, ఖర్చులు ఈ రెండు అధికంగానే ఉంటవి. కొన్ని సమయాలలో మీ ఆలోచనలకు ప్రత్యక్షంలో జరుగుతూఉన్న కార్యక్రమాలకు సంబంధం గోచరించదు కాని వ్యవహార రంగంలో విజయప్రదమైన కాలం. కార్యక్రమాలకు ఒక నిర్ణయం అంటు ఉండదు. ఈ విధంగా జరిగిన పనులే దైవానుగ్రహం వల్ల ముందు ముందు లాభకరంగా ఉంటవి. ఆదాయంకంటె ఖర్చులు ముందుగా వస్తూ ఉండటంవల్ల మధ్యమధ్య ఆందోళన కలుగుతూ ఉంటుంది. ఉష్ణసంబంధమైన అనారోగ్యం చేయగల అవకాశాలున్నవి. వృత్తి వ్యాపారాలలో శ్రమకరంగా తోస్తుంటుంది. కాని మామూలుగా మీ పేరు ప్రతిష్ఠకు లోపం లేదు. ఆదాయంకూడా బాగానే ఉంటుంది. కొన్ని సమయాలలో అకస్మాత్తుగా ఉద్రేకం పెరిగి కలహాలకు దారితీయగల అవకాశాలున్నవి. జాగ్రత్తగా ఉండటం మంచిది. 14, 15లో వృత్తిలో గౌరవం, సత్కాలక్షేపాలు, ఆదాయవృద్ధి.

**వృశ్చికం:**

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ).

ప్రస్తుతం మీ పైనఉన్న బాధ్యతలు నిర్వహించటం కొంచెం శ్రమకరంగా తోచవచ్చు. ప్రధానంగా మీజాగ్రత్తవల్ల అధికారులవల్ల మాటరాకుండా చూచుకోగలుగుతారు. ఖర్చులు మీ అంచనాను మించిపోగల అవకాశాలున్నవి. ఈవారంలో సాధారణ ప్రసంగాలుకూడా తలవని తలంపుగా విరోధానికి దారితీయగల అవకాశాలున్నవి. జాగ్రత్తగా ఉండటం మంచిది. క్రొత్త మనుష్యులతో పరిచయం లభిస్తుంది. మీరు చాలాకాలంగా జరపలేని కార్యక్రమాలు సంపూర్తిచేయగలిగి సంతుష్ట మనస్సుకు పరితృప్తి కలుగుతుంది ఆదాయం, గౌరవం బాగా పెరుగుతవి. ఈ సమయంలో మీరు అనుకొంటున్నా లేకపోయినా తప్పనిసరిగా ఇతరులకు సహాయం చేయవలసిన అవసరం కలుగుతుంది. 16, 17 లలో అదృష్టసూచనలు పైవారివల్ల ఆదరణ, విశేష లాభం, బంధు దర్శనం.

**ధనుస్సు :**

స్వగా తయారు కాగలసూచనలున్నవి. అగతిలివారు మిమ్ములను పైకి గౌరవిస్తున్నట్లు కనుపిస్తున్నా మితిమీరిన మీకు ఇష్టంలేని పనులలో బలవంతంగా దించటానికి ప్రయత్నిస్తారు. కొన్ని సందర్భాలలో సమయానుకూలంగా పోవలసి వస్తుంది. ఆదాయంలో గాని మీ గౌరవ ప్రతిపత్తులలో గాని వ్యత్యాసం రాదు. కాని మానసికంగా నిరుత్సాహం తోస్తుంది. వృత్తి వ్యాపారాలలో మీ కార్యక్రమాలు లోపంలేకుండా జయప్రదంగా జరిగిపోతూ ఉంటవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం కొంచెం అసంతృప్తికరంగా కనుపిస్తుంటుంది. ఇతరుల వ్యవహారాలలో మధ్యవర్తిత్వంవంటి బాధ్యతలు గాని, సాంఘిక కార్యాలలో ప్రవేశించటం గాని ఈ సమయంలో మంచిదికాదు. ఈ సమయంలో ఆదిత్యహృదయస్తోత్రం, శివసహస్రనామస్తోత్రం పఠించుకోవటం వల్ల చిత్తస్థైర్యం లభిస్తుంది కార్యసిద్ధి, 18, 19 లలో ఇతరులతో పోటీ, ప్రయాణ సూచనలు ధనలాభం.

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఇంతకుముందు నిర్వహిస్తున్న కార్యక్రమాలు నిదానంగా ఒకదారికి వస్తున్న ఈ సమయంలో క్రొత్త ఆలోచనలు, ప్రయత్నాలు చేయవలెయునని భావిస్తారు. కాని తొందరపడటం మంచిదికాదు. దైవికంగా లభించిన అవకాశం మాత్రం వినియోగించుకుని ప్రశాంతంగా ఉండటం మంచిది. బంధుమిత్రుల కార్యభారంవల్ల మీ స్వంత పనులకు ఆటంకం కలిగే సూచనలున్నవి. ఈ సమయంలో తప్పనిసరిగా ఖర్చులు క్రమక్రమంగా పెరిగిపోగల అవకాశాలున్నవి. కుటుంబ విషయాలలో నెమ్మదిగా ఉంటుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తికి సంబంధించిన వార్తలు సకాలంలో చేరకపోవచ్చు. ఈ వారంలో సాధ్యమైనంతవరకు వ్యవహారరీతిగా మీ మీద మాటరాకుండా చూచుకోవటం అవసరం. ఇతరులను నమ్ముకుని మీ పనులలో అశ్రద్ధగా ఉండవద్దు, 14, 15, 16 లో ఒక ప్రక్క ఉత్సాహ సూచనలు, మరొక ప్రక్క మనస్సులో కారణం తెలియని ఆందోళన, శుభసంతోష కార్యాలలో పాల్గొనటం.

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా)

గ్రహస్థితి అన్నివిధాలా అనుకూలంగా వున్న సమయం. వృత్తిలో అభివృద్ధి, ఆడంబరము, నదిమందిలో పేరుప్రతిష్ఠలు బాగుం ఆనంద భిమానాలు లభిస్తవి. ఒకటి రెండు సందర్భాలలో ఇతరుల సలహాలవల్ల సాహస కార్యాలలో దిగవలసినపరిస్థితి కలుగుతుంది. కాని మీ సహనం సంతృప్తి వీటవల్ల వ్యాపారాన్ని కాపాడ కోగలుగుతారు. మీ శ్రమకు తగినఆదాయం లభిస్తుంది. ముందుగా పైన వేసుకుని నిర్వహిస్తున్న పనులు సక్రమంగా జరుగును విలాస వినోదకార్యక్రమాలలో పాల్గొంటారు. ఈ సమయంలో ఇతరులు చెప్పినమాటను ఎంతవరకు యథార్థమో తెలుసుకోకుండా ఆచరించటంవల్ల అపవాదులు చిక్కులు రాగల సూచనలున్నవి. వారాంతంలో కుటుంబంలోని వారికి అనారోగ్యం చేస్తుంది. 15, 16 లలో విలాసవినోదాలు, మిత్రలాభం.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ప్రస్తుతం మీరు ప్రారంభించిన ప్రతిపని సక్రమమైన ఫలితాన్నిస్తుంది. మొదట మాత్రం సులభంగా తోచదు. భయంకరంగా కనిపిస్తుంది. మీరు దీక్షతో కార్యరంగంలో ప్రవేశించగలుగుతారు. చివరకు మీ శ్రమ బాగా ఫలిస్తుంది. మీ మాటసహాయంవల్ల అనేకమందికి ఉపకారం చేయగలుగుతారు. వారంమధ్యంలో అధిక ఉష్ణంవల్ల అనారోగ్యం కనపించి నివర్తి అవుతుంది. అందువల్ల మీ ప్రయత్నాలకు తాత్కాలిక ఆటంకం కలుగవచ్చు. బంధువులరాకపోకలు మొదలయినవాటివల్ల ఖర్చు విశేషంగా వుంటుంది. స్థిరాస్తులు కొనుటకు గాని గృహనిర్మాణం మొదలయిన పనులకు అనుకూలమైన సమయం. ఇతరులకు డబ్బు పెట్టుబడి పెట్టటం, అప్పులు ఈయటంవంటి పనులలో చిక్కులు ఏర్పడగల అవకాశాలున్నవి. 13, 14 లలో మనస్సంతోషం. అకస్మాత్తుగా కలహసూచనలు. శుభకార్య ప్రయత్నాలు ఇష్టవస్తు ప్రాప్తి. ★

లన్నీ ఎక్కడివి అక్కడ వూడిపడ్డాయి. ఆ విరియబాటులో శకటుని ఆకారమే విరిగిపోయింది. వాడి శరీరం ఏమైందో అయిపు లేదు. అది పంచభూతాలలో లీనమైపోయివుంటుంది. వాడి ప్రాణం రూపులేనిది ఎక్కడికో లేచిపోయింది. వాడి జీవుడు ఎక్కడినుంచి వచ్చాడో అక్కడికి వెళ్ళిపోయినాడు.

నదిలో బట్టలు ఉగుకుకుంటోంది గాని యశోదకు గుండె ఆగలేదు. నదిలో స్నానం చేస్తోంది గాని యశోదకు మనసు నిల్వలేదు. ఆవిడ తోటి గోపికలను అక్కడే వదిలి, పాలు చేపుకురాగా, క్రేపుకోసం పరుగుపెట్టే గోవు మహాలక్ష్మిలాగా ఇంటికి పరుగు పెటుకు వచ్చింది. వస్తే ఇంటి దగ్గర పరిస్థితి ఇట్లా వుంది. వాకిట్లో బండి ఏ అంగానికి ఆ అంగం వూడి విపర్యస్తమై పడివుంది. అవిచూ గుండెలు అవిసి పోయినాయి. "హా!" అంటూ పరుగువచ్చి పిల్లవాణ్ణిచేతుల్లోకి తీసుకుంది. గుండెకు అదుముకుంది. "నాన్నా! నువ్వు నిద్రపోయావనుకొని నిన్నిక్కడ పారవదలి అట్లా నదికి వెళ్ళానురా! పరమ పాపిష్ఠి దాన్ని! ఈస్నానం నాకు ఎందుకువచ్చింది. దుస్స్నానం. అసలు నేను నదికి ఎందుకు వెళ్ళాను! ఇంతలో ఈ బండీ ఇట్లా అయిపోయిందేమో! నాతండ్రి! మీ నాన్న వస్తే నేను ఏమని చెప్పగలనురా! నన్ను ఆయన ఏమి చెయ్యాడు! ఆయనకు కోపంవస్తే మనిషి కాదు. నేను ఏమిచేసేది' అని విలపించింది,

"ఈ బండీ ఇట్లా ఎందుకైంది? దీనికి కారణం ఏమిటి? అని మీ నాన్న అడిగితే నేను ఏమి చెబుతానురా! తండ్రీ! ఇప్పుడు ఇదో వెతవచ్చి పడ్డదిరా! నా మీద" అని ఆక్రోశించింది.

ఇట్లా భయపడుతూ యశోద పిల్లవాణ్ణి తీసుకొని జరిగిన సంగతి ఎవ్వరితోను చెప్పకుండా ఇంట్లోకిపోయి, పిల్లవాణ్ణి అంకతలంమీద కూర్చోపెట్టుకుని, పాలు ఇచ్చి, చుంచు దువ్వి, భర్త రాకకోసం ఎదురుచూస్తోంది.

ఇంతలో అడవులలోంచి ఆవులు వచ్చాయి. ఆవులతో నందగోపుడు వచ్చాడు. తల కొంచెంగా అక్కడక్కడా నెరసి వుంది. అరణ్యంలో సంచరిస్తూ వుండగా తరువులనుండి రాలిన కేసరములు మూసరంగా పడి ఆ తల అత్యంత ధూసరంగా వుంది. గోఖురోద్ధూతమైన రజంచేత కుంఠితమై చెమటవాన తడిసి ఏదో అంగరంగాన్ని రాచుకున్నట్లు ముఖం చెన్నుమిగిలి కన్పిస్తోంది. ఆయన నీరుగావి ధోవతి కట్టుకున్నాడు. అది లేతచిగుళ్ళ జిగినూ నెలు అంటుకొని అతి స్నిగ్ధమైన కాంతిని వెల్లడిస్తోంది. కర్కశమైన ముల్లు పడివున్న కఱ్ఱను చేత్తో పుచ్చుకొని గోపాల పరివారంతో ఆజానుబాహువు, వృషస్కంధుడు, సాలప్రాంసువు, కవాటవక్షుడు ఆయనవస్తూంటే యశోదకు భయమైపోయింది. ఇంటిదాకా అందరితో ఛలోక్తులాడుతూ, బహు విషయాలు ముచ్చటిస్తూ వచ్చిన ఆ నందుడు ఇంటి ముంగు వాకిట్లో ప్రస్తచక్రము, విభగ్నాక్షము, విభిన్న భాండము, అయినశకటాన్ని చూచాడు. యశోద ఎప్పుడు పిల్లవాణ్ని ఈ బండీ క్రింద పడుకోబెడుతుంది. నందుని గుండె ఒక్కసారి ఝల్లుమంది. శరీరంవణికింది. "ఈ బండీ ఇట్లా అరవరలై పడివుండటానికి కారణం ఏమిటి? పిల్లవాడు ఏమైనాడు? వానికి ఏమీ మూడలేదు గదా!" అనుకుంటూ ఇంట్లోకి ప్రవేశించాడు నందుడు.

అక్కడ అతనికి కనుపట్టిన దర్శనమే దర్శనము! అమ్మ పాలు ఇస్తోంది. అమృతంవంటి పాలు అవి. ఆ పాలు త్రాగుతూ చిన్ని తండ్రి బోసినవ్వులు నవ్వుతున్నాడు. పద్మపత్రాలవంటి కన్నులు పాపడివి. దీప్తిమంతాలై వెలుగుతున్నాయి. ఆ దీప్తులు అమ్మముఖ చంద్రుణ్ని ఆనందసముద్రంలో ఓలలాడిస్తున్నాయి. నందునికి ఆనందం పట్టరానిదై పోయింది. పిల్లవాడు అట్లా వుండగా చూచి నందుకు నందుడు గుండె నిమురుకున్నాడు. తన కుటుంబినివంక అనురాగముతో చూచాడు. అప్పటికి యశోదకు గుండెదడ కొంతతగ్గింది.

"ఇది యేమే! ఈ బండి ఇట్లా అయింది? అంబోతులేమన్నా పోట్లాడుకుని దీన్ని ఇట్లా విరిచిపెట్టాయా? లేకపోతే సుడిగాలి యేమన్నా వచ్చి దీన్నిట్లా విషమువ్యస్తంగా పడదోసిందా? వాటి నిజం చెప్పు."

యశోదకు ఉన్న నిజం చెప్పాలంటే ఇంకా భయంగానే ఉంది. అయినా ఇంత జరిగిన తర్వాత చెప్పకతప్పదు. మాట్లాడబోగా యశోద కంఠం గద్గదమైంది.

"స్వామీ! నావలన తప్పు చాలావుంది. మీరు సహించాలి. నేను పాపణ్ణి ఎప్పటిలాగే బండీక్రింద మంచం వేసి పడుకోబెట్టి, నది దగ్గరేకదా అని స్నానంచేసి వద్దామని వెళ్ళాను. రెండు బట్టలుంటే అవిగూడా ఉతుక్కొనివచ్చు ననుకున్నాను. నేను ఆలస్యం చేసింది లేదు. గిరుక్కున తిరిగివచ్చాను. వచ్చేటప్పటికే ఇక్కడ అంతా ఇట్లా వుంది. నాయన గండం గడిచి గట్టెక్కాడు."

నందుడు ఆమెమీద కోపం చేయలేదు. "సరే! కానీ అయిందేదో అయింది. మన పిల్లవాడు క్షేమంగా వున్నాడు. అదే పదివేలు" అన్నాడు. కాని ఆయనమనస్సులో గర్గుడు మధురకు పోతూ చెప్పినమాటలు విన్పించాయి. ఆ తర్వాత ఇది రెండో ఉత్పాతం. నందుడు బయటికేమీ మాట్లాడలేదు.

ఇంతలో కొందరు గోపాలకులు అక్కడి వచ్చారు. వారిని నందుడు ఉల్లాసంతో పల్కరించాడు. ఏమిరా! ఇట్లా వచ్చారు" అని ప్రశ్నించాడు. వాళ్లు పిల్లలేగాని, ఆ పిల్లలు చెప్పిన మాటలలో పెద్దతనం కొట్టవచ్చినట్లు కన్పించింది నందునికి. "ఏమండోయ్! నందగోపయ్యగారు! ఈ సంగతి వినండి. ఇందులో ఏదో దైవికం వుంది. అది యేమిటో మీ మనస్సులో మీరు తెలుసుకోండి. మేమేమో మీ యింటి ప్రక్క ఆడుకుంటున్నాము. అప్పుడు మీ అబ్బాయేమోనే, కాలు ఎత్తి మీ బండీని ఒక్క తన్ను తన్నాడండీ! అసలు ఏమైందనుకున్నారు! మీ బండీ విరిగి ఇట్లా కుప్పకూలిందండీ! ఇందులో ఏదో మాయవుందంటారా? లేదంటారా?" అన్నారు. "అరే! పిల్లలు! ఇందులో ఏదో పెద్దమాయే వుందిరా! మీరు పోయి ఆడుకోండి" అని నందుడు వారిని పంపించి, వారు చెప్పిన మాటలకు విస్మయం చెందాడు. సంతోషంతో కొడుకును ఎత్తుకొని ముద్దాడాడు. బయటికి వచ్చి, బండీ పడివున్న చోటు నుంచి ఇంత భూరజం తీసుకొని, ఇంట్లోకి వచ్చి పిల్లవానికి దిగదుడుపుతీసి, తూపాడిచాడు. తన బిడ్డను ఇట్లా రక్షించినందుకు నందుడు దేవతలకందరకు వేయి వందనాలు చేశాడు. నా పిల్లవాణ్ణి మీరు ఇట్లాగే రక్షిస్తూ వుండాలి అని మ్రొక్కుకున్నాడు.

ఊళ్ళో అందరకు ఈ సంఘటన పరమ విడ్డూర్యంగా కన్పించింది. అంతా ఆశ్చర్యంతో పిల్లణ్ణి చూడ్డానికి నందుని ఇంటిమీదకు వచ్చి పడ్డారు. బాలుణ్ణి ఎంతో అభినందించారు.

ఈ విపరీతాలు ఇట్లా ఎందుకు జరుగుతున్నదీ ఎవరికీ అర్థం కాలేదు. నందుడు ఒకసారి యశోదను, ఆమెకు ఇందులో వున్న రహస్యం ఏమైనా తెలుస్తుందేమోనని, గుచ్చి గుచ్చి అడిగాడు. ఆమెకు మాత్రం ఏమి తెలుస్తుంది! "ఇది ఏమో విధి ఇట్లా మనల్ని పరీక్షచేస్తున్నట్లు వుంది. నాకు విస్మయంగా వుంది. పుత్రుణ్ణి గూర్చి నాకు తీవ్రమైన భయంవేస్తోంది. నేను పరమభీరువునై పోతున్నాను" అంది.

మరో సారి నందుడు ఈ ఉత్పాతాలనుగురించి రోహిణీదేవిని ప్రశ్నించాడు. "తల్లీ! ఈ ఉత్పాతాలు ఇట్లాజరుగుతున్నాయి. జరగడానికి కారణం ఏమంటారు" అని ప్రశ్నించాడు. ఆవిడ ఆలోచించింది. ఆలోచించి "నందా! ఈ పనులు ఆ కంసుని పనులు అయివుంటాయి. అయితే ఈఆపదలు నా కొడుక్కి రావలసింది; నీ కొడుక్కు వస్తున్నాయి. అదే నాకు అర్థం కావడం లేదు" అన్నది. నందుడు ఇంకోసారి గర్గుడు అన్నమాటలు తలుచుకున్నాడు.

ఆ రోజు నుంచీ గోకులంలో కంసుడుఅంటే పూర్వంకంటే భయం అధికమైపోయింది. మళ్ళీ ఏమి ఉత్పాతాలు జరుగబోతున్నాయోనని వ్రేపల్లె జనం భీతావహం చెందపోయారు. కొంత కాలం అంతా శాంతంగా వుంది. భయం వెనుకబట్టింది నందుడు నెమ్మదిగా శకటాన్ని బాగుచేసుకున్నాడు. పనులన్నీ మామూలుగా జరిగిపోతున్నాయి. యశోదానందగోపుల జీవితం పిలవానితోడిదే

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

[గతవారం తరువాయి]

హృదయంలో బడబానలంలా రగిలే ఆవేదన భరించలేక కృత్రిమ చైతన్యం కలిగించుకుని నవ్వులు సృష్టించుకుని, నిర్లక్ష్యంగా బ్రతకడం నేర్చిన రాజారావు చాలా నిగ్రహశక్తి ఉన్నట్టు అనిపించింది. ఆ వేదన ఉధృతంలో మనోదౌర్బల్యం పెరిగిపోయి నిరాశతో మనిషి మతిచెడగొట్టుకునే పరిస్థితులు లేకపోలేదు. దుఃఖం మరిచి వ్యథలు దూరంచేసుకుని తామరాకుమీద నీటి బొట్టులా గడపాలంటే ఎంతో వైరాగ్యం మనిషిలో జీర్ణమయి ఉండాలనిపించింది.

చక్రవర్తి ఆకలితీరలేదు, తనముందు ప్లేట్లన్నీ ఖాళీచేసేశాడు. మరోగ్లాసుతో కొద్దిబ్రాండీ, సోడా, బిర్యానీ తెమ్మని ఆజ్ఞయిచ్చాడు సర్వరుకు. నరాలబిగువుసడలిన కాళ్ళు నిటారుగా మేజా బల్లక్రింద చాచుకున్నాడు చక్రవర్తి.

శివరాం చక్రవర్తివైపు చూశాడు. తన కాళ్ళకు అతని కాళ్ళు క్రింద తగిలి ఢీకొన్నాయి. చక్రవర్తి కాళ్ళల్లో పట్టు ఎందుకు తప్పిపోయాయో అనేది తెలుసుకోవాలనే కుతూహలం ఎక్కువైంది శివరాంకు.

“పుట్టుకనుంచి ఇంతేనా కాళ్ళు!” చక్రవర్తి ప్రశ్నకు బాధపడని రీతిలో అడిగాడు శివరాం.

“లేదు మిత్రమా!...కర్మ...ఒక రోజు నేను. నా స్నేహితుడు, చంద్రంశెట్టి కలిసి తిరుపతి వెళ్ళాం...మొదటి ఆట సినిమా చూశాం...శరీర బలంతో, ధన బలంతో చంద్రంశెట్టి ఊగులాడుతున్నాడు. సినిమా వేగంగా కదులుతోంది...పొరుగింటియువతీ యువకుల ప్రేమకలాపఘట్టం ... దీక్షతో చూస్తున్నా ... చంద్రంశెట్టి పని వుందని సినిమాహాలు విడిచి బయటికి వెళ్ళిపోయాడు. అతని ప్రక్క యువతి నాంచారమ్మ కూడా కనిపించలేదు ... సినిమా అయిపోయేటప్పటికి చంద్రంశెట్టి తనసీటులో ఉన్నాడు... కారులో తిరుత్తనిమీదుగా మద్రాసు తిరుగుప్రయాణం సాగిస్తున్నాం...సినిమాలో చేసిన సాహస శృంగారసంఘటనను వర్ణించాడు చంద్రం శెట్టి... నేను కారు నడుపుతున్నా ... వేగంగా ... చంద్రంశెట్టి కథతో ఒళ్ళు ఉద్రేకాలతో ఉడుకెత్తింది. కారులోని మత్తుద్రావకం మనస్సులోని భావాలను వేగం చేసింది...పదిగంటలరాత్రి శరవేగంతో కారు కదిలిపోతోంది ... నిశీథంలో ఆకాశములోని చుక్కలు మెరుస్తున్నాయి. వీధి కిరువైపుల అల్లుకున్న జిల్లేడు డొంకలు ... చెట్టుతుప్పలు చీకటిలో దయ్యాల్లా కదులుతున్నాయి ... నల్లచీరమీది తెల్లదారలా అంధకారంలో రోడ్డు మసక తెలుపుతో నిటారుగా మధ్యమధ్య మలుపులతో చాచుకుంది.. ఒక గ్రామంవచ్చింది.. చంద్రంశెట్టిమత్తుద్రావకం త్రాగిఆనందంలో ఒళ్ళుమరిచి పాడుతున్నాడు ... చుట్టూ చీకటి...గ్రామంలో నిద్రమత్తు...వేగంగా పోయే కారు ఎదురుగా వచ్చే లారీని ఢీకొంది...ఒక గజంఎడంలో లారీ కనిపించినప్పుడు తప్పించాలని ప్రయత్నించినా లాభం లేకపోయింది...లారీ, కారు ఢీకొనడంతో పెద్ద శబ్దమైంది...స్పృహ వచ్చేటప్పటికి గ్రామం వీధి ప్రక్క తిరగలిశాల మన్న, కాళ్ళ ఎముకలు విరిగి, ముఖం బీటలతో రక్తంకారి, రక్తంముద్దలా పడిపోయాను నేను...వెనక సీటులో కూర్చున్న చంద్రంశెట్టికి మత్తు వదిలింది. కాని అద్దాలు బ్రద్దలయినముక్కలు, ఒక ఇనుపరేకు శరీరంలో గ్రుచ్చుకుని గాయాలు తీవ్రంగా తగిలేయి అతనికి. కారుఇంజనుభాగం తుతునియలుగ మారింది. లారీలోని సిమెంటు బస్తాలు క్రింద కూలిపడ్డాయి. లారీలోని డ్రైవరు చేతికి కొద్దిగా గాయాలు తగిలాయి. పాడైపోయిన చంద్రంశెట్టి కారు ఆ గ్రామంలోని తిరగలిశాలవద విడిచి లారీలో తక్షణం నన్ను, చంద్రంశెట్టిని, ఎక్కించుకుపోయారు మద్రాసుకు ... ఆసుపత్రిలో చేర్చారు ... తల్లిదండ్రులు వచ్చి గుర్బరంగా నన్ను చూసి ఏడ్చారు ... చికిత్స జరిగింది...చివరికి ప్రాణంతో అంగవైకల్యంతో మిగిలేను నేను ... నిష్ప్రయోజకుడైన నేనెందుకీ ప్రపంచంలో అనిపిసుంది?... కాని ప్రతిష్ఠ, మెదడు, దైవం యిచ్చాడు ఎందుకో?... దీనితోనే జీవితం దిద్దుకోవాలి” చక్రవర్తి నీరసంగా హేలనంగా నవ్వాడు. సెర్వరు తెచ్చిన బిర్యాని, బ్రాండీ పూర్తిచేశాడు మాటల ధోరణిలో.

“గతం త్రవ్వకోకూడదు స్వామీ ... పూర్తిగా మరచిపోవాలి ... భవిష్యత్తు శూన్యంగా తలచాలి...ప్రస్తుతం మాత్రమే మనకు ప్రధానం ... ఇంకా పానీయం కావాలా?” రాజారావు చక్రవర్తిని, శివరాంను ప్రశ్నించాడు.

మాటల ఉద్రేకాల్లో, సంఘటనల తీవ్రతలో, పరిస్థితులు మర్చి మంచినీళ్ళల్లా బ్రాందీ త్రాగేశాడు శివరాం ... తెరమీది పువ్వులు కాలవలో తెప్పల్లా కదులుతున్నాయి కంటిముందు ... సిగరెట్టుపొగలరింగుల్లో రాణిరూపాలు గిర్రున తిరుగుతున్నాయి ... కర్రచెక్కలగది సముద్రంలోని పడవలా క్రిందకు పైకి ఒరుగుతున్నట్టుంది. టేబిలుమీది ఖాళీ గ్లాసులు శూన్య జీవితాల్లా గోచరించాయి. సిగరెటు మసితో నిండిపోయిన “యాస్ట్రే” కుమిలిన హృదయంలా ఉంది నరాలబిగువు సడలింది. శరీరమంతా తేలికపోయింది. ప్రపంచమంతా గాలిలో ఊగుతున్నట్టుంది. మనోవ్యధ తీవ్రత మంచులా కరిగి మాయమైపోయింది. జీవితంలోని కట్టుదిట్టాల సూత్రాలలో ఏవో అడ్డుకట్టలు నిర్మించుకుంటూ ఆనందం యిచ్చే యిట్టి పరిస్థితులను గతంలో తృణీకరించినందుకు పశ్చాత్తాపపడ్డాడు శివరాం.

ఆ మత్తుపానీయాలగృహం బైటికి వచ్చారు. శివరాం కొద్దిగా తూలుతున్నాడు. చక్రవర్తి బుజం పట్టుకుని మెల్లిగా నడిచాడు. ఎదురుగా టాక్సీవాడితో రాజారావు ఏవో గుసగుసలాడాడు. టాక్సీ వచ్చింది. గబగబ పరుగెత్తింది. రాజారావు అకస్మాత్తుగా పద్యపఠనం ప్రారంభించాడు. చక్రవర్తి తాళం వేస్తున్నాడు. ఏ పరిస్థితిలో ఉన్నదీ కళ్ళు బలవంతంగా పెద్దవిగాచేసి చూస్తూ, కారులో ఉన్నట్టు గ్రహించుకుని, ఆ మత్తు పరిస్థితిలోని తేలిక ఆనందంలో నవ్వుకున్నాడు శివరాం. మెల్లిగా నవ్వుకోవడం బాగు లేదనిపించింది. గట్టిగా నవ్వాడు. ఆ నవ్వుల తరంగాలు చెవిలో ప్రతిధ్వనించేక హాయిగా టాక్సీ సీటుమీద ఒరిగాడు.

టాక్సీ ఎక్కడ ఆగిందో శివరాం గుర్తించలేకపోయాడు. ఒక పెంకుటిల్లు యింటి ముందు ఆగింది. టాక్సీడ్రైవరుతో రాజారావు లోపలికి నడిచాడు. మరో నిమిషంలో ముగ్గురి వనితలతో తిరిగివచ్చాడు రాజారావు.

కారు వేగంగా పరుగెత్తింది. నిర్జన ప్రదేశంలో ఆగింది. కారులో వనితల ప్రవేశంతో రాజారావు చక్రవర్తి వారి కౌగిలుల చేరి మౌనం వహించారు. మత్తులో మైమరచిన శివరాం వనిత స్పర్శలోని ఆనందం పొంద లేకపోయాడు. కారు ఆగినచోట మామిడి తోపు కనిపించింది. పండువెన్నెలు ప్రశాంతంగా ఆ స్థలమంతా చల్లబరచి, హాయి కలిగించింది. రాజారావు, చక్రవర్తి తమ వనితలతో మామిడితోపుల్లోకి నడిచారు. టాక్సీవాడు సిగరెట్టు వెలిగించి కారులో ఒంటరిగా కూర్చుని దమ్ములు లాగుతున్నాడు. శివరాం ప్రక్కనున్న వనిత బుజంమీదను అతని చెయ్యి వేసుకుని టాక్సీలోంచి బయటకు లాగింది. రాణిరూపం మసమసకగా కనిపించింది పండువెన్నెల్లో. ప్రక్కనున్న వనితను వదలి ఒంటరిగా రోడ్డుమీద నడిచాడు. ఆ బాటకంతకూ తానే చక్రవర్తిలా ఒళ్లు విరుచుకుని ఠీవిగా తూలుతూ అడుగులు వేశాడు కాస్సేపు. అతను పడిపోకుండా ప్రక్కనే నడవసాగింది వనిత. ఒక కొండ రాయి ప్రక్కన కూర్చున్నారిద్దరూ అతనిలో కొంత ఉద్రేకం కలగచెయ్యడం తన విధ్యుక్త ధర్మమని కొంత ప్రయత్నించింది ఆవనిత, నిర్లక్ష్యంగా చికాకుగా కొండరాయిపైన ఒరిగిపోయి, హాయిగా లీలగా కూనిరాగాలు తీశాడు శివరాం,

రాజారావు చక్రవర్తి ఒక అరగంట పోయాక శివరాంను తీసుకుపోయి టాక్సీలో కూర్చొపెట్టారు, కారు పరుగెత్తింది. మధ్యలో వనితలు దిగిపోయారు తరువాత కారు తన బంగళా దగ్గర ఆగింది. తూలుతూ మెడ మెట్లు ఎక్కాడు శివరాం. రాజారావు ప్రక్కనుంచి నడిపించాడు. ఇంటి తాళపు చెవులు రాజారావుకు అందిచ్చాడు. రాజారావు తాళం తీశాడు. ప్రక్కపరిచి పడుకో బెట్టి రాజారావు సెలవు తీసుకున్నాడు.

రాత్రి గాఢంగా నిద్రపట్టింది శివరాంకు. జరిగినదంతా ఒక కలేమో అని భ్రమ పడ్డాడు. తనలో తాను నవ్వుకున్నాడు శివరాం.

కాలకృత్యాలు తీర్చుకుని గబగబ ఆఫీసుకు వెళ్లాలని సిద్ధమయ్యాడు, రాజవ్వ యథాప్రకారం వంట చేసింది. గబగబ రెండు మెతుకులు నోట్లో వేసుకుంటున్నాడు. నల్లపిల్లి మ్యావ్ మంటూ ఎదురుగావచ్చి కూర్చుంది. కొంత అన్నంతీసి దానివైపు గిరవాటేశాడు. ఆ అన్నం తినేసి మెల్లిగా దగ్గరకువచ్చికూర్చుంది. రోజూ నల్లపిల్లి పంక్తిభోజనానికి తయారయ్యేలా వుందనుకున్నాడు శివరాం. తనతోపాటు మరికొన్ని బియ్యం ఉడకబొయ్యవలసిందని రాజవ్వకు చెప్పాలనుకున్నాడు.

ఆఫీసుదగ్గర బస్సుదిగి, నడిచాడు శివరాం. దారిలో నానాస్వామి కనిపించాడు స్నేహితులతో నడుస్తూ. చాలాకాలం తర్వాత కనిపించిన నానాస్వామిమీద మునపటి స్నేహభావం ఒక్కుమ్మడిగా ఉప్పొంగి ఆప్యాయంగా పిలిచాడు శివరాం. క్రొత్తమనిషిని చూసినట్లు ముభావంగా మాట్లాడాడు నానాస్వామి. తాను ఐ. ఏ. ఎస్. ప్యాసయ్యానని త్వరలో ట్రైనింగుకు ఢిల్లీ వెళుతున్నానని చెప్పాడు నానాస్వామి ఆఫీసర్ హోదా అప్పుడే ప్రవర్తనలో చూపిస్తూ. శివరాం అభినందన అందుకోకుండానే నానాస్వామి ముభావంగా తన స్నేహితులతో వెళ్ళిపోయాడు.

నానాస్వామి ప్రవర్తనలో విడ్డూరం కనిపించింది. తోటిస్నేహితులను పరిచయం చెయ్యకపోవడం, తనవైపు వింతమనిషిలా చూడడం శివరాం అవమానపరిచినట్లు బాధపడ్డాడు. అంతస్తులు మారి ఉన్నత హోదాల్లోకి పోయే మనిషి పురాతనపు క్రింది తరగతుల స్నేహితులను మరువ ప్రయత్నించడం సహజమే అనిపించింది సద్భావంతో మునుపటి స్నేహవాత్సల్యంతో మసిలే మనుష్యులు చాలా కొద్దిమంది అనుకున్నాడు శివరాం.

ఆఫీసులో అడుగుపెట్టగానే కంపెనీ డైరెక్టర్ పిలిపించాడు శివరాంను. ఇష్టం వచ్చినట్లు సెలవు పెడితే ఆఫీసుపని కొండంత అవుతుందని తన అనుమతిలేనిదే ఇకముందు సెలవు తీసుకో వీలులేదని గర్జించాడు. ఇలా నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తే ఉద్యోగం ఊడిపోగలదని బెదిరించాడు.

సాయంత్రం అయిదుగంటలయింది. పని చేసిన శ్రమతో టేబిలుమీది ఫైల్సు అలమారుల్లో బిగించి ఆఫీసు విడిచిపోడానికి ఉద్యమిస్తూ, విశ్రాంతికోసం కుర్చీలో కాళ్ళు చాపుకుని ఒరిగాడు శివరాం.

కంపెనీ డైరెక్టరు వెనుకనుంచి రావడం శివరాం చూడలేదు. పొడుగాటి స్పెన్సరు చుట్ట కాలుస్తూ, గర్వంగా ఒక చెయ్యి పంట్లాం జేబులో బిగించి ఠీవిగా నిలుచున్నాడు శివరాందగ్గర.

"ఆఫీసులో అంత నిర్లక్ష్యంగా సాచుకు పడుకుంటావేఁ?" కంపెనీ డైరక్టరు గంభీరంగా గదిమాడు. కంపెనీ డైరక్టరు ప్రవర్తన శివరాంకు చికాకు కలిగించింది. వ్యక్తి స్వాతంత్ర్యం ప్రతినిమిషం అరికట్టాలని యత్నించే డైరక్టరు పొగరు ప్రశ్నలకు సరిగా సమాధానం యివ్వాలనుకుని ధైర్యం తెచ్చుకున్నాడు.

"సాచుకోవడం లేదు...విశ్రాంతి తీసుకుంటున్నా!"

"విశ్రాంతి తీసుకోడానికి యిది యిల్లు కాదు!"

"పనిచేసి శ్రమించిన ఉద్యోగి రోజూ ఆఖరిలో కాస్త విశ్రాంతి తీసుకోడం అతని హక్కు!"

"అప్పుడే ఆఫీసు విడిచిపోతున్నావా?"

"నిర్ణయించిన కాలం అయిపోయింది"

"అంటే గడియారం చూస్తూ కూర్చుంటున్నావా ఆఫీసులో."

"గడియారం తనంతటదే తిరుగుతోంది. నేను చూస్తూ కూర్చుంటేగాని, కదలకూడదనే నియమం పెట్టుకోలేదు గడియారం."

"చాలా పొగరుగా మాట్లాడుతున్నావే?"

"యజమానుల లక్షణాలు ఉద్యోగులు నేర్చుకోవాలిగా!"

శివరాం ఎదురు ప్రశ్నలకు యజమాని కంపించి పోయాడు కోపంతో. తక్షణం శివరాంను ఏమీ చెయ్యలేక రుసరుసలాడుతూ బూట్లధ్వనితో నేల అదరగొడుతూ నడిచి పోయాడు.

ఆఫీసు ఫైల్సులో తలదూర్చుకుని యింకా పనిచేస్తున్న ఉద్యోగులు శివరాం కంపెనీ డైరక్టరుతో పడిన ఘర్షణ విని అబ్బురపడి పోయారు. తమ ఇరవై సంవత్సరాల ఉద్యోగసేవలో కంపెనీ డైరక్టరుతో యింత స్వతంత్రించి మాట్లాడగలిగినవాడే లేడని గుడ్లుతేలేశారు కొంతమంది. నిర్భయంగా స్వతంత్రంగా సమాధానాలిచ్చాడని కొంతమంది శివరాం ధైర్యానికి అభినందనలు యిచ్చారు. ఒక్క ఉద్యోగం అంటిపెట్టుకుని స్వతంత్రబుద్ధి వదలివేసుకుని బానిసగా మారిపోడం తనవ్యక్తిత్వానికే అవమానమనిపించింది శివరాంకు. ఈ బానిస ఉద్యోగం మానుకుని స్వతంత్ర జీవనంగడిపే మార్గం యోచించాలనుకున్నాడు. ★

(ఇంకా వుంది)



"త్వరగా కానీండి; ఇంటావిడ స్నానానికొస్తోంది."
చిత్రం: జె సత్యనారాయణ, బిలాస్‌పూర్.



# వనితాలోకం

నా స్మృతిపథంలో...

# ఆనాటి సంక్రాంతి

మలశ్రీ..

ఇది ఇప్పటిమాట కాదు. నలభై ఏండ్లనాటిమాట. ఈనాటికీ నా స్మృతిపథంలో నిలిచిపోయింది.

సంక్రాంతి అంటే అర్థం ఏమిటనిగానీ, ఆ పండగ విశేష మేమిటనిగానీ వగైరా ఆలోచనలు నాకు లేవు. నేను కొత్తగా కాపురాని కెళ్లిన రోజులు.

అప్పటికి నాకు 18 ఏళ్ళు. ఆ రోజుల్లో కన్న తల్లినీ తండ్రినీ విడిచి ఈడూ జోడూ, తోడూ నీడా అన్నీ మరచి పరాయిచోటికి దాదాపు వలసపోవటమే కాపురమంటే. ఇక ఆ పరాయిచోట ఎవరి కోసమో ఈ వలస... ఆ పరదేశితో అనుబంధాన్నీ, ఆత్మీయతనీ కోరి జీవితమంతా త్రికరణశుద్ధిగా ఆ వ్యక్తితోనే ముడి వేసుకుని భావికాలం గడపాలనే నిశ్చయం మాత్రం తల్లిదండ్రులు కలిగిస్తారు. నాకూ అలానే జరిగింది.

నాటి మా అత్తవారిల్లు ఉమ్మడి నిండుతో కుమ్మడి పంటగా ఉంది. నేను మూడో కోడలును. దాదాపు అభం శుభం తెలియని దాన్ని. నా అనేవాళ్లను విడిచి, నా అనుకో వలసిన వాళ్లదగ్గరకు వచ్చాను.

రోజులు గడిచిపోతున్నయ్. ఇంటి పనులాశ్తై చేతకాని వాజమ్మని. పదిమందినికన్న అత్తగారు మామగారు నన్ను పదకొండవ దాన్నిగానే చూచుకొన్నారు. ఆయన నన్ను చేసికొన్న తర్వాత మద్రాసు వెళ్ళిపోయారు తన చదువు కొనసాగించటానికి. నేనొక విగ్రంగా మరి ఒంటరిదాన్నే.

ఇలా ఉండగా ఒకనాడు మా మూడో ఆడబిడ్డగారు నాలుగో కాన్పుకి పుట్టింటికి వచ్చారు. ఆమె కొత్త సిరిసంపదలుగల ఇంటి కోడలు. ఈ మాట ఆవిడ తప్పిస్తే మర్యెవరూ అంతగా అనుకొనేవారుగాదు. నిష్కారణంగా నామీద ఆవిడ కేదో చిన్న చూపు. అందుకు నేనెంతవరకు బాధ్యురాలనో నాకే తెలియదు. ఆవిడ వచ్చిన మొదటిరోజున ప్రస్తావశంలో నన్ను చేసుకోకుండావుంటే వాళ్ళ తమ్ముడికో మంచి సంబంధం వచ్చేదనీ డాకరు చదువుతున్న వాళ్ళ తమ్ముడికి కట్నంకూడ ఇచ్చేవారని ఆవిడ చెప్పింది. ఆ మాటలన్నప్పుడు ఆవిడ లాంఛనంగా నవ్వింది కూడా ఎమీ అనుకో వద్దన్నట్లు.

అత్తగారు నన్ను తల్లిప్రేమతో చూచేవారు. అమాయకురాలు, పిచ్చిపన్నాసి అని ప్రేమగా అనేవారు. ఆ మాట కోటి దీవెనలుగా ఉండేది. కాని ఆ మాటే ఆడబిడ్డకు చాలాకష్టంగా ఉండేది. ఈ అకారణ వైరం నామీద ఆమె కెందుకో!

*   *   *

కొన్నాళ్ళు అనుభవించాను. ఆలోచించాను. చివరికి తేలిందేమిటంటే నేనాశే కలవాళ్ళపిల్లనుగాదు; వారి అంతస్తుకు తగినదాన్ని కాదు. నేనువచ్చి ఏదో పట్టం కట్టుకొన్నట్టు ఆయింటి కోడలినై సుఖించటం ఆమెకు సుతరామూ యిష్టంలేదు.

మూడు నెలలు గడచినై. అప్పటికి నా పరిస్థితి యింకొక మూడుమెట్లు దిగజారింది. ఆవిడ నూటిపోటి మాటలకీ, మూతి విరుపులకీ, చీదరింపులకీ, చకారగుళ్ళకీ నేను మొదటపడ్డ మధన, తర్వాతపడ్డ తపన నాలో నేనే యిముడ్చుకొని నాతో నేనే చెప్పుకుని, కారేకన్నీటినికూడా గుండెలో నే చిందించుకొన్నాను. బయటికి లేని నవ్వు తెచ్చుకొనేదాన్ని. సాధ్యమైనంతవరకు నవ్వుతూనే ఉండేదానిని. అత్తగారికి చేదోడు వాదోడుగా అన్నిపనులూ సంబాళించుకొనేదానిని. మామగారంటూ ఉండేవారు నన్నుగురించి - చాకువంటిపిల్లనని. నాకెంతో ఆనందమేసేది. ఉండుండి ఎంతో భయమేసేది కూడా. ఆడబిడ్డ వింటే యింకేమైనావుందా అని. ఆవిడకి అసలే మంట. పైగా ఈ మాటలు ఆజ్యం పోసినట్లు!

మరిదిగారి పెళ్లి జరిగింది. అప్పుడు ఆయన కూడా వచ్చారు. బహుశః నా పెళ్ళయిన తర్వాత సరిగా ఆయనని చూడటం అదే మొదటిసారి. అహ ఆవిడలో సరిగా చూడనూ లేదు. పెళ్లి అయిపోయింది. ఎక్కడివా రక్కడికి వెళ్లిపోతున్నారు. ఆయన కూడ మద్రాస్ వెళ్ళే ప్రయత్నంలో ఉన్నారు. నామనసు మనసులో లేదు. మారాం చేస్తుంది. 'అలా నుంచుంటావేం? నువ్వూ కదులు' అంటుంది. 'కదలకపోతే నీకు కష్టాలు తప్పవు' అంటుంది. నాకు నిజంగా భయం వేసింది. మళ్లీ ఆడబిడ్డభయం.

నా భయం నిజమైనదే అని తెలియటానికి మరి మూడురోజులు కూడా గట్టిగా పట్టలేదు. ఆడబిడ్డగారి (ఆవిడ గారి) కంచిపట్టు రవికగుడ్డ చాలఖరీదయినదట. పెట్టినచోట లేదు. పెట్టెలో లేదు. ఎవరు తీసినట్లు? ఆవిడ పరిపరివిధాల పట్టురవికకోసం పరితపించింది. తక్కిన ఆడబిడ్డలతో చెప్పింది నాకెంగుకో అప్రయత్నంగానే భయం వేసింది. యిల్లూ వాకిలీ నేనూ వెదికాను. అదిదొరికితే చాలని మనసులో దేవుడికి మొక్కుకొన్నాను.

చివరికి యిదంతా నామీదకే వచ్చింది. నిర్దాక్షిణ్యంగా యిది దీనిపనే అయివుంటుంది అన్నది ఆడబిడ్డ. ఆవిడ కెందుకో నామీద అంత అనుగ్రహం! నేనేం ద్రోహం చేశాను ఆవిడకి? నా పెట్టె కూడా వెతకటం కూడ జరిగింది. తక్కిన ఆడబిడ్డలూ నమ్మారు. కూతుళ్ళంతా ఏకమై తల్లికి నూరిపోస్తే మరి ఏమౌతుంది. నా పెట్టెలో కనిపించకపోయినా అనుమానం తీరలేదు. అది మరోరూపం దాల్చింది. నేను పెళ్ళికొచ్చిన నాపుట్టింటి వాళ్ళకి దొంగతనంగా యిచ్చి పుట్టింటికి చేరవేశానట! భగవంతుడా! ఏమిటి స్వామీ ఈ పరీక్ష? అంతే బాలో నేను కుమిలిపోయాను.

నా వాళ్ళు సంపన్నులు కాకపోయినా నీతి నియమాలు లేనివారు కారు. నా వల్ల వారి ఆత్మగౌరవం దెబ్బతిన్నది. ఇంతకన్న వేరే శిక్ష ఏమి కావాలి?

మర్నాడు ఆయన బయలుదేరి వెళ్ళిపోతున్నారు. ఆ రాత్రి ఆయన కూడ నన్ను మందలించారు. తానూ బాధపడ్డారు. 'నీలో ఏదో లోపం ఉండి వుంటుంది. లేకపోతే వాళ్ళు నిష్కారణంగా అంటారా?" ఇవి ఆయన మాటలు! ఆక్షణంలో నాసంక్షోభం ఏమని చెప్పను? నేను ఎవరి కోసం, ఎవరి విశ్వాసం కోసం వచ్చానో వాళ్ళే ఆ మాటలంటే నామనస్సెలా వుంటుంది? అంతే ఆ బాధకి భాష లేదు. అది అంతరంగ సముద్ర ఘోష

ఆయన మర్నాడు వెళ్ళిపోయారు మదరాసు.

ఆ తర్వాత ప్రతిరోజూ తోటకూర పురుగుని విదిలించినట్లు కొంకులు పొడిచినట్లు, కారం చల్లినట్లు నాకు గంగవెర్రులెత్తించారు. అనరాని మాటలన్నారు. ఆ బాధలన్నీ భరించాను. అయితే ఇవన్నీ మామగారికి తెలియకుండానే జరిగేవి.

చదువు పూర్తిచేసుకొని ఆయన బెజవాడ వచ్చి ప్రాక్టీస్ పెట్టి నన్ను తీసుకువెళ్ళాలనే ఆలోచనలో ఉన్నారు. అవి సరిగ్గా యివేరోజులు. సంక్రాంతి పండుగ. భాగ్యలక్ష్మితో పాటు వారం రోజులలోకి వచ్చింది పిల్లను తీసుకువెడతామంటూ క్రొత్తగా పెళ్ళయిన తోటి కోడలి తరఫున పుట్టింటివారు వచ్చారు. అలా వాళ్ళే రాకపోతే



సంక్రాంతి సంరంభం

చిత్రం: వి. అచ్యుతరావు.

గా ఆడబిడ్డ మొహం తెల్లబోయింది. ఆమె పెరట్లో అత్తగారి చెవిలో ఏదో చెప్పింది. అత్తగారు 'అవ్వ' అనుకొన్నట్లు నోటిమీద చెయ్యివేసుకొన్నారు. మొత్తానికి తల్లీ కూతుళ్ళిద్దరూ ఏదో ఘర్షణ పడ్డారు.

ఆ తర్వాత మధ్యాహ్నంపూట వడవాలో వెన్న రాస్తుండగా పెద్దవారు అత్తగారు యిలా అన్నారు "అమ్మా! చిన్నదానివైనా నిన్ను జూసి యితరులు ఎంతో నేర్చుకోవాలి" అని. ఏమిటని నేనడక్కుండానే కంట్లో ఆనంద బాష్పాలతో నన్ను చేరదీసికొని ఆ రవికగుడ్డ తానే పెళ్ళిలో తోడికోడలు తల్లికి పెట్టాననీ అది మరచి అనరాని మాటలన్నీ అన్నామనీ పెద్దతనం వల్ల కలిగిన మతి మరపుతో పెట్టరాని కష్టాలు పెట్టామనీ అన్నారు. నాగుండె ద్రవించింది. అశ్రుధారలు వేడిగా

చూసిపోదామని నాన్న వచ్చారు. జరిగిన కథ తెలుసుకున్న మామగారు నాన్నతో చెప్పారట. ఒంటరిగా నాన్న అడిగాడు. 'ఎన్నడూ నాతో చెప్పనైనా లేదేమమ్మా' – నేను తోచకుండా అనేశాను. 'నీమనస్సుకూడా బాధ పెట్టడమే గా నాన్నా' — నాన్నకంట గంగ అవతరించింది. నా తలను అభిషేకించిన ఆ ఆనంద గంగతో తరించాను.

మూడురోజులకు సంక్రాంతి వచ్చింది. ఆయనా వచ్చారు. అత్తగారే చెప్పారు "అది నిర్దోషి. తప్పంతా మాదే" అని. మర్నాడుదయం సంక్రాంతి వెలుగులో ఒకళ్ళ కొకళ్ళం సాక్షిగా వున్న ఒంటరితనంలో 'నిజంగా సంక్రాంతి వచ్చింది' అన్నారాయన. నాటినుంచీ ఎన్ని సంక్రాంతులో వచ్చాయి. కాని జీవితంలో కొత్త క్రాంతిని

# చేటు తెలిసి చేబదుళ్లు...

## (ఇచ్చినా, పుచ్చుకున్నా)

(నిత్యం మనం చేసే తప్పులు..అప్పులు. 'చేబదుళ్లు ఇచ్చేటంత తెలివి తక్కువపని - తీసుకోనేటంత దరిద్రపు అలవాటు యింకోటి లేదు'' అంటారు రచయిత్రి.

అప్పు మితిమీరితే ముప్పు!-గుండెల్లో చింతనిప్పు!! నిజమే...అది నిప్పుతో చెలగాటం!!!

ఋణం చేయటం జీవితావసరానికి ఎప్పుడో ఒకప్పుడు ఎంతవారికైనా అవసరమే అవుతుంది. అది సక్రమంగా తీర్చగలగడం సత్కృత్తు. లోకరీతే అటువంటిది.

ఋణం మనస్సుకి వ్రణంకాకుండా చూసుకోండి. చేబదుళ్ల చేటు...జాగ్రత్త!)

చెబితే చాదస్తమంటారు కాని యీ చేబదుళ్ళు యిచ్చేటంత తెలివితక్కువ పని, తీసికోనేటంత దరిద్రపు అలవాటు యింకోటి లేదంటాను...అమాటంటే "నీవు గజిటెడు ఆఫీసరుగారి భార్యవు కాబట్టి నీకు చేబదులు తీసికోవాల్సిన అవసరం కలగక పోతోంది...మాబోటి మధ్యతరగతివాళ్ళం అవసరానికి అప్పుతీసకోకుండా సంసారాలు యెలా గడపగలం?...అందులోనూ బడి పంతులుగా ఆయనగారు తెచ్చే అరవై రూపాయలతో గడపడం యెంతయాతనో నీకేం తెలుసుంది?..." అంటూ నిత్యజీవిత అవసరంలో "అప్పు"అనే పదానికున్న విలువను అతిసూక్ష్మంగా చెప్పాననుకుంటూ ఓ విసురు విసిరింది మా పక్కింటి పంతులు గారి భార్య...నిజమే!...మనిషికి మనిషి తోడంటూ లేకపోతే యీ ప్రపంచంలో మనం మనగలమనటం కొంచెం అతిశయోక్తే! అలాగని కేవలం మనిషికి ప్రతిమనిషి ప్రతి నిత్యం అవసరంలో ఆదుకుంటున్నాడని చెప్పలేం!...అసలింతకూ యిదంతా ఎందుకు చెప్పొచ్చాననంటే ..యీ చేబదుళ్ళతో ఉన్న స్నేహాలు కాస్త ఊడిపోతున్నాయి. మగాళ్ళకి మగాళ్ళకి యిలాంటి బదుళ్ళుయిచ్చి పుచ్చుకోవడాలు యెంతవరకు ఉన్నయో కాని కొంపల్లో ఆడవాళ్లుచేసే యీ చిల్లర మల్లర అప్పులు చూస్తే తగని-చిరాకుపుడ్తుంది. కేవలం నాకు అప్పుచేయాల్సిన అవసరం కాని, చేబదులు చేయాల్సిన అగత్యం కాని కలగపోయినంగువల్ల వ్రాస్తున్న విషయాలు కావివి...నాకు యీ చేబదుళ్ళతో కలిగిన రెండు మూడు సంఘటనలతో యిలా విసిగెత్తి వ్రాస్తున్నాను చేబదులు తీసికెళ్ళేవారు సమయాసమయాలుకూడా ఆలోచించరేమో నని అనిపిస్తోంది!...లేకపోతే యేమిటి చెప్పండి...మధ్యాహ్నం ఆయన గారికి కాఫీ పెట్టి యిద్దామని, చేసిన ఫలహారం ప్లేటులో పెట్టి ఆయనదగ్గరకు తీసికెళ్లాను... అంతే! యింతలోకి పక్కింటి పార్వతమ్మ గారు "బుట్టెడు బొగ్గులుంటే బదులు యిస్తారా! శాంతారమ్మగారూ!..." అంటూ జంకూ గొంకూ లేకుండా నొక్కొకని సరాసరి గదిలోకి ప్రవేశిస్తూనే అడిగింది. మగాళ్ళల్ని చూడగానే నాలికకరచుకుని గభుక్కున బయటకెళ్ళిపోయింది...ఆయన

### శాంతిశ్రీ శ్రీమతి

తెగవిసుక్కున్నారు అయినవాళ్ళకి, కాని వాళ్ళకి అంత స్వతంత్రం, చనువుయిస్తున్నావని. నేనేంచావను?...ప్రక్కింటివాళ్ళు కదాని అప్పుడప్పుడు వాళ్ళతో కబుర్లాడడం తప్పా?...మరీ అంత పొరుగింటితో సంబంధం పెట్టుకోకపోతే 'గజిటెడు ఆఫీసరు గారి భార్య' అని ఆవిడకు ఎక్కడలేని గర్వమూ?...కాకపోతే అంతయిదా, పక్కనే ఉన్నాంగా!...ఓసారి పలకరిస్తే తప్పా?...ఆవిడగారి నోటిముత్యాలేం రాలిపోతాయా?"అంటూఆడిపోసుకుంటారాయె అందరూ!—ఎలా చచ్చేది? అందుకని అప్పుడప్పుడు యిరుగు పొరుగు వాళ్ళని పోసుచేసి కబుర్లాడుతున్నమాట వాస్తవమే! అయినంత మాత్రాన వాళ్ళకోమాత్రం లోకజ్ఞానం ఉండద్దూ!—కాఫీలు త్రాగేవేళ ఆయన యింట్లో ఉంటారేమో!...మనం వెళ్లటం అంత మంచిదికాదు" అని ఆవిడగారికి తోచదూ! పోనీ అది తెలియకపోయినా అంత స్వతంత్రంగా లోపలికి వచ్చేయడమేనా? అదేమంటే మనల్ని దొంగలక్రింద

మాస్తోందట్రా ఆవిడగారు ... అందుకే గది లోకి కూడా ఆడుగు పెటనివ్వడంలేదు' అని లేనిపోనివి చెప్పుకుంటారు. ఆ పార్వతమ్మ గారి వరస యేం బావుంది చెప్పండి! ఆవిడ

ఎప్పుడూ ఇంతే—15 శంకర్



# ★ చేయితెలిసి చేబదుళ్లు... ★

గార్కి బుట్టెడుబొగ్గులు కావాలిటచేబదులు.. అంతకన్నా యింకోవస్తువు దొరకలేదు అవిడకు అప్పు అడగటానిక్కి! పైగా అడిగే టప్పుడు మొహమాటం, సిగ్గూ యివేం ఆలోచించరు! తెల్లారకుండ బొగ్గులకి కబురు పంపే యింకో ఆవిడ ఉంది!...ఆవిడది మరీ విచిత్రం "మా నాన్న బెజవాడ వెళ్లాడు, వచ్చాక బొగ్గుల బస్తా వేయిస్తానన్నాడు... అందుకని అందాక మీయింట్లో బొగ్గులుంటే ఓ డబ్బాడు పంపించమంది మా అమ్మ" అంటూ ఓ అయిదేళ్లో ఏడేళ్లో ఉండే అమ్మాయినిపంపేది తెల్లారకుండా ఆవిడగారు. నాకు నవ్వాలో యేడవాలో అర్థమయేది కాదు. పైగా ఆవిడగార్కి బొగ్గులు (అవేనా ఉంటే సరే... లేకపోతే అక్కర్లేదు అని అర్థం కాబోలు) పంపించాలట. ఇక్కడ చేతినిండా నౌకర్లు ఉన్నారని గాబోలు... యిలా ఉంటాయి కొంతమంది వరసలు. పోనీ వాళ్ళతో నిష్కర్షగ చెప్దామా అంటే ఏమని చెప్తాం? సాటివాళ్లు! కాస్తో కూస్తో వాళ్ళే గ్రహించుకోవాలి గాని! పోనీ యీసారికి యిచ్చేసి వచ్చేసారి యిక లేదని చెప్దామా అంటే నాకే నోరు చెల్లదు అయినా ఊరికే దానం చేసినట్లు యివ్వటం లేదుగా! అప్పుగానేగా – అంటే తిరిగి తీసేసుకుంటావుగా. దానికింత బాధెందుకు?" అని మీరనవచ్చును. రైటే! అప్పుగా నేయిస్తున్నాను... ఏదో యింత ఉందకాబట్టి నలుగురికి అలాంటి యిబ్బందుల్లో సహాయపడతాననే ఆశిస్తున్నారంతాను – అయితే ఆతిరిగియివ్వడంలో ఉన్న తిరకాసు మీకు చెప్తే కొంత అర్థమవుతుంది మాయింటికి ఎదురుగా ఒస్కూలు మేష్టరుగారు ఉన్నారు. ఆయనకు పాపం అయిదుగురు సంతానం. అందులోనూ కవల పిల్లలు. వారానికొకసారి ఆవిడవచ్చి రెండేసి మరకాల బియ్యం అప్పుగా తీసికెళ్ళేది. మావారు మంచి ఒకటో నెంబరు బియ్యం ముందుగానే తెప్పించి ఒబస్తా యింట్లో పడేయించేవారు. పాపం పిల్లలు గలదిగదా అని ఆవిడ అడిగినప్పుడల్లా లేదనకుండా యిస్తూ వచ్చాను. అలా అలా పది మరకాలదాకా యివ్వాల్సి వచ్చింది. అడగటానికి నాకు సిగ్గు అనిపించింది. ఓనాడు అనుకోకుండ మా యింట్లో బియ్యం నిండుకున్నాయి. అప్పటికి ఆయనగారు బస్తా వేయించి యిరవై రోజులే అయింది...ఆయనగారితో చెప్తే అప్పుడే అయిపోయాయా" అని హడావిడి చేస్తారని నౌకరుని బజారుకు పంపించి తెప్పిద్దామనుకుంటున్నాను... ఇంతలో అదృష్టవశాత్తు ఎదిరింటి ఆవిడే బియ్యంబాకీ తీర్చడానికని వచ్చింది. "రెండు మరకాలు తెచ్చానండి! మళ్ళీ ఇంకో రెండు రోజుల్లో యింకో రెండు మరకాలు తీర్చేస్తాను" అంటోంది. నేను బ్రతుకు జీవుడా అంటూ ఆవిడ మాటలు వినకుండా నే వెంటనే ఆ బియ్యం అందుకుని డబ్బాలో పోసి ఆవిడను సాగనంపాను. గబగబాబియ్యం కడిగి వంటచేసి ఆయనగార్కి వడ్డించాను... ఆయనగారు విస్తరి ముందు కూర్చున్నాక కాని నేను అన్నంకేసి చూడనేలేదు... ఏముంది?...ఆ బియ్యం తప్పుడు బియ్యం కన్నాక నాకషం. చాలా ఖండాలంగావుంది



—NVKR

అని లోపల భయపడి చచ్చాను." అయినా క్షేత్రమెరిగి విత్తనము పాత్రమెరిగి దానము అని ఏదో సామెత వున్నట్టు మనుష్యులను బట్టి బదుళ్ళివ్వాలంటే నేర్చుకో అంటూ మా వారు నవ్వుతూ మెత్తగా చివాట్లు వేసి మజ్జిగ అన్నం తిని వెళ్ళిపోయారు. నాకూ ఏడుపూ వచ్చింది... కోపమూ వచ్చింది... ఆయన భోంచేసి ఆఫీసుకు వెళ్ళిపోగానే ఎదిరింటి వాళ్ళ ఇంటికి వెళ్ళాను.. వాళ్ళ పిల్లలు భోంచేస్తున్నారు. వాళ్ళ కంచాల్లోని అన్నం మీద పడింది నా దృష్టి. తెల్లగా చక్కగా మల్లెపూవులా ఉంది ఆ అన్నం...దాన్ని బట్టి అర్థం చేసికొన్నాను. మా వారి మాటల్లోని అంతరార్థం...ఆవిడగారు బదులు తీర్చిన వరుకులోని రహస్యం.. ఇలాఉంటాయి బదుళ్ళు తీర్చే కొంతమంది తంతు...ఇంతకన్నా ఇంకో రకమున్నారు...బదులు తీసికెళ్ళినా అసలు తీసికెళ్ళినట్లే గుర్తున్నట్లు కూడా మాట్లాడరు. ఇంతా ఎందుకు ప్రాణం తీసే చేబదులు ఇస్తే వచ్చిన చిక్కులు చెప్పడానికి.

ఆ మర్నాడు మా వారు క్యాంప్‌కి వెళ్ళారు... వారం గడిచింది. వస్తానన్న టైముకి రాలేదు. ఇంట్లో అన్నీ ఉన్నాయి. తిండి విషయం బట్ట విషయంలోనూ లోటు లేదు. ఒక్కొక్కప్పుడు మనకి ఎలాంటి అవసరం కలుగుతుందో మనకే తెలియదు. ఆ రోజు ఆయన ఇంకా క్యాంప్‌నుంచి రాలేదేమా అని ఆలోచిస్తూ పనిచేస్తున్నాను నీళ్ళు తోడుతుంటే చెయ్యిజారి బాల్చీ నూతిలో పడిపోయింది ప్రక్కింటి పార్వతమ్మ గారి ఇంట్లో గేలం ఉందని తెలిసి నౌకర్ని పంపిస్తే నిర్మొహమాటంగా లేదని సమాధానం చెప్పారు. అంతకన్నా ఘోరం "మీ అమ్మగారు మొన్న చేమంతిపూలకి పావలా తీసికొన్నారు ఉంటే పంపించమను అని ఎదురు కబురు పంపింది...ఆమాట విని నేను కొయ్యబారిపోయాను!... ఇదేమిటి పార్వతమ్మ గారూ!...పావలా యివ్వాలన్నారట... అన్నాను అక్కడికీ ఒళ్ళుమండి గోడదగ్గిర కెళ్ళి ఆవిడని పిలిచి...

'అదేమిటండీ! అలాంటారు మొన్న చేమంతి పూవులు వచ్చినాడు చిల్లర లేదంటే మీ పూవులవాడికి డబ్బులు నేనే యిచ్చాను... మర్చిపోయారా!...పోన్లెండి!......ధర్మం చేసే యివ్వండి!..." అంటూ నలుగురూ వినేలా గట్టిగా అరచింది ఆవిడ. "మర్చిపోయానేమో లెండి!" అంటూ గభుక్కున గోడదగ్గర్నుంచి యివతల కొచ్చి పావలా తెచ్చి పంపాను నౌకరు చేత చేసేది లేక...

చేబదుళ్ళు తీసికోవటం, యివ్వటం అలవాటు చేస్తే యిలాగే ఉంటాయేమో పరిణామాలు అని భయమేస్తోంది నాకు. ఏది యేమైనా చేబదుళ్ళు యివ్వడంలోనూ, పుచ్చుకోవడంలోనూ చాల సాధకబాధకాలున్నాయి. మనుష్యుల స్వభావాల మీదే ఆధారపడి ఉంటాయి. అంటారు మావారు [illegible]

# అనూరాధ డైరి

బాగాయిదో వింత మనస్తత్వం - సామాన్యంగా మగవారిలో - అందులోనూ పెద్దవాళ్ళలో ఉండని విచిత్ర మనస్తత్వం ఆయనలో ఉంది.

తన పిల్లలంటే ఆయనకు అపరిమితమైన అభిమానం, ఎవరు కాదంటారు. కాని ఆ అభిమానం కొద్దీ ఆయన చేస్తున్న తప్పల్లా ఒక్కటే. తనకు తనే అన్యాయం చేసుకుంటున్నాడు. పెళ్ళిళ్ళయి కాపురాలు చేసుకుంటున్న ఆడపిల్లలు పుట్టిళ్ళకి పుణ్యానికని వచ్చి నెలల తరబడి యిక్కడే వుంటారు గంపెడు సంసారం కావటంతో ఏవేవో పొరపాట్లూ, పొచ్చాలూ తప్పవు. అందులోనూ ఆ పెద్దపిల్ల అంటే ఆయనకు చెప్పలేని అపేక్ష. ఆవిడని దగ్గిర కూర్చోపెట్టుకుని ఇరవై నాలుగు గంటలూ చాడీలు చెప్పించుకు వినడం ఆయన పని తల్లిమాట కూతుళ్ళూ అంతే- మొగుళ్ళతో కాపురాలు చేసుకోవలసినవాళ్ళు ఏమిటి పుట్టింట్లో చేరి పితూరీలు-! ఒక్కొక్క సంసారం చూస్తుంటే ఎన్నెన్ని గమ్మత్తులుంటాయో! ఈయన పెద్దవాడు కదా ఎవరి క్షేమం కోరి నట్లు? వాళ్ళు చెప్పినవన్నీ నమ్ముతాడు - స్వయంగా ఆలోచన నేది శూన్యం.

గురువిందగింజలతో వేగటం కష్టం. ఎర్రగా ఉన్నామని 'చక్కని ముక్కులం- అందాల తునకలం' అని మురిసిపోతాయి. నలుపు మే...ఎదుటవాళ్ళని వేలెత్తి చూపించడం...ఇదెక్కడి అన్యాయం! బాబాయి మూడోకూతురు ఏమి తిప్పలు పెట్టేది మొన్నటి దాకా! వాళ్ళ ఆయన ఏదో పెద్ద తల్లక్రిందులు చేస్తున్నట్లు అతిశయంతో దానికి కిందూమీదూ తెలీలేదు. చివరకి అడ్డమైన వాళ్ళని అడిగి అప్పులుచేసి, ఎదటివాళ్ళని అప్పులపాలు చేసి ఎరుగున్న నలుగురి చేతా 'ఛీ' అనిపించుకుని పెళ్ళాంబిడ్డల్ని పుట్టింటి నట్టింటోపడి యేడవమని - తనెక్కడున్నాడో? - ఏం చేస్తున్నాడో కూడా తెలీదు. ఆ మహాతల్లికి ఇటువంటి అనుభవాలు ఓ పక్కనుంచి అవుతున్నా ఏం చూసుకున్న ధిలాసానో తెలీదు. నీటూ, గోటూ విసంత తగ్గలేదు. తనమొగుడు అందగాడని, మొనగాడని విర్రవీగింది పాపం - అయినా నాకు తెలీక అడుగుతాను. తన మొగుడి అందం లోకానికి ప్రకటించాల్సిన అవసరమేమిటో ఆ పిల్లకి! మంచిబుద్ధులు. మట్టిబుర్రలు - పోనుపోను స్త్రీ సంస్కారం కనిపించదు.

గసిగలు చెప్పడంలో బాబాయికూతుళ్ళు 'బాబోయ్' అనిపిస్తారు.

పాపం బాబాయిగారిల్లు 'ఇన్‌ఫర్మేషన్ బ్యూరో' అయిపోయింది.

అయినా వాళ్ళకున్న అతిశయం ఏమను కోను? ఎదటివాళ్ళను ఎద్దేవా చెయ్యడంలో వాళ్ళు సిద్ధహస్తులు. అసలు అందుకోసమే వాళ్ళు పుట్టారు మరి కారణజన్ములే! పాపం న్యాలా! గురివిందగింజ నలుపెరగదంటారే అలాగే వాళ్ళ మచ్చ వాళ్ళకు తెలియదు.

ఓసారి అమ్మవాళ్ళింటికెడితే బాబాయి కూతురు రెండోపిల్ల కాబోలు-(ఇలా రెండో పిల్ల-మూడోపిల్ల అనడంకన్నా వాళ్ళ అతిశయానికి అనుగుణంగా రెండో అంతస్తు మూడో అంతస్తు అనాలి) అన్నదిట 'దొడ్డమ్మా! నీవు నైలాన్‌లూ షిఫాన్‌లూ కట్టుకో బాగుంటాయి' అని అటువంటిది ఆవిడ 'అంతస్తు'. అమ్మ ఎంత బాధపడ్డదో ఆమాటకు. ఎన్నడైనా నైలాన్‌లు కట్టిందా అమ్మ - హొయలు పోకలూ చేసుకుందా లేదే! తన తల్లితో పాటే ఉన్నదే- సరి ఎందుకు కాదంటున విధించాలి ఆ వృద్ధనని ధేయురాలు!

నే నేకున్నాను. వాళ్ళ అమ్మను ఎన్నడైనా పల్లెత్తుమాట ఇలా అన్నానా? నేను వాళ్ళ అమ్మను ఏ పూజ్యభావంతో చూస్తానో తనకో కనీసపు బాధ్యత లేదా? చేసిన తిప్పలు వంటివో ఆ 'అంతస్తు'కు ఈ జన్మలో తెలుస్తుందా.

ఇటువంటి ఎదురుమేనలమ్మ బాబాయి కోడలు! చదువూ సంస్కారంగలపిల్ల! అభిమానం, శౌర్యంగలపిల్ల! మాట పడనిమానవతి. బాబాయికొడుకో కజెంధరుడు... తన పైసాకులోటు లేకుండా నిటుపోకుండా ఉంటేచాలు. ఆమె సంగతి ఆట్టే పట్టించుకోడు. ఆమె శారీరక ఆరోగ్యంతో తృప్తి పడతాడే గాని. మానసిక బాధపట్టించుకోడంటే నాకే జాలి వేస్తుంది. ఈ సంసారాల్లో ఇటువంటి నికృష్టపరిస్థితులు ఇలా ఉండిపోవలసిందేనా...మంచికాలం రాదా - వ్యక్తిగా ఎవరికి వారు స్వతంత్రులై సాంఘిక ధర్మానికి మాత్రం కట్టుబడి కాలంగడిపే సంక్రాంతి రాదా...

అన్నట్లు సంక్రాంతి పండుగ కాబోలు. ఆనాడైనా వదిన మంచిగాఉంటే పండుగ నిండూ ఆనందం ఉంటాయి. నాపిచ్చిగాని ఆవిడమాత్రం అలా అనుకోదా ఏమిటి.

ఇందు గల డందు లేడని సందేహము వలదు అంటూ ధైర్యంగా చెప్పినవారూ ఉన్నారు;

ఉన్నావా? లేవా?—అంటూ ఉన్నాడో లేడో తెలియని ఆయన్నే ముఖాముఖిగా అడిగేసినవారూ ఉన్నారు;

జగదీశ్వరు డంటూ ఒక డున్నట్టూ లేనట్టూ అని అనుమానించిన వారూ ఉన్నారు.

లేడు అని క్లుప్తంగా తేల్చిపారేసినవారూ ఉన్నారు—ఆలోచించకుండా. నమ్మిక లేకపోయినా ఉన్నాడు అని ఒప్పేసుకున్నవారూ ఉన్నారు—ఎందుకైనా మంచిదనీ, ఏమో మనకెందుకనీ.

ఇన్ని వాక్యాలకీ కర్త అయిన 'వాడి' గురించి, ఈ మాటలు ఏనాటినుండో వినబడుతున్నాయి. సాక్షాత్తూ శ్రీరాముడికే 'దేవుడూ లేడు, దెయ్యమూ లేదు.' అని చెప్పాడట ఒకాయన.

మరి ఈ విషయంపై మహర్షులు, మహా వేదాంతులు, పండితులు ఎందరెందరో ఎన్నెన్నో వాదనలు చేశారు, చేస్తున్నారు. చేస్తూనే వుంటారు... దేవుడు ఆదిమధ్యాంత రహితుడు అని పెద్దలు చెప్పగా విన్నాను. ఈ చర్చ కూడా అలాంటిదే. దీనికి తుదీ మొదలూ లేదు, అంతు చిక్కదు.

ఈ అన్వేషణలో కొందరు అసలు సంగతేదో తెలుసుకున్నా మనుకుంటున్నారు. కొందరు తెలుసుకోలేక పోయి తప్పుకుంటున్నారు. తెలుసుకోడానికి భయపడుతున్నారు. తెలుసునని తమని తాము నమ్మించుకొంటున్నారు. దోబూచులాడుతున్నారు. ఆత్మవిశ్వాసం పెరిగినపుడు దేవుడు లేడంటున్నారు. తిరిగి కష్టాలు కమ్ముకొచ్చినపుడు ఉన్నాడంటున్నారు. నాస్తికులు ఆస్తికులను చూచి మూఢులు అనుకుంటున్నారు. ఆస్తికులు నాస్తికులను చూచి అజ్ఞానులు అనుకొంటున్నారు. పెద్దవాళ్లు వ్రాసిన పుస్తకాలు చూచీ, చెప్పే ఉపన్యాసాలు వినీ, కొందరు కంగారు పడుతున్నారు, భయపడుతున్నారు. అపుడు మహాపురుషులు అవతరించి ధైర్యం చెబుతున్నారు. ఇది అనంతమైనది. అంతులేనిది.

ఇటువంటి పెద్ద విషయాలపై మాట్లాడగల శక్తిసామర్థ్యాలు నాకు లేవు లేవనీ తెలుసు. కాని, సామాన్య మానవుడిగా నాకు కూడా వీటి గురించి—అందినంతవరకు ఆలోచించుకోగల అధికారం వుంది. అవసరమూ వుంది. ఎందుకంటే ఆస్తికుడికైనా నాస్తికుడికైనా అట్టైనా ఇట్టైనా విశ్వాసం (Conviction) అనేది వుండాలి.

ఒక మిత్రుడు ఒకసారి ఈ విషయమై ప్రశ్న వచ్చినపుడు ఒక ఆంగ్లకవి వ్రాసిన ఈ మాటలను చెప్పాడు.

I am the captain of my soul.
I am the master of my fate.

(నా ఆత్మకు నేనే కర్ణధారిని. నా కర్మకు నేనే కర్తను.)

ఆయన నిజంగా చాలా ధైర్యశాలి. ఆత్మవిశ్వాసం గలవాడు. ఇంత చక్కని మాట విన్నందుకు నేను చాలా సంతోషపడ్డాను. మొత్తానికి ఏదో ఒకవిధంగా నమ్మకం వుండాలి గదా. నమ్మి చెడినవారు లేరు గురి.

ఉన్నాడనుకుంటే ఆయనని నమ్ముకోవచ్చు. లేడనుకుంటే మనల్నో, మనోశక్తినో, నమ్ముకోవచ్చు. తాడు తెగిన గాలిపడగలా తేలలేము గదా. నమ్మిక ఉండాలి. దైవం, స్వర్గం, నరకం ఇవన్నీ ఉన్నాయన్న నమ్మకంవల్ల మానవులలో పాపభీతి ఉండి ఒకరొకరిని హింసించుకోకుండా వుంటారని పెద్దలు చెప్పారు. ఐతే దైవభీతి లేనివాడికీ పాపభీతి ఉంటుంది. వాడికీ పవిత్రమైనది, పూజనీయమైనది ఉంటుంది. వాడికీ నీతి నియమాలు ఉంటాయి. ఒక స్వర్గం, ఒక నరకం ఉంటాయి. వాడిని వీడనికూడా నడిపించేది—దేవుడు ఉండడం, ఉండక పోవడం కన్న, ఉన్నాడా లేడా అన్న నమ్మకం, దాని బలం. దేవుడు నమ్మకాన్ని బట్టే కనిపిస్తాడంటారు—రాముడుగా, కృష్ణుడుగా, అల్లాగా, అమ్మవారుగా క్రీస్తుగా... నాకు తెలీదు. ఈ విశాల విశ్వాన్ని పరిపాలిస్తున్న దేవరో. రాముడో, అల్లావో, క్రీస్తో, ఓంకారమో. ఒకటిమాత్రం నమ్ముతాను. అంతటినీ పాలించి నడిపించే మహత్తరశక్తి—మానవుడి బుద్ధికి అందనిదేదో ఒకటి ఉంటుంది. అదేదో తెలీదు. తెలియని దానిని, తెలియగలిగినదానిని తెలుసుకోవాలని తపనకొద్దీ; నా బుద్ధికి తోచిన పద్ధతిలో నేను ప్రయత్నిస్తాను. నాకు అన్నవస్త్రాలిచ్చి, అపారమైన ఆనందాన్ని ప్రసాదించే విద్యలోనే, దాని శక్తిలోనే నేను ప్రపంచపాలకుడిని—ఆ శక్తిని చూడాలని కృషిచేస్తాను.

గణితశాస్త్రజ్ఞుడిని భగవంతుడెవరు అని, సత్యమేది అని అడిగితే స్క్వేర్ రూట్ ఆఫ్ మైనస్ వన్ కనిపెట్టండి అక్కడ దొరుకుతుంది అంటాడు. గాయకుడిని నీ దైవం స్వర్గం ఎక్కడ అని అడిగితే సప్తస్వరాలలోనూ అని చెప్తాడు. చిత్రకారుడిని అడిగితే రంగుల సంయోగంలో ఎక్కడో దాగి ఉన్నాడు అంటాడు. దైవాన్ని అన్నిటా చూడవచ్చునన్నారు.

గుణమే దైవము. తల్లియే దైవము...తండ్రియే దైవము...ప్రేమయే దైవము...సత్యమే దైవము ... ఆనందమే దైవము. ఆనందం, ఆలోచనవల్ల, ఆరాధనవల్ల సిద్ధిస్తుంది. ఆరాధించేది ఏవిశ్వాసాన్ని అయినా కావచ్చు. ఏవిద్యనైనా కావచ్చు. సంగీతం, నృత్యం, నటన...

నా స్వంత వేదాంతాన్ని ఇక్కడ పేజీల కొద్దీ వ్రాయడం నా ఉద్దేశ్యం కాదు. నా వృత్తి నటన. సినిమాలో నటన. సినిమా అనేది లక్షలాది ప్రజల వినోద వికాసాలకు సాధనం, అందువల్ల చలనచిత్ర కళాకారులలో ఒకడుగా, నా జీవితానికి, జీవనానికీకూడా ఉపాధి, దైవం అయిన నా వృత్తివిద్యను గూర్చి, నేను పనిచేసే చోటు నా పాలిట స్వర్గం అయిన సినిమా పరిశ్రమగురించి, అభిమానులతో మాట్లాడుకోవడమే.

సినిమాను స్వర్గంతో పోల్చడ మేమిటని కొందరు అనవచ్చు. సినిమాగురించి అపోహలు గలవారూ, సినిమా వారిపట్ల చులకన భావం గల వారూ ప్రతిఘటించవచ్చును. సినిమాలో నీతి నిజాయితీ లేవనీ, ఒకరినొకరు వంచించుకొంటూ, పోటీలుపడుతూ ఒకరిమీద ఒకరు ఈర్ష్య పడుతూ ఉంటారని నమ్మి, పవిత్రమైన స్వర్గాన్ని దీనికి సామ్యం చెప్పావని ఆ అపోహవల్ల ఆగ్రహించవచ్చు.

కాని ఒకమాట. కొందరు విమర్శచేసినంత పతనావస్థలో సినిమా లేదు. ఇక్కడ ఉన్నన్ని గొప్పవిషయాలు, గొప్పబుద్ధులు ఎన్నోచోట్ల లేవు. అయితే ఇక్కడ లోపాలనేవి లేవని నేను అనటంలేదు. లోపాలు ఎక్కడయినా ఉంటాయి. లోపాలు లేకపోతే, మంచిగుణాలకు విలువేముంటుంది గనక.

ఆ మాటకు. పురాణాలు వర్ణించిన స్వర్గలోకంలోనే లోపాలున్నాయి. మహనీయులైన దేవతలలోనే లోపాలున్నాయి శ్రీమహావిష్ణువు—లోకకల్యాణం కోసమే కానియ్యండి—దుష్టశిక్షణకే కానీయండి—మాయవేషాలూ మారువేషాలూ వేయవలసివచ్చింది. తపస్సుచేసి, యుద్ధాలుచేసి, గొప్పవాడొకడు స్వర్గానికి బయల్దేరవచ్చే ప్రమాదం ఉన్నపుడల్లా ఇంద్రుడు తన పదవి కాపాడుకోవడానికి ఆ వచ్చే పెద్దమనిషికి తపస్సుభంగం అయ్యే ఏర్పాట్లు చేసినట్లు చెప్పారు. ఇలాగ దేవతలనేకులు, ఏవేవో కారణాలవల్ల అప్రమత్తులు అయినందువల్ల శాపాలు పొందారు.

నారదుడు కలహాలు కల్పించి, లోకకల్యాణానికి ముఖ్యమైన మహత్కార్యాలు జరిపించాడు. మరి స్వర్గాన్ని దైవాన్ని నమ్మేవారు ఇవన్నీ చూసి దేవతలను పూజించడం మానేస్తున్నారా? ఇంద్రుడిని గౌరవించడం మానేశారా? అలా ఎవరూ చెయ్యరు.

# దైవం స్వర్గం

చెయ్యలేరు ఇంద్రుడైనవాడు ఆ పదవికి రావడానికి ఎన్నో ధర్మాలు, యాగాలు చేయాలంటారు. అతడు మహాపురుషుడై ఉంటాడు. సద్గుణాలకు నిధి అయి ఉంటాడు. పరాక్రమశాలి అయి ఉంటాడు. అన్నీ గొప్ప లక్షణాలు. గుణాలు ఉన్నవాడవల కొన్ని పొరపాట్లు జరిగినా అతడిలో కొన్ని లోపాలు ఉన్నా అతడు పూజనీయుడే.

అసలు లోటులేని దేదీ ఉండదు. మంచివాళ్లు-చెడ్డవాళ్లు అని ప్రత్యేకించి ఎవరూ ఉండరు. మంచిచెడ్డలు పరిస్థితులమీద ఆధారపడి ఉంటాయి. కొన్ని లోపాలూ అంతే చూచేవాడినిబట్టి ఉంటాయి.

* * *

సినిమాను స్వర్గంతోనూ, ఇందులో వ్యక్తులను అందులో ఇంద్రాది దేవతలతోనూ, పోల్చి చూసుకుంటే పోలికలు చాలా కనిపిస్తాయి-సంతోషించతగినవీ- తగనివీకూడా.

సినిమా స్వర్గంకన్న గొప్పది కాదు. అంచేత అక్కడా లోపాలు ఉంటాయి.

అసలు స్వర్గనరకాలనేవే వేరే ఎక్కడో ఉంటాయనుకోవడంకన్న, నిత్యం మనతోనే మనలోనే ఉంటాయని నమ్మడం మనం సంతోషంగా జీవనం సాగించి, యథాశక్తిన ఇంకొకళ్ళను సంతోషపెట్టడానికి అవకాశం కల్పిస్తుందని నేను అనుభవంమీద తెలియచెప్పుతున్నాను. నేను ఆరాధించే విద్య, దానిమీద నాకు ఉన్న విశ్వాసం నాదైవం కాబట్టి, నాస్వర్గం నరకంకూడా ఈ నాదైవాన్ని అనుసరించే ఉంటాయి. ఈదైవ పాలనలోనే ఉంటాయి. నాతోను, నాలోను, నాచుట్టూరానూ ఉంటాయి. నేను నిత్యం పనిచేసు తిరిగేదే దేవభూమి. అందులో స్వర్గనరకాలు నా మనస్థితినిబట్టి, నా దృష్టినిబట్టి, నేను ధరించే రంగుటద్దాలనుబట్టే వుంటాయి.

నేను సెట్ మీద ఒక పాత్ర నిర్వహిస్తు ఉన్నపుడు-ఒక పాట్‌లో శ్రద్ధానములతో శక్తివంచనలేకుండా నటిస్తున్నపుడు నేను ఆక్షణంలో ఆపాత్రకు న్యాయం చేకూర్చగలుగుతున్నాననీ,అందులో పూర్తిఫలితాన్ని సాధించగలుగుతున్నాననీ అనిపిస్తే—

అదే నాకు స్వర్గసుఖం ప్రసాదిస్తుంది. ఆ క్షణంలోనే నేను, భాషలో వాక్యాలలో చెప్పలేని ఆనందాన్ని అనుభవిస్తాను. ఆనందో బ్రహ్మ అని పెద్దలు చెప్పారు. నాకు ఆక్షణంలో కలిగే ఆనందమే ఈశ్వర సాక్షాత్కారం. అదే నేను నమ్మిన దైవం నేను ఆరాధించే దైవం. ఆ దైవం తర్వాతే నే నాకు మిగతావన్నీ.

నేను ఒకటి ఒక రోజున సెట్ మీద ఒక పాత్రకు శ్రద్ధ కుదరకగాని, చేతగాకగాని—

నేను సరిగ్గా నటించలేకపోతే, నే నాశించిన ఫలితం లభించకపోతే నటన నాకు తృప్తి కలిగించకపోతే—

నేను పడే క్షోభ చెప్పరానిది. అదే నాకు నరకం పురాణాలు వర్ణించే నరక బాధలు నాకు ఆ క్షణంలో అనుభవమవుతాయి. నన్ను నేనే విమర్శించుకుంటాను నాకు తృప్తి కలిగి సబబు అనిపించేదాకా నటించడానికి కృషిచేస్తాను.

* * *

అలా అయితే, నువ్వు నటించిన పాత్రలు అన్నీ లోపాలు లేకుండా సంతృప్తికరంగా ఉన్నాయా? అని మీరు అడగవచ్చు. ఆ విషయం నిర్ణయించవలసినవారు మీరే అలాగని నేను సమాధానం చెప్పక తప్పించుకుంటున్నాననుకోకండి. నేను ధరించిన పాత్రలలో లోపాలు ఉన్నమాట నిజమే. నలుగురూ బాగుందని మెచ్చుకున్న పాత్ర నిర్వహణలో నాకు నచ్చని సంగతులూ ఉన్నాయి; నలుగురు విమర్శించిన పాత్రలలో నాకు చాలా తృప్తి కలిగించినవి ఉన్నాయి.

లోపాలు ఉన్నాయని, తెలిసి కూడా ఊరుకోవడం, ఆత్మవంచన, పరవంచన కాదా? నీవు దైవం అని చెప్పుకొంటున్న విశ్వాసాలను త్రోసి రాజనడం, దైవవంచన చేయడం కాదా? అన్న ప్రశ్న కూడా ఉంది.

సినిమాది విచిత్రమైన స్వభావం ఇది పంచమంది.లలిత కళల పోలికనే పరిశ్రమ. ప్రతి ఒకరూ మరొకరిమీద ఆధారపడి ఉంటారు. అందరి కళాకౌశల ప్రజ్ఞలూ ఇందులో అందంగా కలసిపోవాలి. ఇదికాక, కొన్ని లక్షల రూపాయల పెట్టుబడితో ఉంటుంది ఆ పెట్టుబడి ఇచ్చేవారు ఒకరుకాక నలుగురు అయివుంటారు. వారి అభిరుచులు, వారి విశ్వాసాలూ వేర్వేరుకావచ్చు. అవన్నీ కూడా కలవాలి. కలిసి ఒక త్రాటిమీదకి రావాలి ఇది చాలా పెద్ద తతంగం. అంగవల్ల ఇందులో ఏ ఒకరు అనుకున్నదీ పూర్తిగా సాగడంకష్టం. అందువల్ల ఇష్టం వున్నవి కొన్ని జరగకపోవచ్చు ఇష్టంలేనివి జరగనూవచ్చు ఈ విషయంగా కొన్ని సందర్భాలలో నేను నాలాగే నాతోటి కళాకారులూ తమ హృదయం పూర్తిగా ఆమోదించని స్థితిగతులకు, కళా ప్రమాణాలకు అంగీకరించవలసి వస్తుంది. ఫలితాలు కనిపించదగినవేత్తేమ్మాత్రాన పదార్థాలు కాలని భావించడం తగదు.

పరిస్థితుల ప్రభావానికి భగవంతుడంతవాడు లొంగుతూ ఉంటాడు—

అలాగే సినిమా పరిశ్రమ పరిస్థితులూ పద్ధతులూ, సినిమావారు అనుసరించిన పద్ధతుల వల్ల ఏర్పడినవే అయినా మళ్ళీ వాటిని ఎదుర్కొని సంస్కరించుకోవడం అనుకునేటంత సులభం కాదుమరి. అయినా ఉన్న అన్నిరంగాలలోనూ— పెద్ద పెద్దజలపాతాలను భరిస్తూ, ఉత్పాతాలవంటి నష్టాలను భరిస్తూ ప్రవాహానికి ఎదురీదుతూ ఎన్నో ప్రతికూల శక్తులను ఎదుర్కొంటూ, మరోప్రక్క జీవనం సాగిస్తూ తలపెట్టినపని సాధించడం అనేది చలనచిత్ర నిర్మాణ యజ్ఞంలోనే ఎక్కువగా ఉన్నదని నా నమ్మకం..ఇక్కడే కఠినమైనపరీక్షలు ఉంటాయని నానమ్మకం.

అందువల్ల, కొందరు "సినిమా భూలోక స్వర్గం" అంటున్నపుడు (స్వర్గంలో సర్వం సుందరంగా లోపరహితంగా ఉంటుందన్న నమ్మకంతో) నేను నవ్వుకుంటాను;

కొందరు సినిమా స్థితిగతులు తెలుసుకోకుండా, మిగతా రంగాలతో దీనిని పోల్చి చూడకుండానే ఇది మంచీ మర్యాదలేని చోటు అని అపనింద వేస్తున్నపుడు బాధపడతాను.

కొందరు పెద్దలు, నాయకులూ ఏడాదికొకమారైనా సినిమాకు పోకపోయినా, సినిమాలు దేశాన్ని భ్రష్టంచేస్తున్నాయి అనీ అవినీతిని పెంచుతున్నాయి అనీ తీవ్రంగా ఖండిస్తే ఆశ్చర్యపోతాను.

సాధక బాధకాలు, మంచిచెడ్డలు అర్థం చేసుకోకుండా ఒకవృత్తిలో ఒకరంగంలో ఉన్నవారు మరొకరంగాన్ని చులకన చేయడం, విమర్శించడం భావ్యం కాదు.

మానవులందరూ సమానులని చెప్పుకుంటూ భగవంతుడు ఒకడే అని చెప్పుకుంటూ ఒకమతం వేరొక మతాన్ని, ఒకజాతి మరొకజాతిని తేలికగా చూసి హేళనచేయడం విమర్శించడం వంటిదే ఇది.

ఇంతకీ విమర్శించేవారు—సినిమా తమ అందరి జీవితాలను హృదయాలను ప్రతిబింబించేదని గుర్తుచేసుకోవాలి. అందుకనే ప్రపంచమంతటా కోట్లాదిప్రజలు దీనిని ఆదరిస్తున్నారు, ఆరాధిస్తున్నారు. అందువల దానికి హానికలిగేలా విమర్శించడం తమను విమర్శించుకోవడమే.

ఒకరంగంలోవారు తమ విశ్వాసాలనూ, మార్గాలనూ పవిత్రంగా ఎంచుకొంటున్నట్టే సినిమాలో ఉన్నవారికీ గొప్పవైన విశ్వాసాలూ, ఉన్నతమైన లక్ష్యాలూ, ప్రశస్తమైన మార్గాలూ ఉంటాయి.

రాజకీయ నాయకుడికి అతని విశ్వాసాలు లక్ష్యాలూ భగవంతుడు అయితే, నామటుకు నాకు నా కళపట్ల, వృత్తిపట్ల నాకుగల విశ్వాసమే దైవం. నేను నాకళను ఆరాధించే ప్రదేశమే స్వర్గం. అందులో తిరిగేవారే దేవతలు. ★

# మీ కేం కావాలి

(9-వ పేజీ తరువాయి)

వారు నూటికి 80 మంది అయితే, ఎవరి మటుకువారు ఎవరికితోచినపుడు వారు వెళ్ళడం ఇంకా ఎక్కువ. నూటికి 43 గురు ఈ తరహావారు.

వ్యవసాయ వ్యాపారరంగాలలో వారికన్న ఉద్యోగంలో ఉన్నవారే ఎక్కువగా సినిమాలు చూస్తున్నారు — వీరిలో నెలకు రెండువందలు లోపు ఆర్జించేవారే ఎక్కువ. బాక్సాఫీసు దగ్గర పదణాలు లోపుకు వెళ్ళేవారు ఆ పైతరగతులకు వెళ్ళేవారు ఇంచుమించు సమానం. అంటే సినిమా చూడదలచుకొన్నవారు ఒకవేళ చిన్న టిక్కెట్టు దొరకకపోయినా పై టిక్కెట్టు కొనడానికి వెనుకాడరన్నమాట. చిత్రం విడుదల అయీ అవగానే రద్దీ ఉన్నా వెళ్ళి చూసేవారు నూటికి 40 పై చిలుకు ఉన్నారు కాబట్టి పై విధంగా వీరు పై తరగతులకు వెళ్ళడం అసాధ్యంకాదని నమ్మవచ్చు.

సినిమా నిర్మాతలు గమనించదగ్గ అంశం ఒకటి ఉంది. రద్దీతగ్గాక వెళ్దామని ఆగేవారు నూటికి 60 మంది పైగా ఉన్నారు. వీరు కదలడానికి ఒ రెండు మూడు వారాలు పట్టవచ్చు. రెండో వారంలో జనం తగ్గగానే నీరసపడిపోయి ప్రచారం కూడా తగ్గించి, ఉన్న వ్యాపారం పాడు చేసేవారు ఈవిషయం శ్రద్ధగా ఆలోచించాలి.

తెలుగు సినిమామార్కెట్ తాహతుకు మించిపోయింది నిర్మాణవ్యయం. పంచవర్ష ప్రణాళిక ఫలితంగా ఏకొద్దిగానో తాహతు పెరుగుతుందనుకున్నా దానితోపాటే సినిమా తీసే ఖర్చు పెరుగుతోంది. ఈనాడు ఒక చిత్రానికి బాగా లాభం రావాలంటే చాలమంది జనం రెండేసిసార్లు చూడాలి. ఈ విషయాన్ని ఆరవప్రశ్న ఋజువు చేస్తోంది. రెండుసార్లు చూసేవారు నూటికి 56 మంది ఉన్నారు. అంతకుపైగా మూడు నాలుగుసార్లు చూసేవారు నూటికి 42 వరకు ఉన్నారు. చేతిలో డబ్బులేదని 48 గ్గురు ఊరుకున్నా చేబదులుచేసిఅయినా వెళ్ళేవారు 64 మంది ఉన్నారు. చేబదులు చేయనవసరంలేకుండా వెళ్ళేవారు సమృద్ధిగా ఉన్నారని ఊహించుకోవచ్చు.

* * *

సినిమా ప్రేక్షకులలో స్నేహితులు బాగుందన్నచిత్రం చూచేవారు నూటికి పాతికమంది ఉన్నారు. ఎవరైనా విమర్శించి బాగులేదంటే, అది ఎందుకు బాగులేదో ఎలా బాగులేదో చూచి స్వయంగా తెలుసుకొనే శ్రద్ధ, కుతూహలంగలవారు 35 గురు ఉన్నారు. పత్రికల అభిప్రాయాలు తెలుసుకుని వెళ్ళేవారు అందరికన్నా ఎక్కువ—నూటికి 39.

చిత్రప్రచార సాధనాలలో కూడా పత్రికా ప్రకటనలను శ్రద్ధగా చూచేవారే ఎక్కువగా—సగానికి పైగా—వున్నారు.

సినిమాహాలు యజమానులు గమనించతగ్గ అంశం ఒకటి ఉంది. చిత్రం ఎలా ఉన్నా, హాలూ, అందులో సదుపాయాలూ బాగుంటే చాలునని ప్రేక్షకులు నూటికి 40 పైన ఉన్నారు. ఇది వారి సరదా కాబోలు అని సరిపెట్టుకొనక, ఇపుడున్న సినిమాహాలుల మీద, అక్కడున్న "వసతుల"మీదా ప్రేక్షకుల విమర్శ అనికూడా అర్థంచేసుకొని ఈ విషయమై తగిన చర్యలు తీసుకొంటే ప్రేక్షకులు సంతోషిస్తారు.

* * *

మొత్తంమీద స్థూలంగా ఈ ప్రేక్షకాభిప్రాయాలు ఒక విషయాన్ని అసందిగ్ధంగా విశదపరుస్తున్నాయి. అది:-

"మన చలనచిత్రాలు నానాటికీ అసహజంగా తయారవుతున్నాయి. ఇప్పటి తరహాలో వాతావరణంలో త్వరగా మార్పురావడం అవసరం'' అనేది.

యుద్ధాలూ, స్టంటులూ, అనవసరపు నిడివి, దానికైన హంగులూ అవసరంలేదనీ సాంఘికాలు కావాలని మంచికథ ఉండాలనీ, తారాగణం కథ తరువాతేనని సంగీతం బాగుండాలనీ దర్శకుడి పేరును తాము గమనించడంలేదనీ వారు చెప్పిన జవాబులన్నీ ఈ జనవాక్యాన్నే బలపరుస్తున్నాయి. తెలుగు సినిమా పరిశ్రమ శ్రేయోభిలాషులూ బాధ్యతగల నాయకులూ, పెద్దలూ నటులూ అందరూ ఆయా అంశాలను ప్రేక్షకాభిప్రాయంపట్ల సానుభూతితో పరిశీలించి సాధకబాధకాలు ఆలోచించి పరిశ్రమలో ఆరోగ్యకరమైన మార్పులు తీసుకురాగలరనీ చేబదులుచేసి అయినా సినిమా చూసే 64 గురితో తృప్తిపడక, చేతిడబ్బులేదని మానేసే ఉదాసీనులైన 48 గ్గురూ కూడా చేబదులుచేసి మరీ సినిమాకి వచ్చేలా చేయగలచక్కని చిత్రాలు అందిస్తారని ఆశిస్తున్నాము. ★

## సవరణ

వనితాలోకంలో 'ఆనాటి సంక్రాంతి' రచించినవారిపేరు పొరబాటున పడలేదు. ఆ స్కెచ్ వ్రాసినవారిపేరు **కమలశ్రీ** అని గమనించ కోరుతున్నాము.




"సినిమా తార కావడం బాగానే ఉంటుంది. మనగురించి నలుగురూ మాట్లాడుకుంటూ ఉంటారు. మన నటనను మెచ్చుకుంటూ ఉంటారు కారుమీద తిరుగుతూ ఉంటాం. మంచి సూట్లూ, చీరలూ కట్టుకోవచ్చును పుస్తకాలలో బొమ్మలు వేస్తారు బీదవాళ్ళకి పక్కలు చెక్కలయేలా రూపాయలు ఉంటాయి" అని అనుకోవడం సహజం.

అయితే, ఇవన్నీ, కనీసం వీటిలో చాలా భాగం ఉన్న సినిమానటులు ఇలా అనుకోరు. ఇవన్నీ ఉన్నాయి కాబట్టి వీటిగురించి బెంగలు పెట్టుకోవలసిన అవసరం లేదు. వాళ్లు కోరు కొనేది స్వేచ్ఛ హాయిగా అందరిమల్లేనే మనమూ బజారుకు వెళ్ళి కులాసాగా తిరిగి కావలసిన చీరెలూ బొమ్మలూ కొనుక్కొ వాంటి వీధిలో బరాణీలు కొనుక్కు తింటూ

ఏ సారి అయినా ఎవరో బజారుకువెళ్ళి ఒక చోట షాపింగ్ చేస్తోంది అని తెలిస్తే అతని మీద లేక ఆమెమీద అభిమానం ఉన్నవారు చాలామంది అక్కడికి వచ్చేస్తారు ఒకసారి చూదామని అంతమంది పోగయే సరికి ట్రాఫిక్ కు ఆటంకం—ఆతరవాత పోలీసులు రావడమూ — ఒక్కొక్కసారి గలభా— ఇవన్నీ జరుగుతాయి

అందుకనే చాలమంది ఎక్కడికీ వెళ్ళరు

* * *

అందువల్ల ఒకరోజున ఒక తమిళనిర్మాత వచ్చి "అమ్మా డిసెంబరు 2న ఆగ్రాలో ఔట్ డోర్ వర్కు ఉంది" అని చెప్పగానే సంతోషంతో ఒప్పుకున్నాను తాజ్ మహల్ చూడవచ్చు ఢిల్లీబజారులలో హాయిగా షాపింగ్ చేయవచ్చు చీరెలూ, మా పాప (చిరంజీవి చాముండేశ్వరి)కి కావలసినన్ని బొమ్మలు గాజులూ కొనవచ్చు ఇక్కడే పెద్ద తమాషా జరిగింది సరిగ్గా నాకు వచ్చిన అయిడియానే నా ఫ్రెండ్స్ చాలా మందికి వచ్చిందిట—ఇంకా నేను ఢిల్లీ వెళ్తున్నాను గాబట్టి నాచేత చీరెలూ, గాజులూ, బొమ్మలూ తెప్పించుకోవచ్చునని డిసెంబరు

(మా పాపకు ఇంకా ధారాళంగా టెలిఫోను మెసేజ్ లు అందుకు (వ్రాసుకోవడము చేతకాలేదు.) టెలిఫోన్ ద్వారా, మనిషిద్వారా వచ్చిన ఆర్డర్లన్నీ కలిపి ఒక చిన్న ఫైలు తయారైంది. అందులో గుండు సూది అంత చిన్న వస్తువుల దగ్గర్నించి, లైఫ్ సైజ్ తాజ్ మహల్ దాకా రకరకాల వస్తువులకు ఆర్డర్లు వున్నాయి. మా ఆయన మిత్రుడొకరు, "ఇంగ పార్ తంగే - టైలా మజ్నా పసం పుడికలా మనికిగు—ఒణ్ణు రెండు అట్టహాం వాంగిటివాయేం" అన్నాడు నవ్వుతూ. టైలా మజ్నా సినిమా తీస్తాట్ట ఆయన. అందుకోసం ఢిల్లీలో చవగ్గా దొరుకుతాయని ఒకటో రెండో లొట్టిపిట్టలు తెమ్మంటాడు!

* * *

వచ్చేటపుడు సామాను ఎలాగా ఎక్కువ వుంటుందని వెళ్ళేముందు ఆలోచించుకుని, కొద్దిలోనే తెమిల్చేశాను. విమానంలో కాబట్టి దాన్ని తిరిగి సెన్సారు చేసి మళ్ళీ ఎడిట్ చేశాం.

ఉదయం 11-15 కు విమానం అన్నారు. భోజనం చేసి కూర్చున్నాను. ఎప్పుడు వేళ అవుతుందా అని. ఈలోగా మరికొన్ని ఆర్డరు వచ్చాయి.

ఏరోడ్రోముకు మా పాప, వాళ్ళ నాన్న; మరికొందరు మిత్రులూ సాగనంపడానికి వచ్చారు. కారు ఎక్కబోతూ వుండగా, అక్కా అక్కా అంటూ ఓ అమ్మాయి వచ్చి ఓ కాయితం గుప్పెట్లో పెట్టింది. లోపల కూర్చున్నాక తెరిచి చూస్తే మరొక ఆర్డరు.

వైకౌంట్ విమానం ఏమో, ప్రయాణం చేసినట్లు తెలిసేలోగా హైదరాబాద్ లో దింపింది. తేలిగ్గా ఫలహారం చేసి, విమానం మారాం. సాయంత్రం ఆరు గంటలకల్లా ఢిల్లీ వచ్చిందన్నారు. నిజమే ఢిల్లీయే వచ్చి వుండాలి. విమానం కదిలినట్లు నాకు తెలియలేదు...

అక్కడ మమ్మల్ని తీసికెళ్తున్న ఫిలిం కంపెనీ ప్రతినిధి ఒకాయన రిసీవ్ చేసుకున్నాడు. ఆగ్రాకి 15 టాక్సీలు మాట్లాడానన్నాడు. సామాను 14 టాక్సీలలో సర్దేశాం.

అంతా నాదికాదు సుమండీ! కంపెనీ వాళ్ళది. మేకప్, కాస్ట్యూములూ అవీను. ప్రొడక్షన్ పనివాళ్లు వాటిలో బయల్దేరి వెళ్ళిపోయారు.

చీకటిపడింది. చలి వేస్తోంది. ఆకలీ వేస్తోంది.

ఏడుగురం మిగిలాం. రాత్రికి ఇక్కడే హోటలులో బసచేదాం అన్నారొకరు. ఉదయం బయలుదేరి వెళ్తే ఆగ్రాచేరి, షూటింగుకు తయారయేసరికి ఆలస్యం అవుతుంది. ఇంకోరోజు ఉండవలసివస్తుంది. అప్పుడు మద్రాసులో కాల్ షీట్లు వున్న కంపెనీలవాళ్లు ట్రంక్ ఫోన్లు గుప్పిస్తారు. అందుకని, ఇప్పుడే వెళ్ళిపోదాం అన్నాను. నేనూ, మా దాక్షాయణీ, మేకప్ నాగేశ్వరరావుగారు, ఇంకో ప్రొడక్షన్ చీఫ్, డ్రైవరూను.

రాత్రి 7-30 కు ఢిల్లీనుండి బయల్దేరాం. ఆగ్రా 120 మైళ్లు. చలిగాలి రివ్వున వేస్తోంది.

30 మైళ్ళపాటు కారు చాలా సుఖంగా నడిచింది. అంతలో ఠాప్‌మని చప్పుడైంది ఇక్కడ మిలిటరీ కాంప్ ఉందా. తుపాకులు పేలుస్తున్నాయి అనబోతున్నా. కారు ఆగిపోయింది.

టైరు పంక్చరు అయిందట. నేను కూర్చున్న వేపు కాదు. ఎడమ వేపు.



ఇక్కడో గంట కూచోవాలి కాబోలు దేవుడా అని విసుక్కుంటూ కారు దిగాం. అంతలోనే చలిగాలి శూలంతో పొడిచినట్లు తగిలింది. కెవ్వనకేక వేసి మళ్ళీ కార్లో ఎక్కిపోయాం. తలుపులు మూసుకు కూర్చున్నాం.

## అచ్ఛీ గాడీ

ఇంకో గంటకి, రెడీ అయింది. బయల్దేరాం. పావుగంటతరవాత కారు నడక, మీదా నడత మీదా నాకు అనుమానం కలిగింది. కొంచెం పొగరుమోతు కారులా వుందే అనుకున్నాను. అది డ్రైవరు మాట బొత్తిగా వినేటులేదు. కాసేపు ఇటూ కాసేపు అటూ నిషాలో తాగుబోతు వేషంలా నడుస్తోంది.

నేను డ్రైవరును హెచ్చరించాను.

అతనూ దాన్ని వెనకేసుకొస్తున్నట్లున్నాడు. బడీ అచ్ఛీగాడీ అంటున్నాడు వాళ్ల భాషలో.

అచ్ఛీ గాడీ అయితే అయిందిగాని ఓసారి ఆపిమాడు నాయనా భయంగా ఉంది అన్నాను.

అతడు హిందుస్తానీలో చాలాసేపు ఏమిటో ఉపన్యసించాడు. ఎవరూ చప్పట్లు కొట్టలేదు. ఏమనుకొన్నాడో ఏమో కారు ఆపి దిగివెళ్లి చూసి, 'ఫిర్ పంచర్ హోగయి' అన్నాడు చాలా ఆనందంగా.

ఇందాక స్టెప్నీలోంచి తీసి అమర్చిన టైర్ కూడా ఇప్పుడు పంక్చరయిపోయింది.

భగవంతుడిని తలచుకుంటూ కారు దిగాం. చలిగాలి చాలా కసిగా వీస్తోంది. ఓవర్ కోటును తూట్లు పొడవాలని చూస్తోంది.

డ్రైవరు మాకు నానావిధాలా ధైర్యం చెప్పాడు. వాళ్ల యజమాని చాలా గొప్పవాడట. మొత్తం 25 కార్లున్నాయట. అవన్నీ ఢిల్లీ ఆగ్రా రోడ్ మీద తెరిపలేకుండా తిరుగుతూ ఉంటాయన్నాట. అసలు ఢిల్లీ ఆగ్రా రోడ్ వాళ్ల యజమాని పాతిక కార్లూ పచార్లు చేయడానికే వేయించారట. అందుచేత పదినిమిషాలలో ఏదో ఓ బండి వస్తుందనీ రాగానే అందులో స్పేర్ టైరు తీసుకుని దీనికి వేసుకు వెళ్ళిపోదామనీ ధైర్యం చెప్పాడు. అతనన్న ప్రకారం రెండు మూడు వచ్చాయి కాని అవి హిందుస్థాన్, మారిస్ మైనర్ బళ్ళు. మేము ఎక్కింది డాడ్జి బండి. అందుచేత వాటి టైర్లు దీనికి పనికిరావు.

అలా కూర్చున్నాం. చలి దారుణంగా ఉంది. ఢిల్లీలో ఉండిపోతే ఎంత బాగుండేదో తెలిసివచ్చేలా వుంది. ఏం తోచక మా తోటి ప్రయాణీకులు గానసభలు కూడా చేస్తున్నారు.

## తనకుమాలిన ధర్మం

దారినపోయే కార్లవారు మమ్మల్ని చూసి ఆగి 'మదద్ చాహియే' అంటున్నారు—ఏ పెట్రోలో అయిపోయిందనుకుని: సంగతి తెలిశాకమాత్రం తప్పుకుంటున్నారు. మీరు ఇలా వెళ్ళగానే మా కారు టైరు పేలిపోతే మాకుమాత్రం ఎలాగ అని వెళ్ళిపోతున్నారు. ప్రాణం విసుగేస్తోంది. ఆశపడడం, ఉసూరుమనడం. మళ్ళీ ఆశపడడం—ఇలాగ.

చివరికి మా మీద జాలిదలచి ఒక హిందూస్థాన్ టూరర్ వచ్చింది. అందులోవున్నాయన 'పాపం ఆడవాళ్ళు-ఇబ్బందిపడుతున్నారని' ఆకారు మాకు ఇచ్చాడు. సామానంతా అక్కడే వుంచి మనుషులం మటుకు అందులో సర్దుకున్నాం. ఆ పెద్దమనిషి అక్కడే ఉండిపోయాడు. డ్రైవరు చాలా

# ఆగ్రా యాత్ర



శ్రీమతి సావిత్రి, సహనటుడు శ్రీ శివాజీ, ఆయనభార్య.

నెమ్మదస్తుడిలా కనిపించాడు. కారును కూడా చాలా నెమ్మదిగా నడిపిస్తున్నాడు. పనిమీరా గంటకు పాతిక మైళ్ళమీద ఒక్క గజం కూడా స్పీడు హెచ్చించడానికి వీల్లేదన్నాడు.

మథురలో కారు ఆగింది. ఏదైనా తిందామని హోటలుకోసం వెతికాం. అన్నీ మూసివున్నాయి. ఒక్క చిన్న దుకాణం మిణుకు మిణుకు మంటూంది—మా ఆశలా. తినేందుకు దూధ్ పేడా తప్ప మరోటేం లేదన్నాడు. ఆకలికడుపు మీద వట్టి స్వీటు తిని ఊరుకోడం మాకేం నచ్చలేదు. మేము అక్కడ మీమాంసచేయ్యడంతో అతనికి విసుగేసింది. 'కావాలా వద్దా నిద్రపోవాలి' అన్నాడు విసుగ్గా. తీసుకున్నాం. డబ్బు లిచ్చి తినడం మొదలు పెట్టేలోపలవాడు తలుపు వేసుకున్నాడు. మేము దూధ్ పేడా తింటూ బయల్దేరాం. దాహం. మంచినీళ్ళు అంది మా దాక్షాయణి. మిగతావాళ్లూ మంచినీళ్లు కావాలన్నారు. నాకూ అంతే. కాని ఎక్కడా దొరక లేదు. ఎక్కిళ్లతో అవస్థపడి, ఇంకో మూసేస్తున్న షాపులో మంచినీళ్లు అడిగిలేవనిపించుకున్నాం.

రాత్రి ఒంటిగంటవేళకి ఆగ్రా చేరాం. గోకుల్ హోటల్ అనేచోట మాకు బస ఏర్పరచారు. మేము వెళ్ళేసరికి అక్కడ మా యూనిట్ లో వారు మా కోసం ఆత్రతగా ఎదురుచూస్తూ గుమ్మంలో నిలబడి ఉన్నారు! తొమ్మిదికల్లా రావలసినవాళ్ళేమయ్యారూ అని - అర్థరాత్రివేళ అయినా భోజనాలు సిద్ధంగా ఉంచారు. ఇందుకోసం మద్రాసునుంచి వంటవాళ్లను ముందే పంపి ఉంచారట. అఖిలభారత భోజనం చపాతీ మాత్రం తిని నిద్రపోయాం.

* * *

ఆగ్రాకు 29 మైళ్ళదూరాన ఒకచోట మా చిత్రానికి షూటింగ్. ఉదయమే బయల్దేరి ఎనిమిదిన్నరకల్లా చేరుకున్నాం. అక్కడా, షాజహాన్ భవనంలోనూ, తాన్‌సేన్ సమాధి దగ్గర, ఆయన గానసభలు చేసినచోట పంచ మహల్ వద్ద షూటింగ్‌కు లొకేషన్ ఏర్పాటు చేశారు.

పన్నెండుదాకా పని చురుకుగా సాగినా, పన్నెండుకు ఆకలి చుర్రుమనేసరికి పని మందగించింది. నెత్తిన ఎండకూడా చుర్రుమంటూంది. కాని షూటింగ్ ఆపేసి విశ్రాంతికని ఆగ్రా వెళ్తే చిక్కు. 3-30 తరవాత ఎండ పోతుంది. వర్కు పూర్తి కాకపోతే ఇంకో రోజు ఉండాలి. కంటిన్యూ చేద్దాం అమ్మాయీ అన్నారు హీరో శివాజి(గణేశన్)గారు. ఆయన మా కన్న ముందే ఢిల్లీ వెళ్లి, ఆగ్రాలో కలుసుకున్నారులెండి. సరె బ్రేక్ లేకుండా కాల్ షీట్ పెంచాం. మూడున్నరదాకా డూయెట్ పాటకు అభినయం చేస్తూ ఆ ఎండలో ఒకళ్లనొకళ్లు తరుముకుంటూ పరుగులెత్తాం. అంతేగా.

## స్పెషల్ డిన్నర్

సాయంత్రం ఆగ్రా చేరేసరికి, "మీకోసం స్పెషల్ విందు. నడిగవేల్ ఎం.ఆర్. రాధా (తమిళ దేశంలో ప్రసిద్ధ కారెక్టరాక్టర్ ఆయన) స్వయంగా గరిట పుచ్చుకున్నారన్నారు. చాలా సంతోషించాం కాని నెమ్మదిమీద తెలిసింది. రాధాగారికి వంట చేతనౌనుగని చేసి చాలా కాలం అయిందిట. పాతకాలపు జ్ఞాపకాలు నెమరు వేసుకు వండుతున్నారు.

పూర్వం మా కాలంలో సాంబారులో ఉప్పు వేసివాకమరి...కొంత చింతపండు, కొన్ని మిళగు, మొళగా (మిరియం, మిర్చి) కూడా వేస్తుండడం ఆనాటి సంప్రదాయం ఇలా ఒకొక్కటే గుర్తుచేసుకుంటూ వంట కానిచ్చారు.

భోజనాలకు కూర్చున్నాక తీరా ముద్ద నోట్లో వేసుకోగానే నోరుభగ్గుమంది. కారం. కంటగ్గిరున నీరుతిరిగింది మాఅందరికీని. ఒకరుస్తూ తింటున్నాము. నడిగవేలుగారు వచ్చి 'అమ్మా ఎప్పడి సంబ ళమియల్' అన్నారు (వంట ఎలా ఉంది? అని)

'ప్రమాదం' అన్నాను నేను నవ్వు, ఏడుపూ ఆపుకుంటూ (ప్రమాదం అంటే అరవంలో చాలా బాగుందని అర్థం).

ఆయన మురిసిపోతున్నారు

ఒక్కసారిగా నలుగురం పోట్లాడాం—"ఇదెక్కడి సాంబారు స్వామీ. సేజిమీద మీరు పలక వేషాలేసి వేళాకోళంగాక, ఇలా కారం పెట్టడం న్యాయమా"అని. పున్నమి వెన్నెల చల్లదనంకూడా రాధాగారి వంటకాల కారాన్ని చల్లార్చలేకపోయింది.

* * *

ఆమర్నాడు తాజ్ మహల్ ను వెన్నెలలో చూశాం—జన్మ తరించిందనిపించింది దాన్ని అలా చూస్తున్నప్పుడు నాలో తోచి తోచకుండా అందీఅందకుండా మెసలిన భావాలను ఇక్కడ వ్రాయగలిగి ఉంటే, నేను బహుశా సినిమా ఆర్టిస్టును కాక, రాయటంలోనో బొమ్మలు గీయటంలోనో ఆర్టిస్టును అవడానికి కృషిచేసేదాన్నేమో.

* * *

అక్కడే చక్కని బజారు ఉంది. కళ్ళు తిరిగిపోయేటన్ని సరుకులు ఉన్నాయి. మద్రాసులో నా స్నేహితురాళ్ళు ఇచ్చిన ఆర్డర్ల ఫైలు తీసి చూసి, కాశ్మీరీ చీరలు, బొమ్మలు, గాజులు, మావారికి కాశ్మీరీ కుర్తా ఇవన్నీ కొన్నాను. మర్నాడు ఆగ్రా బజారులో షాపింగ్‌కు వెళ్లాం. మద్రాసులో చైనాబజారంతరద్దీగా, అంతకన్న ఇరుకుగా ఉంది. శివాజీ శ్రీమతి, నేనూ అన్ని షాపులూ చూచి చాలా బొమ్మలూ అవీ కొన్నాం. ఈ సందడిలో దారితప్పిపోయాం. సినిమాలో పాత్రలలా ఆ బజారు సెట్ మీదనే అందరం తిరుగుతున్నా మా డ్రైవరూ వాళ్లూ మాకోసం, మేమిద్దరం వాళ్ళకోసం తిరగ సాగాం. చివరికి డ్రైవరుకు విసుగేసి, తాను

కారు ఆపిన చోట కూర్చున్నాడు అక్కడికి రాం పోతామా అని. మేము తిరగ్గా తిరగ్గా ఓచోట కారు కనబడింది. సాక్షాత్తు దేవుడే కనిపించినంత పనైంది ప్రాణానికి. సాయంత్రం నాలుగయింది భోజనాలు ముగిసేసరికి. ఒక్క పదినిముషాలు విశ్రాంతి తీసుకుని లేచి దయాల్ బాగ్ భవనం సందర్శించాలనుకున్నాం. కాని—

సాయంత్రం ఆరింటికి తెలివివచ్చింది!

## రెండు 'తాజ్'లు

తాజ్ మహల్ పగటి వేళ కూడా చూడక పోతే జన్మతరించదని ఎవరో చెప్పగా విని మర్నాడు ఉదయం భోజనాలు చేసి బయలేరాం. శివాజీ అందరికీ కిళ్ళీలు తెప్పించారు. స్పెషల్ కిళ్ళీలని చాలా బాగుంటాయట. ఇక్కడ ప్రత్యేకతట. వేసుకున్నాం. నిజమే మంచి పరిమళం. కాని కారు తాజ్ మహల్ చేరుకుని దిగేసరికి నాకు తలతిప్పడం ప్రారంభమైంది. తాజ్ మహల్ లు రెండెప్పుడు కట్టించారు బాబూ అనుకున్నాను. ఇంకో నిమిషానికి నాలుగు కనిపించాయి ఆశ్చర్యంతో అడిగాను, నాలుగున్నట్లు ఎవరూ చెప్పనేలేదే అని.

వాళ్లంతా నటనఅనుకుని నవ్వుతున్నారు. తరవాత ఒకొక్కరూ ఇద్దరేసిగా కనిపిస్తున్నారు. తల తిరిగిపోతోంది చెమటలు పోశాయి. అక్కడే కూలబడిపోయాను.

పావుగంటతరవాత తెలిసింది. స్పెషల్ కిళ్ళీ మహాత్మ్యం అని. అందులో వాళ్లు ఏవో తలతిరిగే పదార్థాలు వేశారట.

మధ్యాహ్నం విశ్రాంతి తీసుకుని సాయంత్రానికి ఢిల్లీ చేరుకున్నాం. అక్కడే పెద్ద షాపింగ్. ఈసారి ఆర్డర్ల ఫైలంతా పట్టుకు బయలేరాం. ఆగ్రాలాగే ఇక్కడా ఎవరూ మనజోలికి రారు కబట్టి హాయిగా తిరుగుతూ అన్నీ చూస్తూ చూస్తూ కొంటూ తింటూ సరదాగా ఉత్సాహంగా ఉంది. చీరలు, గాజులు, చెప్పులు, చోళీగుడ్డలు, కర్చీఫ్‌లు బొమ్మలూ రకరకాలవి కొనుక్కున్నాం.

ఒకచోట ఒక షాపుదగ్గర ఎవరో తెలుగువాళ్ళు కామోసు—సావిత్రిలా వుందే అంటున్నారొకరు. లాగేంటి సావిత్రే అంటున్నాడు ఒకాయన.

నాకు నవ్వొచ్చింది ఆమాట వినగానే. వాళ్లు వచ్చి పలకరించారు. పదినిముషాలు కబుర్లు చెప్పి, షాపింగ్‌లో మాకు కొంచెం సాయంచేసి వెళ్లిపోయారు. ఢిల్లీలో మేము పార్లమెంటుసభ్యుడు ఇ. వి. కె. సంపత్ గారింట్లో బసచేశాం. వారంతా చాలామర్యాదలుచేసి ఆదరించారు. ఆ సాయంకాలం ఢిల్లీ తమిళ సంఘంవారు శివాజీగణేశన్ గౌరవార్థం విందుచేశారు. అక్కడ నన్నుకూడా మాట్లాడమన్నారు.

మర్నాడు పదిన్నరకి యాత్ర ముగించి విమానాశ్రయం చేరాం.

అక్కడ నేను చేరవేయించిన సామాను చూసి శివాజీ హడలిపోయారు.

ముందర 'ఎవరో అమాయకులు ఎంత సామాను తెచ్చారో చూడు" అన్నాడు నవ్వుతూ.

"అమాయకు లేంకాదులే" అన్నాను.

"ఇంత సామాను ఎలా తీసుకువెళ్తారో పాపం" అన్నాడు.

"నిక్షేపంలా పట్టికెళ్తారు. మరేమీ ఫరవా లేదు" అన్నాను.

ఈసారి ఆయనకి ఉక్రోషం వచ్చింది. ఇదేం బస్సనుకున్నావా, రైలనుకున్నావా మీవూరి మాటుబండి (రెండెడ్లబండి) అనుకున్నావా? అన్నాడు. ఇందులో కొంత సామాను ఇక్కడే "మరందువుడలాం" (మర్చిపోదాం) అన్నాడు బతిమాలుతున్నట్టు.

నీకెందుకయ్యా వాళ్లు పట్టుకొస్తారే. నువ్వు ఈగొడవ మర్చిపోదూ బాబూ అని బతిమాలాను. అయితే లొట్టిపిట్టలు కూడా తేలేకపోయావా అన్నాడాయన వేళాకోళంగా.

తేలేదని నమ్మకమేమిటి, ఏ పెట్టెలోనో బెడ్డింగులోనో ఒంగి కట్టించే ఉంటుంది. లగేజీబిల్లు చూసే గాని తెలీదు అన్నారు ఆయన మిత్రుడొకరు నవ్వుతూ.

* * *

ఇంటికి చేరేసరికి టెలిఫోన్ కాల్స్ కుప్పతిప్పలుగా వచ్చాయి.

"నేను చెప్పింది తెచ్చావా?—చీరలు మర్చిపోలేదుగదా...అన్నట్లు నువ్వు కులాసాగా చేరావా?" అంటూను.

తెచ్చినసామానులో ఎవరివివాళ్ళకి కేటాయించి పంపించడానికి నేనూ మా సెక్రటరీ గారూ ఒకరోజూరోజు పనిచేశాం.

మాపాప చాముండేశ్వరి కూడా సాయం చేస్తానని పట్టుపట్టి ఉండకపోతే ఒక పూటలో అయిపోయేదనుకోండి. ★

# మరపురాని మధురానుభూతి

(20 వ పేజీ తరువాయి)

వేయకపోతే మీరు పిడకలు దండలు ఎక్కడ వేసుకుంటారేం' అంటూ వాళ్ళమ్మదగ్గరించే లాగ మాటాడిన నాకు కావలసినన్ని అటుకులు బెల్లం దొరికేవి.

"బాగున్నావ్ చంద్రం. ఆ మురికి... మట్టి..." నవ్వేది లక్ష్మి. "పోవే పెద్ద చెప్పొచ్చావ్! పండగరోజుల్లో రోజుకి ఒకజత మాసినా ఫరవాలేదు" దబాయించాను నేను.

ఆ రోజు సాయంత్రం లక్ష్మి వాకిట ముగ్గుపెట్టి, పేడముద్ద పెట్టి, గొబ్బిపూలు, చామంతి పూలతో పూజ చేస్తోంది. వాళ్ళమ్మ 'సుబ్బి గొబ్బెమ్మ' అంటూ పాట చెపుతుంటే లక్ష్మి అనుసరిస్తోంది. 'మొగలిపువ్వంటి - మొగుణ్ణీయవే' అను లక్ష్మీ!' అంటూ ఏడిపించాను. నిజానికి లక్ష్మిని ఏడిపించటం సరదా! ఏడుస్తుంటే మళ్ళీ నవ్వించేవాడ్ని. నిజానికి రంగవల్లులు తీర్చి దిద్దిన వాకిట, పాట పాడుతూ ప్రదక్షిణాలు చేసే లక్ష్మి భరతనాట్యం చేస్తున్నట్లుగా ఉండేది. తరచు డబ్బిచ్చి గంగిరెద్దవానిచేత పొగడించుకునేది. అది నాకూ సరదాగానే ఉండేది. వాడు డబ్బు పుచ్చుకుని పొగడ్తలన్నీ పొగిడి దరిదాపు డజను దాటించేవాడు మాకు పుట్టబోయే పిల్లల్ని.

గొబ్బిళ్ళుపెట్టుకుని, 'చంద్రం, ప్రసాదం తీసుకో' అంటూ లక్ష్మి నా చెయ్యి పట్టమనేది భీష్మించుకున్న నన్ను. నా చేతులు మురికిగా ఉంటే నోరు తెరు' అంటూ ప్రసాదాన్ని నోట్లో వేసేది. చిన్నతనపు చిలిపితనంతో లక్ష్మివేలు కరచేవాడ్ని. పెద్ద ముత్తైదువులంతా "ఏమిటే లక్ష్మీ! ఇప్పటి నుంచి చంద్రాన్ని నీకొంగట్టుకుని తిప్పుకుంటున్నావు! చిలకాగోరింకల్లా ఉన్నారు". అంటూ మమ్మల్ని చూసి అనేవాళ్లు. నేను చిలిపిగా నవ్వుతునేవాడ్ని. లక్ష్మి బుంగమూతిపెట్టేది. ఆ కాలం గడిచిపోయింది.

అవును. ఆ లక్ష్మి నా భాగ్యలక్ష్మి. నా లక్ష్మి ఎవరో కాదు. నా బాల్యస్నేహితురాలు. చిన్నతనం గుర్తుకి వచ్చింది. నా హృదయంలో సాగిందో పెద్దగాధ!

* * *

"కాఫీకిరారా" అంటున్న కరుణాకర్ మాటలు నా చెవిని పడలేదు. ఎన్నిసార్లు పిలిచాడో ఉలిక్కిపడి ఉన్నపళంగా నే బయలుదేరి కాఫీఫలహారం పూర్తి చేయటానికి వెళ్ళాం! సత్యంగారు భార్యతో సహా గుడికి వెళ్ళారు. చిట్టిపాప, భాగ్యలక్ష్మి, కరుణాకర్, నేను కాఫీ తీసుకుంటున్నాం.

నా చుట్టూ ఎన్నో ఆలోచనలు సాలీడు లేనులా తిరుగుతున్నాయి. చిట్టిపాప నా ప్రక్కగా కూర్చొంది. నా ముఖంలోకి చూస్తూ, "మీరు గొబ్బిళ్ళు పెట్టుకొంటారా? నేను సాయంత్రం గొబ్బిళ్ళు పెట్టుకుంటాను" అంది. నా కండ్లవెంట కన్నీరు జలజలా కారింది. "ఏమిటది?" అంటూ విచిత్రంగా చూశాడు కరుణాకర్. నేను ఏమీ మాట్లాడలేదు.

"పోనీలెండి. సాయంత్రం మీకు బెల్లం అటుకులు పెడతాను. ఏడవకండి" అంటూ ఓదార్చింది చిట్టిపాప. "అలాగే పెడుదువు గాని" అన్నాను. 'ఇది ఏడుపు కాదు. ఆనందబాష్పాలు. ఇది అనుభూతిలోని అమరలోకం. నాలో నేనే ఆ ఆనందం అనుభవిస్తున్నా!'

ఈ మాటలు చిట్టిపాపకు అర్థంకావు. ఆమెకు అర్థమయ్యే భాషలో నా హృదయాన్ని చెప్పలేను. పాపను తీసుకుని ఎత్తుకున్నాను. అక్కడనుంచి లేచి నంచున్నాను. పాపను ఎత్తుకొన్నాను.

ఎవరో పిలుస్తున్నారు. అస్పష్టంగా నా పేరు వినిపించింది. వెనక్కు తిరిగాను. లక్ష్మి అచేతనంగా టేబిల్ మీదకు ఒరిగిపోయింది. "ఇప్పుడే వస్తాను" అంటూ డాక్టరు దగ్గరకి హడావిడిగా పరుగెత్తాడు కరుణాకర్. చిట్టిపాప ఏడుపుతో గుడిదగ్గరకి పరిగెత్తింది నా చంక దిగి. చన్నీళ్ళు ముఖాన చల్లాను. చేతులు సైతం వణికిపోయాయి. ఆమె పెదవులు 'చంద్రం' అన్న శబ్దాన్ని కలుగచేస్తున్నాయి.

ఎందుకిలా పడిపోయిందో వాళ్ళకు తెలీదు కాని నాకు తెలుసు. చిరకాలంగా తనలో అజ్ఞాతంగా నిలిచిపోయిన వ్యక్తి ఎన్నో ఏళ్ళ అనంతరం అకస్మాత్తుగా ఊడిపడితే తనదుఃఖాన్ని అపుకోలేక చైతన్యాన్ని కోల్పోయింది. ఆమెకు తెలుసు తన చిన్ననాటి స్నేహితుని హృదయం ఎలా బాధపడుతుందో!

"చంద్రం" ఆమె మెల్లగా పిలిచింది.

దగ్గరగా వెళ్ళాను. ఆమె ముఖంలోకి తొంగి చూశాను. అర్థనిమీలిత నేత్రాలతో నా వైపే చూస్తోంది. మెల్లగా ఆమె పెదవులు విచ్చుకున్నాయి.

"నువ్వు......"

"అవును...నాకు తెలియకుండా వచ్చాను."

"తప్పులేదు. రావచ్చును," నెమ్మదిగా పలికింది.

కాని భయం నన్ను కారుమబ్బుల్లోని

చంద్రుణ్ని చేసింది. నాకిది అగ్నిపరీక్ష... చంద్ర గ్రహణం.

"ఏ సంక్రాంతి వేరు చేసిందో, ఆ సంక్రాంతే తిరిగి మనల్ని కూడదీసింది చంద్రం!" భాగ్యలక్ష్మి మాటలు నన్ను పూర్తిగా శోకాగ్నికి గురిచేశాయి. ఆమె తిరిగి ఏదో చెప్పబోయింది. కాని చెప్పకుండానే స్మృతి గోల్పోయింది.

"లక్ష్మీ! ఏం జరిగింది" అంటూ యింటివారంతా వచ్చి చేరారు. చిట్టిపాప ఏడుస్తోంది.

కరుణాకర్ నిరాశగా తిరిగి వచ్చాడు. ఖిన్నుడై నిలబడ్డాడు. అందరూ భగవంతుని ప్రార్థిస్తున్నారు. భాగ్యలక్ష్మిని లేవదీసి గదిలో మంచంపై పరుండబెట్టారు. పూర్తిగా తేరుకోలేదు. ఎవరితోను మాటాడటంలేదు. ముఖాలు పరిశీలించి చూడటంలేదు. లక్ష్మికివి తుది ఘడియలేనా? అన్నట్టుంది. ప్రశాంతతని భంగంచేస్తూ డాక్టరుగారు వచ్చారు. దేవుడల్లే వచ్చారు! అందరూ ఆయనకు నమస్కరించారు. లక్ష్మి దగ్గరకి వచ్చారు. అందర్ని బయటకు వెళ్ళమన్నారు. తప్పింది కాదు.

డాక్టరుగారు ఇవతలకి వచ్చారు. "ఫరవాలేదు. ఇంజక్షనిచ్చాను. ఎవరికోసమో బెంగ పెట్టుకుని ఉండాలి! కోలుకోవటానికి రెండు మూడు రోజులు పట్టవచ్చు. మందు పంపుతాను. ఏకాంతంగా ఉండనివ్వండి," అని చెప్పారు. గుమ్మం మెట్లు దిగి, వెళ్ళిపోతూ ఆగి, వెనక్కు తిరిగి, "చంద్రంట ఎవరూ?" అన్నారు. దానికి సమాధానం ఎవరూ ఇవ్వలేదు. డాక్టరుగారు వెళ్ళిపోయారు. చంద్రం ఎవరో మరోసారి తెలుసుకోమన్నారు. నిజంగా ఎవరికి తెలుసు-నన్ను 'చంద్రం' అని చిన్నప్పుడు పిలిచేవారని? నేనయినా ఈ విషయం కరుణాకర్‌తో ఎప్పుడూ చెప్పలేదు.

ఎవరిపనుల్లో వారు నిమగ్నులయ్యారు! గదిలో కరుణాకర్ ప్రక్కగా ఆమె ఏకాంతం భంగం కాకుండా చూస్తున్నాడు. నాకు తెలియకుండానే నేనో సోఫాలో చతికిలపడ్డాను. 'చంద్రం ఎవరన్నది పెద్ద చిక్కుప్రశ్న వారికి! నిజానికి, నాకు తెలుసున్నా నేనెంత ప్రయోజనాన్ని కలిగిస్తానో నాకే తెలియదు. వారికి తెలుసుంటే ఏం ప్రయోజనాన్ని సాధించేవారో! ఇదీ నాకు తెలియలేదు.

కరుణాకర్ చక్కని కాపురంలో ఈ సంక్రాంతి పండుగరోజుల్లో చిచ్చు పెట్టానా? నిజానికి నాకేం తెలుసు? రెండేళ్లుగా కరుణాకర్‌తో స్నేహం ఏర్పడింది. అసలు లక్ష్మి నా బాల్యస్నేహితురాలని, నా కవుతుందనుకొన్న నా భాగ్యలక్ష్మి యని కరుణాకర్‌కి తెలుసా? తెలుసుంటే కరుణాకర్ లక్ష్మిని పెండ్లి చేసుకుంటాడా? ఇందులో లక్ష్మి తప్పేముంది? పదేండ్లుగా కనపడని నన్ను గుర్తుంచుకోవాలని ఎక్కడుంది? కరుణాకర్ నింతకీ చేసుకుందా? అసలు వివాహితా? లేక అవివాహితా? నా యీ ప్రశ్నలకి సమాధానం చెప్పేదెవరూ? లేరు. అవును భగవంతుడు. అంతటి యోగ్యత నాకు లేదు!

ఏ ఒక్కరూ మాట్లాడరు! డాక్టరుగారు ప్రశాంతవాతావరణం కావాలన్నారు. పెద్దగడియారం 'టిక్ టిక్' మనే శబ్దం తప్ప మరేవిధమైన చప్పుడూ లేదు. ఎన్నో రకాలుగా తలలో తలపులు! సమాధానంలేని ప్రశ్నలు! ఊహ కందని రకరకాల ఆలోచనలు ఎన్నో ఉంటాయనిపించింది. డాక్టరుగారి ప్రవేశంతో మరోసారి భయం, ఆందోళన, కంగారు ఆ ప్రశాంత వాతావరణాన్ని ముట్టడి చేశాయి. అందరూ ఆయనకు ఏదో చెప్పబోయారు. ఆయన ఏమీ మాట్లాడవద్దన్నట్టు "ఉష్" అని లోనికెళ్లారు.

ఆమె నా బాల్యస్నేహితురాలని చెబితే బాగుంటుందనుకున్నా! కాని అంతమాత్రం చేత ఆమెకు నయం అవుతుందా? చెప్పకపోతే ఏం ప్రమాదమో? చెపితే కరుణాకర ఏం అపోహ పడతాడో? ఒకవేళ నేనే అపోహ పడుతున్నానా?

డాక్టరుగారు తిరిగి వచ్చారు. అందర్ని బయట వీధిలోకి తీసుకెళ్లారు. ఆయన ప్రక్కనే నుంచున్న నన్ను గుర్తించలేదు. 'చంద్రం అన్న వ్యక్తితో చాలా పని వుంది. అతను కావాలి' అన్నారు. ఆయనకేం తెలుసు నేనే చంద్రాన్నని!

"డాక్టరుగారూ! ఎంతైనా ఖర్చుచేయండి. లక్ష్మి ఒకటి, చిట్టి ఒకటి కాదు. ఇద్దరూ రెండు కళ్ళు." డాక్టరుగారి చేతులు పట్టుకుని, బతిమాలుతున్న సత్యంగార్ని చూస్తే జాలి వేసింది. కరుణాకర్ ఇంకా ఏదో ఆలోచనలో పడ్డట్టే ఉంది. "కరుణాకర్! ఏదో ఆలోచించు 'చంద్రం' కావాలి" అన్నారు డాక్టరుగారు కరుణాకర్ వైపు తిరిగి. డాక్టరుగారి మాటల్లో ఏమయినా సరే చెప్పేద్దామనుకొన్నాను. కాని ఎవరో ఎందుకో నా గొంతు నొక్కేస్తున్నట్లయింది. ఏమీ చెప్పలేక పోయాను.

"ఒరే నువ్వే చంద్రంగా నటించాలి. ఏమంటావ్. చెప్పు" అన్నాడు కరుణాకర్. బతిమాలుతున్న అతని ముఖాన్ని చూస్తే జాలి వేసింది. కాని అతను చెప్పిన పని ఆలోచించినప్పుడు ఒక్కమారుగా గజగజ వణికిపోయాను. ఇది గోరుచుట్టుపై రోకటి పోటయింది. ఆలోచిస్తూ నుంచున్నాను.

"అవును. పని జరగొచ్చు," అంటూ డాక్టరుగారు కూడా నన్ను సమీపించారు. నేను నటించాలి. కాదు నటన శైలితో యథార్థతనే ప్రదర్శించాలి. ఇది మరీ కష్టమైన విషయం. కాని ఆమె దీని ఫలితంగా కోలుకొంటుంది. ఆమె క్షేమంగా ఉండటమే కావాలి. పోనీ ఏమయితేనేం నిజం చెప్పేద్దాం అనిపించింది. "మందు పంపుతాను మనిషిని పంపించండి." అంటూ డాక్టరుగారు వెళ్ళిపోయారు.

'చంద్రం'. హుఁ! చిన్నప్పుడు వలుగుతూ సరదాకి పిల్చిన పేరు. పెద్ద ప్రసాదం తెచ్చి

# మరపురాని మధురానుభూతి

పెట్టింది ఇప్పుడు కాకపోయినా మరొకప్పుడైనా చంద్రన్ని నేనేనని తెలియక పోదు. ఆనాడు అందరూ నేనంటే అసహ్యించుకుంటారు.

'చక్కని కాపరంలో చిచ్చుపెట్టాను. లక్ష్మికి కల ఉందో! తగ్గుతుందా? భోగిమంటకి అర్పించేస్తున్నానా? ఆమెకు ముందుగా నేనుపోతే మంచిది నా గురించి ఆమె గాని పోకూడదు.' ఆలోచనతో నా హృదయం బరువెక్కింది. సనపాలతో నా తల నొక్కి పొడుస్తున్నట్లుంది

సంక్రాంతి పండుగ రోజులు ఎవరూ తిండి తిప్పలు సంగతి ఆలోచించనైనా లేరు నిద్రను మొహాన వాచారు.

మెల్లగా లేచి ఆమె దగ్గరకు వెళ్ళాలనుకున్నాను. వడిలే ఆమె నన్ను చూసి మరింత బాధపడుతుందేమోననుకున్నాను. నిజం చెప్పాలని నా హృదయంలో నిశ్చయం చేసుకున్నాను ధైర్యంగా ఆమె గదిలో ప్రవేశించాను—నిజం చెప్పాలని

కరుణాకర్ ఆ గదిలోనే ఉన్నాడు ఆమె ప్రశాంతతకు భంగం కలకుండా కిటికీలోంచి దూరంగా ఏదో చూస్తున్నాడు. 'పల్లె వాతావరణం తప్ప ఏముంది బయట' అనుకున్నాను. ఆలోచనలు తెగక బాధపడుతున్నట్టే ఉన్నాడు. ఏం చూస్తున్నాడో ఊహించలేకపోయాను ఆ క్షణంలో ఆ యిల్లు వదిలి పోవాలనుకున్నాను కాని ఎందుకో కదలేక పోయాను. కరుణాకర్ దగ్గరగా వెళ్ళాను

ఆ గంభీర ప్రశాంతతలో ఆమెలో ఏ భావాలు రైలు చక్రాలులా గబగబా తిరుగుతున్నాయో ఊహించాను నన్ను కరుణాకర్ చూశాడు. మాట్లాడలేదు. కరుణాకర్‌ని బయటకి రమ్మని సంజ్ఞ చేశాను.

ఎక్కడికో తెలియని ప్రయాణం సాగిస్తున్నాం. కరుణాకర్ ఏదో చెప్పబోయాడు. అదే కాలంలో నేనూ చెప్పబోయి ఆగాను. ఏ విషయం మాట్లాడలేక పోయాం. ఇంటికి ప్రక్క పదిగజాల దూరంలోని మామిడి తోట చేరుకున్నాం. అక్కడ ఎవరూ లేరు కనుక, కరుణాకర్‌తో 'నేనే చంద్రాన్ని' అని చెప్పి, క్షమాపణ కోరుకోవాలనుకున్నాను. కాని నోరు పెగిలిరాక ఊరుకున్నాను.

'ఏరా. మనం బయలుదేరిన వేళ మంచిది కాదేమో' అన్నాడు. 'ఔ' నన్నాను.

"అసలు భగవంతుడు ఎంతరా స్త్రీలంటేరా. పాపం! చూడు లక్ష్మి మా సంగ చేరింది. కష్టాలు అనుభవిస్తోంది. ఆమె జీవితమే అంత

తలిదండ్రులు యాత్రకని భద్రాచలం వెళ్ళారు. ప్రమాదవశాత్తు తలిదండ్రులు, పులివాత బడ్డారు. చిన్నతనంలోనే బాల్య వివాహం చేశారు. అందంలేని పిల్ల కాదు, ఆస్తి వుంది. కాని" ఏదో బాధగా చెప్ప బోయి, పెదవులు చప్పరిస్తూ, చెప్పలేక ఊరుకున్నాడు. నాకు మరి ఆందోళన కలిగింది.

"స్నేహితుడివి కదా అని, చెపుతున్నా, వినరా. ఆమెకు చిన్నతనంలోనే వివాహం చేశారు. అది ఆమె కిష్టంలేదు. భర్త అందంగానే ఉంటాడు. కాని...చిన్నతనంలోనే ముచ్చటమురిపమూ తీరకుండా చనిపోయాడు. ఏదో జరిగిపోయింది. మాఅమ్మానాన్న ఆమెను విధవగా చూడలేక, ఆమెను లోకంలో కన్యగా పెంచుతున్నారు." అంటూ జలజల కన్నీరు కారుస్తూండి పోయాడు.

ఒక్కసారిగా నా కాలిక్రింది భూమి కంపించి నట్టయింది. నేనెక్కడికో అథఃపాతాళానికి పోయి నట్టైంది. ఆమెకి ఈ సంఘంలో స్థానం లేకుండా చేశాడు భగవంతుడను కున్నాను.

చాలాసేపు మౌనంగా గడిచిపోయింది. ఎవరమూ మాటాడుకో లేదు. 'ఇంటికి పోదాం పదా' అంటూ కరుణాకర్ భారంగా లేచాడు. ఇద్దరం మెల్లగా బయల్దేరాం. అసలు, లక్ష్మి కోసం ఏం చెయ్యటానికి ఆలోచన తోచ లేదు. ధైర్యాన్ని, ఆలోచనా శక్తిని చేర దీసుకోవాలనుకున్నాను. గదిలోనికి తిరిగి చేరుకున్నాం.

లక్ష్మికి నేనే చంద్రాన్నని తెలుసు. ఆమెను క్షమాభిక్ష వేడుకోవాలనుకొన్నాను. దగ్గరగా వెళ్ళాను. ఆమె నావైపు దీనంగా చూస్తోంది. ఇంటివారంతా అక్కడ చేరారు. మెల్లిగా సైగలు చేసి తలగడ క్రిందనుండి ఏదో తియ్యమని చూపింది. మెల్లిగా తీశాడు కరుణాకర్. అదో పెద్ద కాగితం. అది చూస్తూ నన్ను సమీపించి. "నువ్వే నా చంద్రానివి" అన్నాడు నావైపు చూసి!

"ఔను" అన్నాను తలవంచి. ఆ కాగితం నాకిచ్చాడు. ఆశ్చర్యపోయాను. దానిపై నా చిత్రమే వేసిఉంది. "చంద్రానికో మాలికోసు" అనిరాసి ఉంది దానిపైన.

ఏ విధంగా ఆమెతో నన్ను మన్నించ మనాలో తెలీలేదు!

"క్షమించు, లక్ష్మి. నేను నిన్ను బాధ పెట్టాను. నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. పెళ్ళి చేసుకుంటాను." ఏదో బాధగా, భారంగా, సిగ్గుగా చెప్పాను. ఆమె ఇది విని మరింత కృంగి పోయింది. కరుణాకర్ కుటుంబమంతా నిశ్చేష్టులయ్యారు.

"క్షమించండి. లక్ష్మి నా బాల్యస్నేహితురాలు. కాని ఏదో విధివశాత్తుజరిగిపోయింది. మా పవిత్ర ప్రేమకు ఆటంకం రానివ్వద్దు. అన్నివిషయాలు నాకు తెలుసు' అన్నాను వారి ఆమోదంకోసం ఎదురుచూస్తూ!

ఆమె పెదవులు 'చంద్రం' అన్నట్లు కణుకుతున్నాయి. కన్నీరుకారుస్తోంది. పెదవులపై ఆనందం తాండవించింది. ఏలక్ష్మిని ఏడిపించాలని, ఏడ్చేటప్పుడు నవ్వించాలనుకునే వాడినో ఆ లక్ష్మిని నవ్వించగలిగాను.

కరుణాకర్ ఆమె చిత్రం ప్రక్కనే నా చిత్రాన్ని చేర్చాడు. ఆనందంతో కన్నీరు కార్చారు అందరూ!

అల్లంతదూరంగా గర్భగుడిలో గంటలు! దూరంగా కుప్పనూర్పుల కేకలు! సాయంకాలపు పిల్లవాయువులు! పూలతోటలో మాలతీ పూలవికాసం! అదంతా జీవితంలో గోప్యంగా దాచుకున్న మధురానుభూతి! ★

# ★ పందిరి మంచం ★

(52 పేజీ వ తరువాయి)

కొత్త టెన్నిసాడివద్దామని ప్రెస్సు వేసు కుంటుండగా సింహాద్రి గునగున పరుగెడుతూ వెళ్లాడు. "ఇంకా వాడికి మాటలే సరిగా రావు. అయినా వాడిదికూడా ఒకభాషే; అదే దివ్యులభావమేమో! వచ్చి జగన్నాథం టెన్నిసు రాకెటు పట్టుకొన్నాడు"

"నాన్నాలూ...నా తో....తా నీ... యిస్కలూ..." అడిగాడు.

"కానీ—కావాలా నాన్నా.. దేనికో చెప్పు." వాడి గడ్డముపట్టి బుజ్జగించాడతడు ప్రేమగా.

"మలేం! మేం! మోతాలాత...ఆడు కుంతామ్...నాతు...తిక్కు తియ్యాంత.. తానీ యిత్తే...యిత్తాలంట..."

జగన్నాథానికి మాటలు వినీ వినకముందే తన చిన్నతనం జ్ఞాపకానికి తెచ్చినట్లయింది. గతమంతా చెక్కు చెదర కుండా ప్రతీ చిన్న అంశముతో కనుల ముందు చూడసాగాడు. ఒకానొకప్పుడు తామూ మోటారాట లాడారు. ఇప్పుడు బాబు ఆడబోతున్నాడు. ఇదేదో చిత్రముగా తోచిందతనికి ఈలాంటి సంఘటనలు కూడ ఋతువులవలే తిరిగి తిరిగిపోతుంటాయేమో ననిపించింది. తనకూ ఆడుకోవాలనుంది. అయితే తనతో ఎవరు ఆడతారు? ఆ అమాయక దివ్యలోకానికి వెళ్లగల అర్హతి తన కిప్పుడుందా! ఆడటానికి వెళ్లినా, తనకు మునుపటి అనుభవమే కలుగుతుందా... మునుపటి అనుభూతి కలగకపోతే...అయినా తన కెవరు తంతాగు బస్సు విరగ్గొడితే!

సింహాద్రి తనకున్న తొందర నాన్నకు లేదేమా! అని ఆశ్చర్యపడ్డాడు. ఆయన కళ్లలోకి చూడసాగాడు. కోపాలు ఎక్కడ. జగన్నాథం గడ్డాన్ని గట్టిగా తన మృదువైన వేళ్లతో త్రిప్పాడు.

'నాన్నాలూ.. ఇస్కాలూ..మా బచ్చు.. పోతుందిత...తియిము లేదంత ... ఇయ్యి నాన్నాలూ—"

"ఆ! ఇస్తాగాని...మీ బస్సు ఏ వూరి దిరా? నేనూ వస్తా నీతో సాటే ఆ వూరికి. తీసుకపోతావా" ప్రేముగా అడిగాడు జగన్నాథం.

సింహాద్రి కాదన్నట్లు తల త్రిప్పుతూ... "ఊహూ! మీ...లాదూ...మా బచ్చులో అంతా...చిన్న వాళ్లకే ... అది ఉత్తిత్తి బచ్చులే నాన్నాలూ...మీతు ... తెలీ [illegible] నాన్న అజ్ఞా న్ని క్ష ం చేసాల్సిందిగాను [illegible] అన్నాడు [illegible]

"[illegible]గేయి. గాడూ.. కానీ కాను... [illegible] యిస్తా నన్ను ఆడుకోనివ్వండి

మరి...ఏం! సరేనా!" జగన్నాథం కూడా అనుజ్ఞకై కాచుకున్నాడు.

"ఓ! ఇదో. బావను...తినుత్తుంతా నుండు..."

"బావేనుంటాడులేరా! పద. పోదాం."

రూపాయి చిల్లరకు పిల్లలంతా తమ ఆమోదాన్ని చ్చారు. వారి బస్సు గదిలోని పందిరి మంచమే. జగన్నాథం మేనల్లుడు కిశోర్ కండక్టరు, సింహాద్రి డ్రైవరయ్యారు.

"నువ్వే వూరికి..." అడిగాడు కిశోర్, పాతటిక్కీ తీస్తూ.

"అసలిది ఏ వూరుపోతుందో చెప్పండి" కొంచెముగా ముసి ముసి నవ్వుతో అడిగాడు జగన్నాథం.

"ఇది మావూరెళ్తుంది" అన్నాడు వాడు.

"మీ వూరంటే ఏదీ?" ప్రశ్నార్థకంగా చూచాడు.

"ఆఁ! ఒంగోలు, మామయ్యా" కోమలవల్లి అంది.

"సరే, నేనూ అక్కడికేరా. పోనిండి" తృప్తిగా పలికాడు.

"తే. కానీ ఇయ్యి మరి." వాడు టికెట్ తుంచాడు. చేతిలో పెట్టాడు.

"అయితే ఈలా కూచుంటేనే నిజంగా మీ బస్ పోతోందిరా" అందరికీ వినిపించేటట్లుగా నవ్వాడు జగన్నాథం.

"ఇవో...అత్తా.. నవ్వతే...మా ఆత లోంచి పో...నువు మాతో దూ."ప్రయిగరు సింహాద్రి కోపంగా అరిచాడు.

"లేదులే అబ్బాతండ్రీ..." అని నవ్వుత నోరు మూసుకున్నాడు జగన్నాథం.

ఆఁ! ఇంకెవరికి టికెట్" అంటూ అటూ యిటూ మంచం చివర చిన్న అడుగులో పచారుచేసి అడిగాడు వాడు.

ప్రక్కయింటిలో నించి వచ్చిన పిల్లలు కూడ బస్సెక్కారు. సింహాద్రి ఒక అమ్మాయిని 'పాం! పాం' అనమన్నాడు. ఆపిల్ల వూరికే అంటూంటే వాడు కోపపడ్డాడు. "బచ్చు...పోయే తప్పుడే...అనాలి. తెలుసా..."ఆపిల్ల మూతిముడిచింది. ఇంతలో వాడు"బుగ్ ..."అని నోటి మిషను స్టార్టు చేశాడు. పిల్లలంతా హాయిగా వూర్లకు పోతున్నారు జగన్నాథంకూడా ఏవో లోకాలు చుట్టుగలగా డా గోలలో.

దారిలో బస్సు చెడిపోయిందని సింహాద్రి అరిచాడు. కండక్టర్ కిశోర్ మంచం క్రింద దూరి రిపేరీ చేస్తున్నాడు. "బస్సు[illegible] ముగాళ్ళంతా దిగి తోయండి " అజ్ఞ జరీ [illegible] [illegible] [illegible] [illegible] [illegible] నన్నాథం కూడ 'పళ్లు బిగబట్టి' బాగా తో [illegible].

ఇంతలోకే ఇంకా వచ్చిం[illegible]. మారింది.

"ఏమిటండీ...మీరు మరీ కుర్రాళ్ళయి పోతున్నారు... కాఫీ కూడా కాబట్టలే దీనంబరంలో..." అందామె హేళనగా.

"చూడూ... నీవు కూడరా. పుట్టింటి కెళ్ళవుగాని. ఏం" ఆమోదించమని ప్రాధేయ పడినట్టు చూచాడు.

"అవునత్తయ్యా... కోపూరు కూడా పోతుందిది" అంది కోమలం చేతులు త్రిప్పుతూ.

ఇందిరకు నవ్వు ఆగలేదు. జగన్నాథం బస్సుఆపి ఉంచమన్నాడు కాస్సేపు. కండక్టర్ 'హోల్డాన్' అన్నాడు. సింహాద్రి ఆపాడు.

జగన్నాథం మంచందిగి ఇందిర రెండు చేతులు పట్టిలాగి మంచంలో కూచోబెట్టాడు.

"అబ్బో బలేబస్సండి...దీనిలో రోజూ పుట్టింటికి పంపేట్టున్నారే, మీరు ఖర్చు దమ్మిడీకూడా లేకుండా" భర్తముఖంలోకి చూచి అందామె.

"రైట్" అన్నాడు కిశోర్.

"బుర్..." పోనిచ్చాడు నోటి మోటారును సింహాద్రి.

"ఆఁ బద్వేల్ వచ్చింది. దిగి కాఫీతాగి రాండి." అరిచాడు కండక్టర్.

"రాండ్రా...మీ అందరికీ బజ్జీలు పెడతాను" పిలిచింది ఇందిరమ్మ.

"ఊహూ...ఇత్తల ఒతలు పెత్తాలులే" అన్నాడు సింహాద్రి.

"ఉహూఁ" అందామె ఆశ్చర్యంగా.

"ఇందూ. కాఫీ టిఫినూ అందరికీ ఇక్కడికే తీసుకురా" అన్నాడు జగన్నాథం.

ఆమాటలని పిల్లలవైపు చూచాడు. పిల్లలు తలలూచారు. టిఫినులైపోయాయి.

"ఆ! ఎవరయ్యా బండ్లోంచి దిగింది. రండి...రండీ గాడీ కదుల్తోంది–చలో–రైట్" అన్నాడు కిశోర్.

ఇందిరా జగన్నాథాలిద్దరూ బాలల ఆనందంలో భాగం పంచుకోలేకపోయారు. వారికేవేవో తెగనిమాటలు.

"ఆఁ ఆత్మకూరు..." అరిచాడు కండక్టర్...బస్సుదిగి వెళ్ళి పోలీసుస్టేషనులో చేవ్రాలు చేయటానికి వెళ్ళాడు.

జగన్నాథంకంటే ఇందిరకిది వింతగా తోచింది. ఈ ఆనందం తన కొడుకుదా? తనభర్తదా! తనభర్తఎవరు! తనకొడుకెవరు! తెలుసుకోలేకపోయిందామె. జగన్నాథంను అనుకోని అలాగే ఆలోచించసాగింది. ఆ ఆలోచనలకు జగన్నాథం అడ్డుతగిలాడు.

"ఇందూ...ఈ రాత్రికి ఇక్కడ పడుకుందామా." మెల్లగా అడిగాడతను.

"ఏం! మళ్ళీ కుమిలికుమిలి ఏడుద్దామనుకుంటున్నారా..." ఒయ్యారంగా చూచిందామె.

"ఏడవనులే. పిల్లలున్నారుగా... అన్నయ్య పేరుతో వీడున్నాడుగా." అన్నాడతను.

"ఏమో వాడిక్కడ పడుకుంటాడూ? తక్కువా" ఆమె వింతగా చూచింది.

"వాడికేం అడుగుతానుండు. ఒరేయి అప్పలూ...ఈ రోజు రాత్రి యీ బస్సులోనే నిద్రపోదామా" అడిగాడు జగన్నాథం.

"కిచోలు తూదాదా." అనుమానంగా అడిగాడు వాడు.

"వాడు వాళ్ళమ్మదగ్గిరికి పోతాడులేరా. నీ సంగతేమిటో చెప్పు" నిక్కచ్చిగా ప్రశ్నించాడు.

"అయితే...నేనూ...అమ్మదగ్గిరే. తెలుచా." వాడూ ఖండితంగానే జవాబిచ్చాడు.

"ఈ ఒక్కరోజూ అమ్మదగ్గర పడుకోకపోతేనేం..." ఎగతాళిగా చూచాడు—జగన్నాథం.

"ఊహూఁ నేలాను. నే నమ్మదగ్గిరె పడుకుంతా" అన్నాడు సింహాద్రి.

"సరే పోరా! వెధవా. మీ అమ్మే ఇక్కడ పడుకుంటుంది నాదగ్గర..." చిరునవ్వుతో అన్నాడు.

"ఔ, అమ్మ పడుకుంటావా" వాడు ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏమిటండీ మీరు మరీను–కొంచెమైనా, పిల్లలున్నారనైనా గమనించకుండా" సిగ్గుతో అందామె.

"ఆఁ పిల్లలూ...పెద్దలూ. ఎవరు పిల్లలు? ఎవరు పెద్దలు. అసలు మనం పెద్ద ఎందుకు కావాలి. అయినా నీకు తెలీదులే. మనకు ఈ రాత్రి కిక్కడే పక్క వెయ్యాలి... తెలుసా" నిర్భరానందంతో నిండిందా స్వరం.

"అత్తయ్య మామయ్య దగ్గర పడుకుంటుంది. హే...హే...హే..." అరిచారు పిల్లలు.

ఇందిరా జగన్నాథములు ఒకరినొకరు చూచి నవ్వుకోసాగారు.

"రైట్...అవురే...డ్రయివర్... చలో...శిదా. నెల్లూర్" కండక్టర్ కిశోరు హుకుం జారీచేశాడు.

"అబ్బా! నువు "పాం" "పాం" అను. నేను పోనిత్తా...ఊఁ" అని ఒప్పందం చేసుకున్నాడు ఉంకొంక పాపతో సింహాద్రి.

బస్సు కదిలించాడు–"బుర్........" తుమ్మెదలాగా శబ్దం చేశాడు. పందిరిమంచం మోటారైంది గది లోపలనే ఉండికూడా. ఏ మోటారూ వెళ్ళలేని చోట్లన్నీ తిరగసాగిందది. కిశోరు నోటికి ఏ వూరిపేరువస్తే ఆ వూరంతా అది తిరిగింది.

పందిరిమంచం ఆ రాత్రి ప్రాణంతో పొంగిపోయింది. అందులో జగన్నాథం దిశ తెరగని ప్రయాణం చేయసాగాడు. ఆ ప్రయాణంలో త్రికాలాలకూ ఐక్యత సిద్ధించింది.

నాటికీ నేటికీ పందిరిమంచము ఆయింట్లో

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక - కొత్తరకం గొలుసుకట్టు

ఇది ఇంకొక రకం గొలుసుకట్టు. ఒక్కొక్క ఆధారం చదివి, సరియైన మాటను ఒక కాగితంమీద వ్రాసిన తరువాత, ఆధారం ఎదురుగా వే బ్రాకెట్లలో వున్న సంఖ్యల ప్రకారం, సంఖ్యలున్న ఆయా గడులలో ఆ మాటలోని అక్షరాలను వ్రాయాలి. ఆధారాని కెదురుగా ఎన్ని సంఖ్యలుంటే ఆమాటలో అన్ని అక్షరాలుంటాయని వేరే చెప్ప నక్కర లేదు.

ఉదాహరణకు:-'బి' ఆధారంలో- "వెదక బోతే కాలికి తగిలినది" అనేదానికి సమాధానంగా రెండక్షరాల మాట వస్తుంది. దానిలో మొదటిఅక్షరం 49 గడిలోను, రెండోది 40 లోనూ వెయ్యాలి. అదేవిధంగా మిగతా గళ్లు అన్నీ నింపితే ఒక శతకంలోని పద్యం తయారవుతుంది.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 |
| 31 | 32 | 33 | 34 | 35 | 36 | 37 | ■ | 38 | 39 |
| 40 | 41 | 42 | 43 | 44 | 45 | 46 | 47 | 48 | 49 |

### ఆ ధా రా లు

ఎ. ప్రార్థన. (10,35)

బి. వెదకబోతే కాలికి తగిలినది (49, 40)

సి. సాధారణంగా ఇది పీగింది అంటారు. (37, 32)

డి. ఈ పేను మాట్లాడదు. (4, 26, 36)

ఇ. మనల్ని చూసి ఆశ్చర్యపడి పలకరించి నప్పుడు గౌరవంగా, ఒక భక్తగాయకురాలి పేరు పలుకుతారు. (15, 5)

ఎఫ్. కిల్లీలో వాడే ఒక సుగంధ ద్రవ్యము. (42, 39, 44)

జి. నక్కకి కొమ్ము తిరిగిన 'దాక్కొనిన' (27, 11, 23)

హెచ్. తీరని (కోరిక!) (25, 8, 17, 29, 6)

ఐ. ఈ లోయ బీహార్ లో ఉంది (24' 19, 45, 14)

జె. నుంచో పెట్టమని ఈ విధంగా కూడా వ్రాయవచ్చు. (30, 18)

కె. చిన్న కొండ. (31, 8)

ఎల్. మనకు పట్టని గ్రహచారములో తొందరపాటు లేదు. (16, 34, 20, 9)

ఎమ్. ఒక వింతసభ ఏర్పరచిన ఇతిహాస వ్యక్తి. (48, 43, 38)

ఎన్. పెళ్లి అయితే కలిగే చుట్టం. (28, 13)

ఓ. ఈ పేరులో ప్రథమావిభక్తి ప్రత్యయం తీసేస్తే మిమ్మల్ని సమీపించము! (46 22)

పి. అడవిలో నీరు. (41, 12, 33)

క్యూ. రాత్రిపూట రాక్షసి. (1, 47, 21)

ఆర్. నక్షత్రము (7.2)

### 12-వ నుడికట్టుకు జవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1ఆ | గ | డ | ము | ■ | 2అ | డ | కు | 3వ |
| స | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | రా |
| 4రా | కా | శ | 5శి | ■ | 6ప్ర | ద | ము | లు |
| ■ | ■ | ■ | లు | ■ | ర | ■ | ■ | ■ |
| 7కు | వ | కు | వ | ■ | 8క | ర | వా | 9లం |
| లు | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | కె |
| 10కు | చ్ఛి | త | 11ము | ■ | 12వ | దం | తు | లు |
| ■ | ■ | ■ | 13డి | 14గో | లి | ■ | ■ | ■ |
| ■ | ■ | ■ | ■ | డి | ■ | ■ | ■ | ■ |

# సంక్రాంతి శుభోదయం

(5-వ పేజీ తరువాయి)

నిద్రపోవటముచేత బావవెంట ఎవరువచ్చిందీ తను చూడనేలేదు. ఆనాటి పుదయం కూడా మామూలుగా గొబ్బెమ్మల పూజచేసి పాట పాడుతూ చుట్టూ ప్రదక్షిణము చేస్తూన్న తను ఎదురుగుండా ఎవరున్నదీ గమనించనే లేదు.

"గుమ్మడిపండంటి- కొడుకూ నియ్యావె" అని గొబ్బెమ్మలకి నమస్కరించి తలఎత్తేసరికి పైజామా, లాల్చీ, దానిపైన స్వెట్టరు చేతులో "బ్రష్" ఆ అబ్బాయి తనవంక అదే పనిగా చూస్తూ ఎదురుగుండా నిల్చొని వుండేసరికి, "కోపంతో ఈయుగవాళ్లకు వేరే పనిలేదు. ఎదురుగుండా ఆడపిల్ల కనుపిస్తే గుడ్లప్పగించి చూడటముతప్ప, ఆ అబ్బాయి తను పాటపాడటముకూడా విన్నాడావిం?" అనిసిగ్గుపడిపోయిందితను. అయితే ఈఅబ్బాయిఎవరు, ఎందుకిక్కడకువచ్చినట్లు? రాత్రి బావవచ్చాడంది అమ్మ. క్రిందటిసారి తన మాట నిజం చేసుకునేందుకు బావవెంట పెట్టుకురాలేదుకదా ఈ అబ్బాయిని? అనుకుంటూనే ఆ అబ్బాయిని తలెత్తి, ఒక్కసారి చూసిందితను.

అంతలోనే "యింకొ సరిగ్గా నూర్యోదయమైనా కాలేదు. మరదలుపిల్ల గాలం విసిరేస్తోంది. అసలే మా మరదలు అసాధ్యురాలు. ఆమెచూపుల వలలో పడ్డానంటే తప్పించుకోటము కష్టమోయ్" అన్నాడు 'బావ'. ఆనాటి సంక్రాంతి శుభోదయాన తమపెళ్లి చూపులు అట్లాముగిసి ఈ ప్రేమ మూర్తితనవాడయ్యేందుకు కారణమయినది. మరొకసారి తృప్తి తొంగిచూసింది శ్యామల కళ్లలో.

ఊహాలలో తేలిపోతున్న శ్యామల కనుపులో ఏదోకుడులు తిరుగుతూన్నట్లు బాధగా వున్నట్లు అనిపించింది. చూస్తూండగానే ఆనొప్పులు భరింపరానివే అయ్యాయి. తృళ్లిపడి లేచిన శేఖర మంత్రసానికోసం పరుగెత్తాడు. తల్లి అటూ ఇటూ ఖంగారుగా తిరుగుతూ మొక్కులు మొక్కుకుంటోంది.

ఉదయిస్తూన్న సూర్యునితో పాటు సంక్రాంతి తన వార్షికము తప్పకుండా శ్యామలకు సుపుత్రుని ప్రసాదించింది. మగపిల్లవాడే. పండులా వున్నాడు" అని తల్లి మంత్రసాని అనుకుంటూంటే 'నీరసంతో మూతలు పడుతూన్న కళ్లను విప్పి ఒక్కసారి పాపడి కేసి చూసి ఇదీ "సంక్రాంతి ప్రసాదమే" ననుకుంటూ తృప్తిగా కళ్లు మూసుకుంది శ్యామల. ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad..